

శ్రీ శృంగేరీ శారదాంబదేవి

శంకరభగవత్పాదుల

# వివేక చూడామణి

ప్రకాశం

(ఆంధ్ర వివరణం)




ఆచార్య సార్వభౌమ

ప్రొఫెసర్ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి

ఎం.ఏ. పిహెచ్.డి.(తెలుగు) ఎం.ఏ. పిహెచ్.డి.(సంస్కృతం)

Retired Prefessor of Telugu, Andhra University

# వివేక చూడామణి

ప్రథమ ముద్రణ : 2009 శ్రీ శంకర జయంతి

ప్రతులు : 500



మూల్యం : రూ॥ 40-00

ప్రతులకు :

ఆచార్య సార్వభౌమ

**ప్రొఫెసర్ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి**

శారదా పీఠం

46-15-35, దొండపర్తి

విశాఖపట్నం-530 016.

ఫోను: 0891-2541003

సెల్: 94900 84217

గ్రాఫిక్స్:

**బి. వెంకటరమణ**

సెల్: 99856 91983

ముద్రణ:

**సత్యనారాయణ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**

4-6-143, తిలక్‌రోడ్, కరీంనగర్. (ఆం.ప్ర.)

ఫోన్: 0878-2243026



శారదాపీఠమైన మా సదనమందు
నిందు కొలువయియుండెడి నీరజాక్షి
జ్ఞాన విజ్ఞాన నిధుల నొసంగుదేవి
అమ్మ శారద పాదమ్ములాశ్రయింతు.

# సమర్పణం



శ్రీమదప్పల్ల వంశాబ్ధేః కౌస్తుభం సుధియం గురుమ్
శ్రీసోమేశ్వర శర్మాఖ్యం నత్వా భక్త్యా సమర్ప్యతే॥

# కృతజ్ఞతా నివేదనం

సంస్కృతాంధ్ర సాహిత్య తత్త్వోపదేశకులైన విద్వత్పట్టభద్రులు కీ॥శే॥ వేమూల కృష్ణమూర్తి పితృపాదులకీ

ఎంతో వాత్సల్యంతో ఎన్నో శాస్త్రవిషయాలని నాల్గు దశాబ్దులుగా బోధిస్తూ ఈ గ్రంథ రచనా సందర్భంలో ఎన్నో సూచనలిచ్చి ఈ రచనని వారికి భక్తితో సమర్పించడానికి ఆమోదించిన "వాచస్పతి" ఆచార్య అప్పల్ల సోమేశ్వరశర్మ గురుచరణులకీ

బ్రహ్మతత్త్వోపదేశం చేసిన పండితులు కీ॥శే॥ గంటి లక్ష్మీనారాయణ గురుపాదులకీ

నా వాగ్దేవతా వరివస్యని హార్దికంగాను ఆర్థికంగాను ప్రోత్సహిస్తూ ఈ గ్రంథ ముద్రణకి పదివేల రూపాయలు వాత్సల్యంతో అనుగ్రహించిన సదాశివ స్వరూపులు "సద్గురు" డా॥ కందుకూరి శివానందమూర్తి గురుదేవులకీ

ప్రతి గ్రంథ రచనకీ ముద్రణకీ సౌజన్య సౌహార్దాలతో చేయూతనిస్తున్న అపూర్వసోదరులు ఆత్మీయులు "ఆర్షవిద్యాభూషణ" శ్రీ గట్టు నారాయణ గురూజీ గారికీ

నమోవాకం ప్రశాస్మహే॥

ఈ గ్రంథాన్ని చూసి సూచనలతో అభిప్రాయాన్ని పంపిన న్యాయ వేదాంత శిరోమణులు ఆచార్య ఓరుగంటి రామలాల్‌శర్మ గారికి హార్దిక కృతజ్ఞతలు

ఈ వివేక చూడామణిని రెండు పర్యాయాలు అధ్యయనం చేసి తనివితీరక ఈ వివరణకి ప్రేరణ నొసంగిన అర్ధాంగి శ్రీమతి వేమూల ప్రభావతి M.A. కీ

ఈ గ్రంథం అమెరికాలో మా పెద్దబ్బాయి చి॥ వేమూల వేంకట సుబ్రహ్మణ్యం B.Tech., M.B.A.(USA) ఇంట్లో TALLAHASSI (Florida State)లో ఉంటున్నప్పుడు రచింపబడింది. ఆ పిమ్మట మా రెండవ అబ్బాయి డా॥ వేమూల రామకృష్ణ B.Tech., Ph.D.(USA) ఇంట్లో ఉన్నప్పుడు తుది మెరుగులతో తీర్చిదిద్దబడింది. కాబట్టి ఆ చిరంజీవులిద్దరికీ వారి కుటుంబ సభ్యులకీ

ప్రూఫులు సరిచేసిన ప్రియశిష్యుడు చి॥డా॥ యు.వి.యస్.యస్. శాస్త్రి (Lecturer in Telugu, GVP Junior College, Visakhapatnam) కీ

**శుభాశీః పరంపరలు**

వివేకచూడామణికి రచింపబడ్డ వివిధ వ్యాఖ్యానాలు ఈ రచనా సందర్భంలో బాగా ఉపయోగపడ్డాయి. ఆ రచయితలు అందరికీ, ప్రత్యేకంగా శ్రీ **కాముర్తి వేంకటసుబ్బయ్య** గారికీ, ఆచార్య శ్రీ **పుల్లెల శ్రీరామచంద్రుడు** గారికీ కృతజ్ఞతాభివందనాలు.

అందంగా ఈ విధంగా ఈ గ్రంథాన్ని ముద్రించడానికి పూనుకొన్న మిత్రులు శ్రీ **జక్కని ప్రభాకర్** గారికి ప్రత్యేక కృతజ్ఞతలు.








## డా॥ కె. శివానందమూర్తి
D.Litt.

ఆనందనిలయం
భీమునిపట్నం
విశాఖపట్నం జిల్లా, ఆంధ్రప్రదేశ్
ఇండియా–531 163
ఫోన్: 08933–229505


ఆచార్య సార్వభౌమ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన "వివేక చూడామణి ప్రకాశము"ను దయతో నాకు చూపించినారు. వారికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథం శ్రీమద్ ఆదిశంకరుల వాఙ్మయమునందు అత్యధిక ప్రచారము, సామాన్యపఠితృలోకమునందు అత్యధిక ఆదరము పొందిన గ్రంథమగుటచే శతాధిక వ్యాఖ్యానములు అనేక భాషలలోను, తెలుగునందునూ కూడా ప్రకటింపబడినవి. ఇన్ని వ్యాఖ్యానములేల అనినచో అవన్నియూ ఆగ్రంథ ప్రచారమునకు దోహదము చేసినవి. అంతేకాక అనేక వర్గముల పఠితలకు కాలానుగుణ్యముగ సుబోధకము లయినవని సమాధానము.

శ్రీ శాస్త్రిగారి వివరణము అత్యంత సులభము అగుటచే అర్థము సుబోధకమగుటకు, ఎన్నిమారులైనను చదువుట కష్టము కాదు. శ్లోకములకు తాత్పర్యము, వివరణము కలిగిన ఈ గ్రంథమందు శ్రీ శాస్త్రిగారు ఒక విశేషమైన పారిభాషిక వివరణమును పొందుపరిచినారు. ఇది ఆధ్యాత్మికవాఙ్మయము చదువుకొనువారికి వరప్రసాదము. బోధనా సాధనా నిష్ఠులగు శ్రీ శాస్త్రిగారికి సప్రశ్రయ అభినందనలు తెలుపుకొనుచున్నాను.



వ్యాకరణాలంకార చక్రవర్తి, సాహిత్య విశారద
సర్వజ్ఞశేఖర మహోపాధ్యాయ వాచస్పతి
**ఆచార్య అప్పల్ల సోమేశ్వరశర్మ**
ఎం.ఏ.పి.ఒఎల్. డి.లిట్



విశ్రాంత సంస్కృతాచార్యులు
ఆంధ్ర విశ్వవిద్యాలయము

ఇ.నెం. 50-96-8/2
సీతమ్మధార, నార్త్ ఎక్స్‌టెన్షన్
విశాఖపట్నం-530 013.
దూరవాణి: 0891-2528410

శ్రీః

## ఆమోదము ఆశీస్సు

తేది: 15-1-2009

మాది విద్యావంశం. ఇంచుమించు అయిదు దశాబ్దులుగా మా శైష్యోపాధ్యాయిక మూడు పువ్వులు ఆరు కాయలు అయి విరాజిల్లుతున్నది. "ఆచార్యసార్వభౌమ" శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు ఎంతో వాసి అయిన ప్రియాంతేవాసి. నన్ను ఆరాధిస్తున్నారు. గురుసార్వభౌముడను అయిన నాకు ఇది ఎంతో గర్వకారణం. ఈ శిష్యభృంగం గురుకమలంనుండి మకరందాన్ని అదే పనిగా ఆస్వాదిస్తున్నది. నాకు తెలిసిన సకలశాస్త్ర పాఠాలను ఆయనకు నేనందించినాను.

శ్రీ శాస్త్రిగారు ఇదివరకే బహుప్రబంధ. కాని అవన్నీ ఒక ఎత్తు. ప్రకృతం ఈ వివేక చూడామణి వివరణం ఒక ఎత్తు.

ఆదిశంకరుల అద్వైత చూడామణులలో ఇది వాస్తవంగా చూడామణియే. దీనికి ఎంతోమంది మహాశయులు ఆంధ్రభాషలో వ్యాఖ్యలు, వివరణలున్ను వ్రాసినారు.



శ్రీ శాస్త్రిగారు కూడా తమ వివరణమును పొందుపరచినారు. నేను దీన్ని ప్రత్యక్షరమున్ను పరిశీలించినాను. సుబోధంగాను, మృదుమధురంగాను వ్యాఖ్య సాగింది. పారి భాషిక పదాలన్నింటికిన్ని చక్కని అర్థం కూడా చూపినారు. ఇదొక విశేషం. ఎన్నో ఉండగా మరల ఇదెందుకు? అనవక్కరలేదు. రామాయణాన్ని ఎంతమంది వ్రాయలేదు? అలాగే ఇది కూడా. "ఆత్మవస్తుకామాయ సర్వం ప్రియం భవతి" అందిగదా! ఉపనిషత్తు. అస్తు.

ఈ వ్యాఖ్యకు "ప్రకాశం" అన్న పేరును నేనే సూచించినాను. ఈ రచన నాకు అంకితమయింది. "మోదః ప్రమోదః ఆనందః". వివేక చూడామణి యొక్క వివేక చూడామణి, వివేక చూడామణికే అంకితం కావడం వివేక చూడామణియే అవుతుంది.

శ్లో॥ అద్వైత చూడామణిరయం
శ్రీ వివేక చూడామణిః
ప్రభాయాః స్వీయయా భూయాత్
అజ్ఞాన తిమిరాపహా॥

విబుధ విధేయుడు

**అప్పల్ల సోమేశ్వరశర్మ**



# ఆంధ్రులకు అమూల్య ఆభరణం



శ్రీ ఆదిశంకరాచార్యులు జగద్గురువులు. అద్వైతమార్గ స్థాపకులు ఆర్షవిజ్ఞానం అనే వెలుగును జగద్ధితం కొరకు ప్రసారం చేసిన మహాద్రష్టలు. మరియు తన శిష్యులను తనలాంటి గురువులుగా రూపొందటానికి దోహదం చేసిన పరమగురువులు.

వారు మన అందరికీ మనలోనే ఉన్న దివ్యత్వాన్ని మరల మరల గుర్తుచేయటానికి తత్త్వమసి (ఆ పరమాత్మవు నీవే) అనే సత్యాన్ని వేయివిధాలుగా (ఉపదేశ సాహస్రీ) నూరువిధాలుగా (శతశ్లోకీ) పదివిధాలుగా (దశశ్లోకీ) మరియు ఒకేవిధముగా (ఏకశ్లోకీ) పలువిధాలుగా నొక్కి చెప్పినారు. భజగోవిందం నుండి బ్రహ్మసూత్రాల వరకు ఆయన రచించిన అనేక గ్రంథాలన్నీ మహిమాత్మ్యప్తమైన అమూల్యమైన మణులే.

ఆ అమూల్యమణిరాశిలో వివేకచూడామణి ఒక చూడామణి. ఆదర్శప్రాయమైన గురుశిష్యుల సంవాదరూపమైన చర్చ ఎలా ఉంటుంది, గురువు శిష్యుణ్ణి ఏవిధంగా అత్యంత కరుణతో, ప్రేమభావంతో, మైత్రితో మొదలు చేయిపట్టుకొని నడిపించి చివరకి పరమాద్వైత స్థితిని అనుభూతి చెందటానికి త్రోవ చూపించి ఏరీతిగా విజ్ఞానవర్షం కురిపించి ఒక్కొక్క మెట్టు పైకి తీసికోవాలో అని తెలిపే అద్భుత అద్వైత గ్రంథం వివేకచూడామణి.

ఆదిశంకరుల ప్రతిభ అసమానము. ఆయన జ్ఞానప్రభ వెలుగేగాక చాలా లోతైన తర్కముతో వాదప్రతివాదనలతో అత్యున్నత సిద్ధాంతాలతో వేడినికూడా కల్గిస్తుంది. మరల మరల అధ్యయనం చేస్తే కాని అవగాహనం కావటం కష్టం. అలాంటి సూర్యప్రభ లాంటి వేడిని ఆచార్య సార్వభౌమ శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు వెన్నెలలలాగా తేటతెలుగులో సులభగ్రాహ్యంగా మనకు అందించినారు.

శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు సరస్వతీమాతకు సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో సాహిత్య విజ్ఞాన విద్యారంగాలలో అనర్గళ సేవచేసిన తపస్వి. వేదవేదాంత వేదాంగ విశారదులు. అనేక ఆధ్యాత్మిక సాహిత్య విజ్ఞాన గ్రంథాల రచయిత. ఉత్తమ గురువర్యులు. వైదికమార్గ అనుష్ఠానపరులు. అద్భుతమైన వక్త. ఆయనను ఆచార్యసార్వభౌములుగా విజ్ఞానవివేక విభూషణులుగా లోకం గౌరవించి అభినందించింది. వారు సాహిత్యాధ్యాత్మిక రంగాలలో మా సహచరులు. ప్రియమైన సోదరులు. మరి శ్రీ సీతారామ సేవాసదన్ సాహిత్యసేవలో యోగదానం చేసిన సేవాయోగులు.

"శంకర భగవత్పాదుల వివేకచూడామణి ప్రకాశం" మన ఆంధ్రులందరికీ కానుకగా వారిచ్చిన అమూల్య ఆభరణం. గ్రంథం మొదట్లోనే వారిచ్చిన ప్రధాన పారిభాషిక పదవివరణం పాఠకులకు చాల ఉపయోగకరం. ముఖ్యమైన క్లిష్టమైన వేదాంతపరమైన పదములకు



క్లుప్తంగా సంపూర్ణార్థకరంగా వారిచ్చిన వివరణలు చాల అందంగా ఉన్నాయి. జహదజహ లక్షణ, పంచీకరణం, ప్రాగభావం, లింగశరీరం వంటి గూఢమైన పదములను ఆయన తేటపరిచిన రీతి చాలా బాగుగానున్నది. మరింత సులువుగా శాస్త్రిగారు ఆత్మకు సంబంధించిన పదాల వివరణ చాలా క్లుప్తంగా *(Bullet Points of Executive Summary)* తెలిపినారు.

గ్రంథంలోని అన్ని వాక్యాలూ అర్థపూర్ణమే అయినా కొన్ని వాక్యాలు పరమార్థ పూర్ణములు.

*"కట్టెలు లేని అగ్నివలె కోరికలు లేకపోవుటచే శాంతించిన మనస్సు గలవాడు, కారణం లేకుండానే దయకు సముద్రంవంటివాడు, వినమ్రులైన సత్పురుషులకు అంటే శిష్యులకు బంధువు అయినవాడు గురువుగా గ్రహింపదగ్గవాడు (పేజి-5).*

*ఏదో నిమిత్తంగా వైరాగ్యం పొంది భవసాగరాన్ని తరించాలని పూనుకొన్న ముముక్షువులని విషయాలపై ఆశ అనే మొసలి పీకపట్టుకొని ప్రయత్నం నుండి మరల్చి సంసారసాగరం మధ్యలోకి ముంచుతుంది (పేజి-12).*

*ఈ విశ్వం లోపల బైట ముందు వెనుక పశ్చిమంలోను ఉత్తరములోను మీదా క్రిందా అంతటా ఉన్నది నీవే (పేజి-58).*

*పురుషునికి శరీరం నీడవలె అనుసరిస్తూ కనబడుతుంది (పేజి-60)*

*జీవన్ముక్తుడు జరిగిన వానితో సంబంధాన్ని విడిచిపెడతాడు. భవిష్యత్తుని తలపడు. తనకు ప్రాప్తించిన దానికి ఉదాసీనత పొందుతాడు (పేజి-63)*

*ఈ గ్రంథరత్నంలోని మొదటివాక్యం చివరివాక్యం కలిపిచూస్తే వివేకచూడామణిలోని వివేకం వెంటనే స్ఫురిస్తుంది. "సమస్త ప్రాణికోటిలో నరజన్మ దుర్లభం (పేజి-1). మోక్షాన్ని కల్గిస్తుంది. చక్కగా ప్రకాశిస్తోంది (పేజి-79)" - ఈవిధంగా ఈ "శంకరభగవత్పాదుల వివేకచూడామణి ప్రకాశం" సమస్త ప్రాణికోటిలో దుర్లభమైన నరజన్మకు మోక్షం ప్రకాశం కలిగించే మార్గం సులువుగా ప్రకాశం చేస్తుంది.*

ఇలాంటి గ్రంథాన్ని చాల చక్కని తెలుగులో మనకందించిన ఆచార్య సార్వభౌమ శ్రీ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి హృదయపూర్వక ధన్యవాదములు. అభినందనలు.

నమస్తే

**నారాయణ**



## డా॥ ఓ. శ్రీరామలాల శర్మ

Professor of Nyaya
Rastriya Sanskrit Vidyapeetha
తిరుపతి - 517 064.


మాణిక్యశాస్త్రి విదుషాం గురూణాం చరణస్మృతిః
బాధికా సర్వవిఘ్నానాం ఇష్టానామస్తు సాధికా॥

చార్వాక బౌద్ధాది నాస్తిక ధర్మ విజృంభణచే నామమాత్రావశిష్టమైన వైదిక ధర్మోద్ధరణకు దేవతల ప్రార్థననునరించి ఆ దేవదేవుడైన శంకరుడు శంకరాచార్యులుగా అవతరించి నివృత్తిరూపమైన ధర్మాన్ని పునఃప్రతిష్ఠించేడు. ఆచార్యస్వామివారు తమ పదకొండవ ఏటనే పన్నెండు ఉపనిషత్తులకు, బ్రహ్మ సూత్రాలకు, భగవద్గీతకు భాష్యాలు వ్రాసి వేదవిరుద్ధములైన మతములను ఖండించినారు.

భవిష్యత్కాలంలో సర్వవిధాలా అలసులైన మనవంటివారిని దృష్టిలో నుంచుకొని భాష్యాలలో చెప్పిన తత్త్వాన్నే ఉపదేశసాహస్రి శతశ్లోకి దశశ్లోకి ఏకశ్లోకి దృగ్దృశ్యవివరణం వివేక చూడామణి మొదలగు గ్రంథాలను కూడా రచించారు. ఇందు ఏ గ్రంథమైనా అనుభవంలోకి వస్తే మోక్షమే. ఇందులో కొన్ని గ్రంథాలు గురుశిష్యసంవాద రూపంగా ఉన్నాయి. శిష్యుని ప్రశ్నకు గురువుగారి సమాధానరూపంగా ఉంటే విషయస్పష్టత పెరుగుతుంది. అందుకే శ్రీకృష్ణపరమాత్మ "పరిప్రశ్నేన" అన్నాడు. అట్టి గ్రంథాలలో శివుని చూడామణిలాంటిది ఈ వివేక చూడామణి. "అధ్యాత్మ విద్యా విద్యానామ్" అని శ్రీకృష్ణుడు చెప్పినట్లుగా "ప్రకరణేషు చూడామణిః" అనవచ్చు.

ఇట్టి వివేక చూడామణికి జీవన్ముక్తులు శ్రీశ్రీశ్రీ 1008వ దక్షిణామ్నాయ శృంగేరీ శారదాపీఠాధీశ్వరులు చంద్రశేఖర భారతీస్వామివారు అనుగ్రహించిన సంస్కృతవ్యాఖ్య అత్యుత్తమమై విరాజిల్లుచున్నది. దానికి కొంతకాలం క్రిందట ఆచార్య పుల్లెల రామచంద్రుడుగారు తెనుగు అనువాదాన్ని చేసేరు. ఇంకా అనేక అనువాదాలు ప్రాచీనములు అర్వాచీనములు కూడా ఉన్నవి. సంస్కృత భాషతో ఏమాత్రం పరిచయంలేని ఈనాటి జనులకు సంస్కృతం చదివి దాని భావాన్ని



తెలుగులో చదవడం కూడా కష్టమైన స్థితిలో అక్కడక్కడ సంస్కృత శ్లోకాల నుట్టంకిస్తూ అన్ని శ్లోకాల భావాన్ని వచనరూపంలో అందిస్తున్నారు ఆచార్య వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు. వీరు పాఠశాలలో విద్యాభ్యాసం మొదలుపెట్టినప్పుడు ఎటువంటి జ్ఞానపిపాసను కలిగియున్నారో ఆచార్యపదాన్ని పొంది ఆ పదాన్నుండి విరమణ పొందాకకూడా అంత జ్ఞానపిపాసను కలిగియున్నారు. అందుకే వారు నిరంతరం "సర్వజ్ఞశేఖర చక్రవర్తి" ఇత్యాది బిరుదాంకితులైన ఆచార్య అప్పల్ల సోమేశ్వరశర్మగారి వద్ద ప్రత్యక్షంగాను, పరోక్షంగాను జ్ఞానతృష్ణను తీర్చుకొంటూ ఆ కృతజ్ఞతతో ఈ పుస్తకాన్ని వారి పాదపద్మాలకి సమర్పించుకొంటున్న ధన్యజీవులు.

ఈ పుస్తకంలోని విశేషమేమిటంటే ముందుగా ప్రధాన పారిభాషిక పదవివరణం అని కొంత వ్రాసారు. చాలా వేదాంత పుస్తకాలకి అనువాదాలు వచ్చాయి. కాని ఆయా శాస్త్రాలలో ఉన్న సాంకేతికపదాల్ని అట్లాగే అనువదిస్తూ ఉండడంవల్ల సామాన్యులకు తెలుగులో చదివినా వేరే భాషలో చదివిన భావనే ఉంటుంది. ఆ క్లేశాన్ని ఈ వివరణ నశింపజేస్తోంది. ఈ వివరణ ఈ పుస్తకానికే గాక వేదాంత పుస్తకాలన్నింటికీ ఉపయోగిస్తుంది. వీరు అనేక గ్రంథనిర్మాతలు. ఈ పరివస్యకు సంతుష్టుడైన పరమాత్మ వీరికి పురుషార్థ చతుష్టయాన్ని అనుగ్రహించాలని కోరుతూ...

విద్వజ్జన విధేయుడు

ఓరుగంటి శ్రీరామలాల శర్మ



# ప్రవేశిక

నారాయణ సమారంభాం శంకరాచార్య మధ్యమామ్
అస్మదాచార్య పర్యంతాం వందేగురు పరంపరామ్

**శ్రీమద్ఘంటి కులోద్భూతం లక్ష్మీనారాయణాభిదమ్**
**బ్రహ్మతత్త్వోపదేష్టారం వందే వేదాంత దేశికమ్**

"శంకరః శంకరః సాక్షాత్" అని ఆర్యోక్తి. సర్వజ్ఞుడైన శంకరుడే జగద్గురు శ్రీశంకర భగవత్పాదులు అని భావం. అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిష్ఠించి తత్త్వావబోధచే మాత్రమే ముక్తి కలుగుతుందని ఉపదేశించడం శంకర భగవత్పాదుల అవతార పరమప్రయోజనం. కర్మానుష్ఠానంవల్ల చిత్తశుద్ధి మాత్రమే కల్గుతుందని మోక్షప్రాప్తికి అది హేతువు కాదని వారి నిర్ణయం.

జీవేశ్వరులు అభిన్నులని నిరూపించడంకోసం ఆదిశంకరులు శ్రుతి స్మృతి పురాణాలు ప్రమాణంగా శాస్త్ర సంప్రదాయ నిబద్ధంగా ప్రస్థాన త్రయానికి భాష్యం రచించేరు. దానికి శంకరభాష్యం, అద్వైతభాష్యం అని లోకంలో ప్రసిద్ధి ఏర్పడింది. "భాష్యేషు శాంకరం శ్రేయః" అని అది ప్రశస్తి వహిస్తోంది. వారు మధ్యమాధికారుల కోసం ఆ భాష్యసారాన్ని ఎన్నో లఘుకృతులలో కూడా నిరూపించేరు. వానికి ప్రకరణ గ్రంథములని విద్వద్వ్యవహారం. ఏకశ్లోకి దశశ్లోకి శతశ్లోకి ఆత్మబోధ అపరోక్షానుభూతి ఉపదేశ సాహస్రి మహావాక్య దర్పణం మొదలైనవి ఆ కోవకు చెందుతాయి. ఆ ప్రకరణ గ్రంథాలు అన్నింటిలో వివేకచూడామణి శిఖరాయమాణమనదగ్గది. ప్రకరణం యొక్క స్వరూపం ఇలా వివరింపబడింది.

**శాస్త్రైకదేశ విషయం శాస్త్రకార్యాంతరే స్థితమ్**
**ఆహుః ప్రకరణం నామ గ్రంథభేదం విపశ్చితః**

శాస్త్రంలోని ముఖ్యమైన సిద్ధాంత సారాన్ని ప్రతిపాదించేది, ఇతర శాస్త్ర సమన్వయం గలది ప్రకరణ గ్రంథమని పండితులు చెప్తారు అని తాత్పర్యం.

ఆత్మ అనాత్మల వివేకాన్ని వివేచించి ఆత్మస్వరూపాన్ని నిరూపించడంలో చూడామణివంటిది కాబట్టి వివేక చూడామణి అనే పేరు సార్థకం. జగద్గురువులు



ఉపనిషత్తుల పద్ధతిని అనుసరించి ఈ గ్రంథాన్ని గురుశిష్య సంవాదరూపంలో రచించేరు. పండితుడైన శిష్యుడు వినయవిధేయతలతో ఆర్తితో గురువుని చేరి "బంధం అంటే ఏమిటి? అది ఎక్కడి నుండి వస్తోంది? దానికి నిలకడ ఎలా కలిగింది? దాని నుండి విముక్తి ఎలా కలుగుతుంది? అనాత్మ అనేది ఏది? తన స్వరూపమైన పరమాత్మ (ప్రత్యగాత్మ) అంటే ఏది? ఆత్మ అనాత్మల వివేకం ఎలా కల్గుతుంది?" అని ఇలా ప్రశ్నించి సమాధానాన్ని అర్థిస్తాడు.

**కో నామబంధః కుత ఏష ఆగతః**
**కథం ప్రతిష్ఠాఽస్య కథం విమోక్షః**
**కోఽసావనాత్మా పరమః క ఆత్మా**
**తయోర్వివేకః కథమేతదుచ్యతామ్** **51**

శిష్యుని ఈ ప్రశ్నకు సమాధానమే ఈ వివేక చూడామణి. ఈ శ్లోకానికి వ్యాఖ్యానప్రాయమే ఈ గ్రంథం. ఇక్కడ గురువు శంకర భగవత్పాదులు, శిష్యుడు ముముక్షువు అని సమన్వయం.

నిత్యానిత్య వస్తువివేకం ఇహాముత్ర ఫలభోగవిరాగం శమాదిషట్కం ముముక్షుత్వం అనే నాలుగు గల శాస్త్రపండితుడు ఆత్మవిద్యకు అధికారి. అతడు శ్రోత్రియుడు పాపరహితుడు కోరికలు లేనివాడు బ్రహ్మవిత్తముడు ఏకారణం లేకుండా దయ చూపువాడు అయిన గురువుని ఆశ్రయించి వినయ విధేయతలతో తన సంసారతాపాన్ని చల్లార్చుమని వేడుకోవాలి. అప్పుడు ఆ గురువు ఆత్మతత్త్వాన్ని ఆదరణపూర్వకంగా ఉపదేశిస్తాడు. ఆత్మవిద్యకు గురువుయొక్క ప్రాధాన్యం, శిష్యుడు గురువుని ప్రార్థింపవలసిన తీరు ఆదిశంకరులు ఈ గ్రంథంలో చక్కగా వివరించేరు.

శంకరభగవత్పాదుల అద్వైత భాష్యానికి ఈ వివేక చూడామణి సంగ్రహరూపం అని చెప్పడం అత్యంతసముచితం. వారు వేదాంతశాస్త్రానికి సంబంధించిన ఎన్నో విషయాలని ఈ గ్రంథంలో విశదీకరించేరు. సాధన చతుష్టయాన్ని వివరించేరు. "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అనే ఉపనిషద్వాక్యాన్ని వ్యాఖ్యానించేరు. ఆత్మ అనాత్మల స్వభావాన్ని పెక్కు దృష్టాంతాలతో నిరూపించేరు. సామవేదానికి చెందిన ఛాందోగ్యోపనిషత్తులోని "తత్త్వమసి" అనే మహావాక్యాన్ని ఆధారంగా చేసుకొని జహదజహల్లక్షణని కల్పించుకొని జీవేశ్వరుల ఐక్యాన్ని

సమన్వయించేరు. దేహాదికమందు అజ్ఞానంవల్ల ఆత్మభావం కల్గుతోందని, దృశ్యమైన జగత్తు మిథ్య అని పెక్కు ఉపపత్తులతో ప్రతిపాదించేరు. దేహాదికం ప్రాణమయాది పంచకోశాలు అసత్తుగా అనాత్మగా పరిగణించాలనీ ఆ సమస్తానికీ కూడా ఆత్మయే ఆధారమని నిర్ణయించేరు. "అవిద్యాహృదయ గ్రంథి మోక్షో మోక్షః" అని మోక్ష స్వభావాన్ని నిశ్చయించేరు. బ్రహ్మవేత్త కర్మాను భవస్థితి, జీవన్ముక్తుని తత్త్వం ఇంకా ఇలా ఎన్నో విషయాలని వారు ఈ వివేకచూడామణిలో వివరించేరు.

ఈమధ్య ఆధ్యాత్మిక గ్రంథాలని అధ్యయనం చేయడంలో ఎందరో ఎంతో ఆసక్తిని చూపుతున్నారు. ఆ కారణంగా సంస్కృతంలోనున్న గ్రంథాలని ఆంధ్రీకరించ వలసిన ఆవశ్యకం ఏర్పడుతోంది. ఆ సందర్భంలో శ్రీశంకర భగవత్పాదులు సంస్కృతభాషలో రచించిన వివేకచూడామణిని తెనిగించాలనే సంకల్పం కల్గింది. తత్ఫలంగా ఈ వివరణ గ్రంథం ఆవిర్భవించింది. ఆసక్తి గల పాఠకులకోసం కొన్ని ముఖ్యములైన శ్లోకాలు వివరణలో పేర్కొబడ్డాయి. అలాగే పాఠకుల సౌలభ్యాన్ని దృష్టిలో పెట్టుకొని ముఖ్యమైన పారిభాషిక పదాలు ప్రధానంగా వివేకచూడామణి భగవద్గీత ఆధారంగా వివరింపబడ్డాయి. శ్లోక సంఖ్య నిర్దేశింపబడింది.

ఇది వేదాంత శాస్త్రానికి సంబంధించిన గ్రంథం. శాస్త్రం గురుముఖతః అధ్యయనం చేయదగ్గది. స్వయంగా చదివి గ్రహించడానికి శక్యంగానిది. తెలుగులో అనువర్తింపబడితే కొన్ని విషయాలనైనా పాఠకుడు గ్రహింపగలుగుతాడని నా విశ్వాసం. ఈ వివరణవల్ల ఆదిశంకరులు వివేకచూడామణిలో నిరూపించిన ఆత్మతత్త్వాన్ని పాఠకుడు తెలుసుకోగలిగితే నా రచన సార్థకమైనట్లే.

గుణదోషౌ బుధో గృహ్ణన్నిందుక్ష్వేడావివేశ్వరః
శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి॥

శుభమ్

వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి
20-12-2008





# ప్రధాన పారిభాషిక పద వివరణం

**అజ్ఞానం** పరబ్రహ్మముకంటె వేరొకవస్తువు ఉన్నదని భావించడం. దేహాదులను నేను అని తలంచడం. జగత్తు నిత్యమని విశ్వసించడం. రజ్జువునందు సర్పత్వం చూడడం. అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం, తత్త్వజ్ఞానార్థ దర్శనం అనే రెండింటికంటె వేరైనది. (గీ. 13-11)

**అధికారి** అధికారం అంటే యోగ్యత. అదిగలవాడు అధికారి. ఆత్మదర్శనమందు మేధావి విద్వాంసుడు ఊహాఅపోహ అనేవానిని వివేచింపగలవాడు సాధనచతుష్టయ సంపన్నుడు అయిన పురుషుడు (16 శ్లో)

**అధిష్ఠానం** దేనియొక్క అజ్ఞానం వల్ల భ్రాంతి కల్గుతుందో ఆ వస్తువు. ఈ జగత్తుకి పరబ్రహ్మము. రజ్జుసర్పభ్రాంతిలో సర్పానికి రజ్జువు.

**అధ్యాస** ఒక వస్తువునందు మరియొక వస్తువుని ఆరోపించడం. "అతస్మిన్ తద్బుద్ధిః" (148 శ్లో) రజ్జువుని సర్పంగా భావించడం. అనాత్మయైన దేహాదికమందు నేను అనే భావాన్ని పొందడం (269 శ్లో).

**అనాత్మ** స్థూల శరీరం ఇంద్రియాలు ప్రాణాలు మనస్సు అహమాదులు సుఖాలు ఆకాశాది పంచభూతాలు అన్నమయాది పంచకోశాలు సమస్త విశ్వం మహత్తు నుండి దేహం పర్యంతం (124 శ్లో).

**అనిర్వచనీయం** సత్తుగాను అసత్తుగాను చెప్పడానికి వీలులేనిది. భ్రాంతిసిద్ధమైన వస్తువు. సత్తు అయితే బాధింపబడకూడదు. ఎలా అంటే బ్రహ్మ. అసత్తు అని కూడా చెప్పలేము. అసత్తు అయితే కనబడకూడదు. అసత్తు అయిన వంధ్యాపుత్రాదులు కనబడడంలేదుగదా. అందుచే భ్రాంతిసిద్ధమైనది.

**అనుబంధ చతుష్టయం** (1) నిత్యానిత్య వస్తు వివేకం (2) ఇహాముత్రఫలభోగ విరాగం (3) శమాదిషట్కం (4) ముముక్షుత్వం. దీన్నే సాధనచతుష్టయం అని కూడా అంటారు. (19,20 శ్లో) మోక్షప్రాప్తికి అవశ్యకమైన నాలుగు పరికరాలు అని భావం.

**అన్నమయ కోశం** స్థూల శరీరం. ఇది అన్నం నుండి ఉద్భవించింది. అన్నం చేతనే జీవిస్తోంది. అన్నం లేకపోతే నశిస్తుంది. ఆ కారణంగా అన్నమయకోశం అనిపించుకొంటోంది (157 శ్లో).

**అవస్థాత్రయం** జాగ్రదవస్థ స్వప్నావస్థ సుషుప్త్యవస్థ అనేవి.

**అవిద్య** అవ్యక్తం అనే పేరుగల పరమేశ్వరుని శక్తి. సత్త్వరజస్తమోగుణాలతో కూడినది. ఇదే మాయ. దీనినుండియే సమస్త విశ్వం ఆవిర్భవిస్తోంది. ఇది పండితునిచే కార్యాన్ని బట్టి ఊహింపదగ్గది (110,117 శ్లో).

**అవ్యక్తం** ఇదే అవిద్య మాయ అని పిలువబడుతోంది. సత్త్వరజస్తమోగుణాత్మకం. ఇది ఆత్మకు కారణ శరీరం (122 శ్లో).

**అష్టపాశాలు** దయ లజ్జ భయం శంక జుగుప్స కులం శీలం జాతి అనే ఎనిమిది. ఇవి సంసార బంధానికి హేతువులు.

**అష్టవసువులు** అవిద్య కామం, కర్మ, పృథివి నీరు తేజస్సు వాయువు ఆకాశం అనే పంచభూతాలు.

**అసత్తు** మూడు లోకాలలోను ఉండనిది. కుందేలు కొమ్ము, వంధ్యాపుత్రుడు.

**అహంకారం** నేను నాది అనే అభిమానం (96 శ్లో) నేను కర్తని నేను భోక్తని అనే అభిమానం గలది (106 శ్లో) ఈ అహంకారమే సంసారానికి ప్రతిబంధకాలన్నింటిలో మూలమైన మొదటి వికారం (299 శ్లో).

**అంతఃకరణం** లోపలి ఇంద్రియం. మనస్సు బుద్ధి చిత్తం అహంకారం అనే నాల్గింటికీ అంతఃకరణమని పేరు (95 శ్లో) ఈ నాల్గింటికీ అంతఃకరణ చతుష్టయం అని కూడా వ్యవహారం.

**ఆకాశం** పంచమహాభూతాలలో ఒకటి. శుద్ధం నిర్మలం సర్వవ్యాపకం నిరంజనం మొదలైన ధర్మాలు గలది. ఆత్మయొక్క నిత్యత్వానికీ సర్వవ్యాపకానికీ ఉదాహరణంగా చెప్పబడేది. వస్తువుని బట్టి ఘటాకాశం పటాకాశం అని వ్యవహారం.

**ఆత్మ** "అతతి సంసరతి ఇతి ఆత్మా" అని వ్యుత్పత్తి. ఎప్పుడూ సంచరించేది అని



అర్థం. "అత్తి స్వకర్మఫలమితి" అని కూడా వ్యుత్పత్తి. తన కర్మఫలాన్ని అనుభవించేది అని అర్థం. పరమాత్మ అని భావం. జీవుడు మనస్సు అనే అర్థాలలో కూడా ప్రయోగింపబడుతుంది. బృహదారణ్యకోపనిషత్తు ఆత్మయే చూడదగ్గది వినదగ్గది మననం చేసుకోదగ్గది స్థిరంగా నిల్పుకోదగ్గది అని "ఆత్మా వా౽రే ద్రష్టవ్యః శ్రోతవ్యః మంతవ్యః నిదిధ్యాసితవ్యః అని చెప్తోంది. ఇది నిరాకారం నిరంజనం నిష్క్రియం నిరవయవం శుద్ధం బుద్ధం చైతన్యాత్మకం... అని ఉపనిషత్తులు వివరిస్తున్నాయి.

**ఆనందమయ కోశం** ఆనందం యొక్క ప్రతిబింబంతో కూడిన సూక్ష్మమైన అంతఃకరణ ప్రవృత్తి. ప్రియము మొదలైన గుణాలు కలది. ఇష్టమైన వస్తువు లభించడంవల్ల కల్గుతుంది. శరీరమాత్రంచే పుణ్యాత్ములు అప్రయత్నంగా దీన్ని అనుభవిస్తారు. (209 శ్లో).

**ఆవరణశక్తి** ఆవరణం అంటే కప్పివేయడం. ఇది తమోగుణంయొక్క స్వభావం. దీనివల్ల వస్తువు పూర్తిగా కప్పబడుతుంది. పురుషుడు సంసారాన్ని పొందడానికి ఆధారమైనది. విక్షేపశక్తి ప్రవర్తించడానికి ఇదే కారణం (115 శ్లో).

**ఆశ్రమాలు** బ్రహ్మచర్యం గార్హస్థ్యం వానప్రస్థం సంన్యాసం అనే నాలుగు.

**ఇంద్రియాలు** "ఇంద్రస్య ఆత్మానం లింగమింద్రియమ్' అని వ్యుత్పత్తి. ఆత్మకు జ్ఞాపకమైనదని అర్థం. జ్ఞానేంద్రియాలు ఐదు. కర్మేంద్రియాలు ఐదు.

**ఈశ్వరుడు** మాయ ఉపాధిగా గలవాడు. సర్వభూతముల హృదయంలో ఉంటూ తన మాయచే సర్వజీవులని నియమించువాడు (గీత 18-61).

**ఉపరతి** చిత్తవృత్తిని బాహ్య విషయాలపై ప్రసరించకుండా ఉంచడం (24 శ్లో).

**ఉపాధి** ఆధారం. ఈశ్వరునికీ మహదాదులకీ కారణమైన మాయ ఉపాధి. జీవునికి అన్నమయాది కోశాలు అయిదూ ఉపాధి (245 శ్లో).

**ఊర్ములు** కెరటాలు. సంసారసాగరంలో బాధించే పెద్ద కెరటాలు అని భావం. ప్రాణానికి చెందిన క్షుత్పిపాసలు, మనస్సుకి చెందిన శోకమోహాలు, దేహానికి చెందిన జన్మమృత్యువులు అనే ఆరింటికి షడూర్ములు అని వ్యవహారం (257 శ్లో).

**కర్మ** ఇంద్రియాల వ్యాపారం. "క్రియతే ఇతి కర్మ" అని వ్యుత్పత్తి. సంచితం, ప్రారబ్ధం ఆగామి అని మూడు విధాలు. పెక్కు జన్మల నుండి సంక్రమించింది సంచితం. సంచితాన్ని ఈ జన్మలో అనుభవించడం ప్రారబ్ధం. ఈ జన్మయే ప్రారబ్ధం. ఈ జన్మలో చేసిన దాని ఫలాన్ని వచ్చే జన్మలో అనుభవించడం ఆగామి. నిత్య నైమిత్తిక కామ్య నిషిద్ధ కర్మలు అని మరొక విధమైన విభాగం. నిత్యం చేయవలసిన కర్మ నిత్యం. కొన్ని నిమిత్తములు పురస్కరించుకొని చేసే కర్మ నైమిత్తికం. దేన్నో కోరి దాన్ని పొందడం కోసం చేసే కర్మ కామ్యం. వేదశాస్త్రాలలో కూడదని నిషేధింపబడ్డ కర్మ నిషిద్ధం. మానసికం, వాచికం కాయికం అని కూడా మరొక విధమైన విభాగం. మనస్సు ద్వారా వాక్కుల ద్వారా శరీరం ద్వారా చేసే కర్మలు.

**కర్మేంద్రియాలు** నోరు చేతులు కాళ్లు గుదం జననేంద్రియం అనే అయిదు. వాక్కు మాట్లాడడంలోను, చెయ్యి గ్రహించడంలోను ఇవ్వడంలోను, పాదం గమనంలోను, పాయువు ఉపస్థ అనేవి మల విసర్జనలోను సుఖాన్ని ఇవ్వడంలోను ప్రవర్తిస్తాయి (94 శ్లో).

**కారణ శరీరం** సత్త్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతి ఆత్మకు కారణశరీరం అవుతుంది. అన్ని ఇంద్రియాలయొక్కయు, బుద్ధియొక్కయు, ప్రవృత్తి ప్రత్యగాత్మ యందు లయమైన సుషుప్తి అవస్థ కారణ శరీరం యొక్క స్థితి (122 శ్లో).

**కూటస్థుడు** కూటం అంటే బంగారం పనివాళ్లు ఆభరణాలు చేయడానికి వాడే ఇనుప దిమ్మ. దానివలె స్థిరంగా అసంగంగా ఉండడం వల్ల కూటస్థుడు. "కూటవత్ తిష్ఠతి ఇతి కూటస్థః" అని వ్యుత్పత్తి. ప్రత్యగాత్మ అని అర్థం (191 శ్లో).

**కోశములు** కోశం అంటే ఒర. అన్నమయం ప్రాణమయం మనోమయం విజ్ఞానమయం ఆనందమయం అని కోశములు అయిదు. ఇవన్నీ అనాత్మ అవతాయి.

**చిత్తం** "చేతయతీతి చిత్తమ్" అని వ్యుత్పత్తి. తెలియజేసేది అని అర్థం. రూపం రసం మొదలైన విషయాలని నిరంతరం చింతన చేసే ధర్మం గలది. "స్వార్థానుసంధాన గుణేన చిత్తమ్" (96 శ్లో).

**చిదాభాసుడు** చిత్ అంటే చైతన్యం. పరమాత్మ. ఆభాసుడు అనగా ప్రతిబింబం. చిదాభాసుడు అనగా బుద్ధియందు ప్రతిబింబించిన చైతన్యం. ఇతడే జీవుడు (227 శ్లో).



**జహదజహల్లక్షణ** పదానికి సంకేతితమైన అర్థం కుదరకపోయినప్పుడు దానికి సమీపంగా ఉండే అర్థాన్ని గ్రహించడం లక్షణావృత్తి అనిపించుకొంటుంది. అది జహత్, అజహత్, జహదజహత్ భేదాలచే మూడు విధాలు. అద్వైత వేదాంత సంప్రదాయంలో మాత్రమే జహదజహల్లక్షణ సమన్వయాన్ని పొందుతోంది. ఎప్పుడో ఎక్కడో చూసిన దేవదత్తుణ్ణి చాల కాలం తర్వాత మళ్లీ ఎక్కడో చూసి ఆ దేవదత్తుడే వీడు అని అనుక్నొన్నప్పుడు కాలం దేశం రూపం వంటివి భిన్నములైన అంశాలు. వానిని తొలగిస్తేనే దేవదత్త ధర్మం సమానం అవుతుంది. అప్పుడే ఆ దేవదత్తుడు వీడు అనడం కుదురుతుంది. పరమాత్మ సర్వజ్ఞుడు. జీవుడు కించిద్జ్ఞుడు, మాయ ఉపాధిగా గలవాడు పరమాత్మ. అవిద్య ఉపాధిగా గలవాడు జీవుడు. కించిద్జ్ఞత్వ సర్వజ్ఞత్వాది ధర్మాలు తొలగిస్తే చైతన్యమాత్రాన్ని గ్రహిస్తే ఈశ్వరుడే జీవుడు అనే అద్వైత స్థితి సిద్ధిస్తుంది. విరుద్ధాంశాలు విడిచి సమానంగా ఉండే అంశాలు గ్రహించి సన్నిహితమైన అర్థాన్ని సమన్వయించడం జహదజహల్లక్షణ. జీవేశ్వరుల అద్వైత స్థితిని నిరూపించుకోవడంలో ఆధారమైనది (249,250 శ్లో).

**జాగ్రదవస్థ** మెలకువ స్థితి. స్థూల శరీరంతో జీవుడు (విశ్వుడు) పదార్థాల అనుభవాన్ని పొందు స్థితి (90 శ్లో).

**జిజ్ఞాస** ."జ్ఞాతుమిచ్ఛా జిజ్ఞాసా". తెలుసుకోవాలన్న కోరిక.

**జీవన్ముక్తుడు** జీవేశ్వరులు అభిన్నులు అనే అనుభవంలో మునిగి నిర్వికల్పంగా చిన్మాత్రంగా ఉండే చిత్తవృత్తికి ప్రజ్ఞ అని వ్యవహారం. నిత్యం అట్టి ప్రజ్ఞ గలవాడు జీవన్ముక్తుడు (428 శ్లో). జీవిస్తూ సంసారబంధాలనుండి ముక్తుడైనవాడని తాత్పర్యం. ఆవరణశక్తితో కూడిన అజ్ఞానం నశింపగా ప్రారబ్ధకర్మతో జీవించువాడు.

**జీవాత్మ** చిత్తు యొక్క ప్రతిబింబానికి జీవుడు జీవాత్మ అని పేరు. జీవుడు అనాదిగా ఉండేవాడు. అహంకార స్వభావుడు. సమస్త వ్యవహారాలు నిర్వహిస్తూ ఉంటాడు. పూర్వవాసనలని అనుసరించి కర్మ ఆచరిస్తాడు. పుణ్యపాపకర్మల ఫలాన్ని అనుభవిస్తాడు. విచిత్రయోనులందు జన్మిస్తూ ఊర్ధ్వ అధో లోకాలకి వెళ్తూ వస్తూ ఉంటాడు. జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు గలవాడు (189, 190 శ్లో).

**జీవుడు** జీవాత్మనే జీవుడు అని కూడా అంటారు.

**జ్ఞానేంద్రియాలు** రూపరసగంధాది విషయాలు ఐదింటిని బాగా తెలుసుకొంటాయి కాబట్టి జ్ఞానేంద్రియాలు అనే వ్యవహారం ఏర్పడింది. చర్మం కన్ను చెవి నాలుక ముక్కు అనేవి.

**తత్త్వమసి** ఇది ఛాందోగ్యోపనిషత్తుకి చెందిన మహావాక్యం. తత్ త్వమ్ అసి అని పదవిభాగం. తత్ అనగా ఈశ్వరుడు (పరమాత్మ). త్వమ్ అంటే నీవు. అసి అంటే అయితివి అని అర్థం. పరమాత్మ జీవుడు అభిన్నులు అని తాత్పర్యం (243-251 శ్లో).

**తమోగుణం** అజ్ఞానం నుండి కల్గుతుంది. మోహాన్ని పుట్టిస్తుంది. ఇదే జీవునికి సంసారాన్ని కల్గిస్తుంది. విక్షేపశక్తి వ్యాపించడానికి ఇదే కారణం. (115 శ్లో) మరపు సోమరితనం నిద్ర అనే వానిచే ఇది ఆత్మను బంధిస్తుంది (గీత 14-8).

**తాపములు** ఆధ్యాత్మికం ఆధిభౌతికం ఆధిదైవికం అని మూడు విధాలు. శోక మోహాదులవల్ల మనస్సు పొందు దుఃఖం ఆధ్యాత్మికం. సర్పం వ్యాఘ్రం మొదలైనవాని వల్ల కలిగే దుఃఖం ఆధిభౌతికం. అగ్ని పిడుగుపాటు అతివృష్టి మొదలైనవాని వల్ల కలిగే దుఃఖం ఆధిదైవికం.

**తితిక్ష** "తేజితుమిచ్ఛా తితిక్షా" అని వ్యుత్పత్తి సమస్త దుఃఖాలనీ ప్రతీకారవాంఛ లేకుండా చింతగాని విలాపంగాని పొందకుండా సహించడం (25 శ్లో).

**త్రిపుటి** జ్ఞాత జ్ఞేయం జ్ఞానం, ద్రష్ట దృశ్యం దృక్కు వంటి మూడింటికి త్రిపుటి అని వ్యవహారం. విశ్వవ్యాప్తకమైన బ్రహ్మము ఏకం. అద్వితీయం. ఈ త్రిపుటి అజ్ఞానంచే ఏర్పడుతోంది. ఇది లయమైనప్పుడే ఆత్మానుభూతి కల్గుతుంది.

**దమం** బాహ్యేంద్రియనిగ్రహం. జ్ఞానేంద్రియాలనీ కర్మేంద్రియాలనీ వాని వాని విషయములందు ప్రవర్తింపకుండా చేసి తమతమ స్థానాలలో స్థిరంగా నిల్పడం (23 శ్లో).

**దృశ్యం** కనబడేది అని అర్థం. స్థూలదేహం, విశ్వం సర్వమూ దృశ్యమే. దృశ్యం అంతా నశించేదే అని శాస్త్రోక్తి. "యద్దృశ్యం తన్నశ్యమ్".

**ధ్యానం** ధ్యేయమైన పరమాత్మయందు ప్రవాహరూపంగా చిత్తవృత్తి ప్రవర్తించడం.



**నిత్యానిత్య వస్తువివేకం** బ్రహ్మసత్యం, జగత్తు మిథ్య అనే నిశ్చయం (20శ్లో).

**నిదిధ్యాసనం** బ్రహ్మముకంటె వేరైనది ఇంకొకటి ఉన్నదనే అనుభవాన్ని తిరస్కరిస్తూ బ్రహ్మమునందే మనఃప్రవృత్తిని ప్రవాహరూపంలో స్థిరంగా నిల్పడం.

**నిర్వికల్ప సమాధి** ఇంద్రియ వ్యాపారాలని నిరోధించి మనస్సుని సంకల్పరహితంగా చేసుకొని పరమాత్మ (ప్రత్యగాత్మ) యందు స్థిరంగా నిల్పడం.

**పరబ్రహ్మము** ఏకం అద్వితీయం సత్యం జ్ఞానం అనంతం అయినది. దీన్నే పరమాత్మ అనికూడా అంటారు.

**పుర్యష్టకం** (i) కర్మేంద్రియాలు-5 (ii) జ్ఞానేంద్రియాలు-5 (iii) ప్రాణాపానాది వాయువులు-5 (iv) పృథివిమొదలైన మహాభూతాలు-5 (v) అంతఃకరణం-4 (vi) అవిద్య (vii) కామం (viii) కర్మ అనే ఎన్మిదింటికి పుర్యష్టకమని పరిగణనం. ఇదే సూక్ష్మ శరీరం (98 శ్లో).

**పంచకోశాలు** అన్నమయం ప్రాణమయం మనోమయం విజ్ఞానమయం ఆనందమయం అనే అయిదు. ఇవి ఆత్మకంటె భిన్నమైనవి. అనాత్మగా వ్యవహారం.

**పంచభూతాలు** భూమి నీరు తేజస్సు గాలి ఆకాశం అనేవి. వీనికే పంచమహా భూతాలని కూడా ప్రసిద్ధి.

**పంచీకరణం** ఒక వస్తువుని ఐదు భాగాలుగా చేయడం. పృథివి నీరు మొదలైన భూతాలు అయిదూ ఒక్కొక్కటీ ఇతర భూతాలతో కలిసి మహాభూతాలుగా ఏర్పడడం. పృథివిలో సగభాగంలో ఇతరములైన జలం తేజస్సు వాయువు ఆకాశం అనేవి నాల్గూ సమపాళ్లలో 1/8 చొప్పున సగభాగంగా మిగిలిన పృథివితో కలిసి పృథివీ మహాభూతం ఏర్పడుతుంది. (పృథివి 1/2 + జలం మొదలైనవి నాలుగు 1/8 + 1/8 + 1/8 + 1/8 = 1) ఇట్లే తక్కిన మహాభూతాలు ఏర్పడతాయి. ఈవిధంగా పంచీకరణం పొందిన పంచమహాభూతాలు స్థూల శరీరంగా పరిణమిస్తాయి.

**ప్రజ్ఞ** జీవేశ్వరులు అభిన్నులే అనే భావప్రవాహంలో మునిగి మనస్సు యొక్క వృత్తి నిర్వికల్పంగా చిన్మాత్రంగా ఉండడం ప్రజ్ఞ (428 శ్లో).

**ప్రత్యయం** "ప్రతీతత్వాత్ ప్రత్యయః" అని వ్యుత్పత్తి. జ్ఞానమని అర్థం (521 శ్లో).

**ప్రత్యగాత్మ** "ప్రతి ప్రతిశరీరం అంచతి ప్రాప్నోతి ఇతి ప్రత్యగాత్మా" అని వ్యుత్పత్తి. ప్రతి శరీరంలోను ప్రవేశించేది. "ప్రతి సర్వతః ప్రాప్నోతి" అని కూడా వ్యుత్పత్తి. అంతటా ప్రవేశించేది అని భావం. పరమాత్మ జీవుడు అని కూడా అర్థం.

**ప్రాగభావం** అభావం అంటే లేని స్థితి. కుండ ఏర్పడే స్థితికి ముందు ఉండే స్థితి కుండ యొక్క ప్రాగభావం అనిపించుకొంటుంది.

**ప్రాణమయ కోశం** వాక్కు మొదలైన ఐదు కర్మేంద్రియాలతో గూడిన ప్రాణం ప్రాణమయకోశం. దీనిచేతనే అన్నమయకోశం అన్నంతో నిండినదై సకలకర్మల యందు ప్రవర్తిస్తోంది. (167 శ్లో) ఇది అనాత్మ.

**ప్రాణములు** ప్రాణం ఒక్కటే. కాని అది శరీరంలో భిన్నస్థలాలలో ఆచరిస్తున్న కర్మలు ఆధారంగా ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానములు అనే పేర్లు పొందింది. (97 శ్లో).

**బంధం** అనాత్మయైన దేహాదికమందు ఆత్మభావాన్ని పొందడం. ఈ దేహమే నేను అనే బుద్ధిని కల్గియుండడం. ఇదే జననమరణ క్లేశాలని కలిగిస్తోంది. (139 శ్లో).

**బుద్ధి** పదార్థంతో ఏకమై (తదాకారాకారితమై) పదార్థ జ్ఞానాన్ని కలిగించేది (95 శ్లో).

**బ్రహ్మ** బృహ (వృద్ధౌ) అనే ధాతువు నుండి ఏర్పడింది. "బృంహతి ఇతి బ్రహ్మ" అని వ్యుత్పత్తి. వృద్ధి పొందేది అని అర్థం. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అనేది స్వరూప లక్షణం. "యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ ప్రయంత్యంభిసంవిశంతి" అనేది తటస్థ లక్షణం.

**భక్తి** మోక్ష సాధన సామగ్రిలో శ్రేష్ఠమైనది. మనస్సుని తన స్వరూపమైన ప్రత్యగాత్మ (పరమాత్మ) యందు లయం చేసుకోడం భక్తి. తన స్వరూపమైన ఆత్మతత్త్వాన్ని చింతన చేసుకోడం అని కొందరు చెప్తారు (32, 33 శ్లో).

**భావ వికారాలు** వస్తువు యొక్క వికారాలు. ఇవి ఆరు. జాయతే అస్తి విపరిణమతే వర్ధతే అపక్షీయతే నశ్యతి అనేవి. పుట్టడం ఉండడం పెరగడం మార్పు పొందడం క్షీణించడం నశించడం అనే వికారాలు. ఇవి ఆత్మకు లేవు. అనాత్మకు ఉంటాయి (136 శ్లో).



**భ్రాంతి** ఇదే అధ్యాస. ఒక వస్తువుని మరియొక వస్తువుగా తలంచడం. త్రాడుని చూసి పాము అనుకోవడం. అనాత్మయైన దేహాదికం తాను అని భావించడం.

**మననం** విన్న విషయాన్ని ఉపపత్తులతో చింతించడం (72 శ్లో) "శ్రుతస్యాఽర్థస్య ఉపపత్తిభిశ్చింతనమ్".

**మనస్సు** సంకల్ప వికల్పరూపమైనది (95 శ్లో).

**మనోమయకోశం** త్వక్కు చక్షువు మొదలైన జ్ఞానేంద్రియాలు ఐదూ మనస్సుతో గూడి మనోమయకోశం అనిపించుకొంటుంది. నాది నేను మొదలైన వికల్పాలకి ఇదే హేతువు. దీనికి ముందున్న ప్రాణమయ కోశమునందు వ్యాపించి విజృంభిస్తుంది. ఇది అనాత్మ (169 శ్లో).

**మహత్తు** అహంకారానికి కారణమైనది. బుద్ధి.

**మాయ** "యా మా సా మాయా" అని వ్యుత్పత్తి. ఏది యథార్థం కాదో అది మాయ. ఇది పరమేశ్వరుని శక్తి. అనాది. సత్త్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతి. అవ్యక్తం అవిద్య అని కూడా దీనికి పేర్లు. కార్యాన్ని బట్టి పండితునిచే తెలియదగ్గది. ఈ మాయయే విశ్వాన్ని ఉద్భవింపజేస్తోంది (110 శ్లో). అనిర్వచనీయమైనది. మహదాదులకు కారణమైన ఈ మాయ ఈశ్వరునికి ఉపాధి (245 శ్లో).

**మిథ్య** లేనిది ఉన్నట్లు భాసించడం. రజ్జు సర్పభ్రాంతిలో రజ్జువు సర్పంగా కనబడడం. ఎండమావియందు జలం భాసించడం. బ్రహ్మమునందు విశ్వం స్ఫురించడం.

**మిశ్రసత్త్వం** సత్త్వగుణ ప్రధానంగా ఉంటూ రజస్తమోగుణాలు స్వల్పంగా కలిస్తే ఏర్పడుతుంది. ఇదే లింగశరీరానికి ఆధారం. స్వమానిత్వం అదాంభిత్వం మొదలైన గుణాలు, యమం మొదలైన నియమాలు, శ్రద్ధ భక్తి మోక్షేచ్ఛ, దైవీ సంపద అసత్తైన దేహాదికం నేను కాదని మరలుట అనేవి మిశ్రసత్త్వ ధర్మాలు (119, 120 శ్లో).

**ముక్తి** బలం కలిగి అనాదిగా ఉంటూ సంసారానికి హేతువైన వాసనలని వదల్చుకోవడమే ముక్తి అని మునులు చెప్తారు (268 శ్లో).

**ముక్తికి కారణం** సంసారం నుండి మోక్షం పొందడానికి "అహం బ్రహ్మాఽస్మి"

అనే అనుభవమే కారణం అవుతుంది. దీనిచేతనే పండితులు అద్వితీయమైన, ఆనందస్వరూపమైన బ్రహ్మమును అనుభవిస్తారు (225 శ్లో).

**ముని** వాక్సంయమనం గలవాడు (గీ. 12-19) ధ్యాననిష్ఠుడు (గీ. 6-3) జ్ఞాని (గీ. 10-37).

**ముముక్ష** "మోక్తుమిచ్ఛా ముముక్షా" అని వ్యుత్పత్తి. సంసారబంధాన్ని విడిచిపెట్టాలనే కోరిక.

**ముముక్షువు** "మోక్తుమిచ్ఛుః ముముక్షుః" అని వ్యుత్పత్తి. సంసారబంధాన్ని విడిచిపెట్టాలనే కోరికగలవాడు.

**మూల ప్రకృతి** సత్త్వరజస్తమోగుణాలతో కూడినది. జగత్తు ఆవిర్భవించడానికి ఆధారమైనది.

**మోక్షం** అవిద్యవల్ల హృదయాన్ని ఆవరించియున్న ముడి విడిపోవడం. "అవిద్యా హృదయ గ్రంథి మోక్షః మోక్షః". దేహాన్ని విడిచిపెట్టడం మోక్షం కాదు. దండ కమండలాలు విడిచిపెట్టడం అంతకంటె కాదు (559 శ్లో).

**యతి** ఇంద్రియ మనో వ్యాపారాలు నిరోధించుకొన్నవాడు.

**యోగః** "యోజయతీతి యోగః" అని వ్యుత్పత్తి. కలిపేది అని అర్థం. మనస్సుని పరమాత్మతో కలిపేది అని భావం. "యోగః చిత్తవృత్తి నిరోధః" అని పతంజలి యోగసూత్రం. మనస్సుయొక్క పనిని అరికట్టడం అని భావం.

**రజోగుణం** పురుషుడు వివిధ కర్మలు ఆచరించడానికి ప్రేరకమైనది. కామక్రోధ లోభాదులు రజోగుణధర్మాలు. రజోగుణం సంసారబంధానికి హేతువు (113, 114 శ్లో) "రజో రాగాత్మకం విద్ధి" అని గీత (14-7).

**రజ్జు సర్పభ్రాంతి** మసకమసక చీకటివేళ త్రాడును చూసి పాము అని భ్రాంతిపడడం. ఆ భ్రాంతికి మూలం అజ్ఞానం. యథార్థ వస్తువు తెలిసినప్పుడు ఆ భ్రాంతి తొలగుతుంది. సర్పత్వం పోతుంది. త్రాడుగానే కనిపిస్తుంది. దేహాదికమందు నేను అనే భావం భ్రాంతివల్లనే కల్గుతుంది. ఆత్మ దర్శనమయినప్పుడు ఆ భ్రాంతి



తొలగుతుంది. దేహాదికం నేను కానని స్పష్టమవుతుంది. దీనికి రజ్జు సర్పభ్రాంతి చక్కని నిదర్శనం (12,112 శ్లో).

**లింగములు** "లీనమర్థం గమయతీతి లింగమ్" అని వ్యుత్పత్తి. రహస్యంగా ఉన్న అర్థాన్ని పొందించేది అని అర్థం. ఉపనిషత్తుల వాక్యాల తాత్పర్యాన్ని నిర్ణయించడంలో ఉపయోగించే ఆరు అంశాలకి షడ్విధలింగములు అని ప్రసిద్ధి. అవి (1) ఉపక్రమోపసంహారాలు (2) అభ్యాసం (3) అపూర్వత (4) ఫలం (5) అర్థవాదం (6) ఉపపత్తి.

> ఉపక్రమోపసంహారావభ్యాసోఽపూర్వతా ఫలం
> అర్థవాదోపపత్తీ చ లింగం తాత్పర్య నిర్ణయే.

**లింగశరీరం** సూక్ష్మశరీరానికే లింగశరీరమని కూడా పేరు. పంచకర్మేంద్రియాలు, పంచజ్ఞానేంద్రియాలు, పంచప్రాణాలు, పంచభూతాలు, అంతఃకరణ చతుష్టయం, అవిద్య, కామం, కర్మ అనే ఎనిమిదింటికీ సూక్ష్మశరీరం, లింగశరీరం అని వ్యవహారం. ఇది పంచీకరణం పొందని పంచభూతాలచే ఏర్పడుతుంది. పూర్వజన్మ వాసనలుగలది. సుఖదుఃఖ రూపమైన కర్మఫలానుభవానికి ఆధారమైనది. అజ్ఞానంవల్ల జీవునికి ఉపాధియైనది. మోక్షప్రాప్తి వరకు ఉంటుంది. "లింగభంగో హి మోక్షః" (98, 99 శ్లో).

**వర్ణ ధర్మాలు** బ్రాహ్మణ క్షత్రియాది వర్ణాల వారు చేయదగ్గ పనులు.

**వాసనలు** సంస్కారాలు. పువ్వుకి సహజమైనవి. పువ్వులు మొదలైనవాని సంపర్కంవల్ల బట్టలు మొదలైనవానికి కలిగే గుణం. ఇవి పూర్వజన్మలనుండి జీవునికి సంక్రమిస్తాయి. లోకవాసన శాస్త్రవాసన దేహవాసన అని మూడు విధాలు. వాసనల నుండి విడువడడమే ముక్తి (272, 273 శ్లో) జ్ఞానప్రాప్తికి ఇవి ప్రతిబంధకాలు.

> లోకవాసనయా జంతోః శాస్త్రవాసనయాఽపి చ
> దేహవాసనయా జ్ఞానం యథావన్నైవ జాయతే

**విజ్ఞానమయకోశం** జాగ్రత్ స్వప్న సుషుప్తి మూడింటియందు ప్రవర్తించే చైతన్యం యొక్క ప్రతిబింబశక్తి. ఇది ప్రకృతి యొక్క వికారం. జీవుడని వ్యవహరింపబడతాడు. దేహం ఇంద్రియాలు మొదలైన వాని విషయంలో ఎల్లప్పుడు "నేను పదార్థాల విజ్ఞానం

గలవాడను. ఈ కర్మని నేను ఆచరిస్తున్నాను" అని విజ్ఞానమయకోశమైన జీవుడు అభిమానాన్ని కల్గియుంటాడు.

**విషయాలు** చర్మం కన్ను చెవి నాలుక ముక్కు అనే అయిదు జ్ఞానేంద్రియాలు ప్రవర్తించడానికి ఆధారమైనవి. అవి స్పర్శ రూప శబ్ద రస గంధములు. జ్ఞానేంద్రియాలు అయిదూ ఈ విషయాలపై ప్రవర్తించడం వల్ల ఆత్మదర్శనానికి ప్రతిబంధకం ఏర్పడుతుంది. ఈ విషయాలనుండి మరల్చి వానిని వాని స్థానాలలో నిల్పుకోగల్గినప్పుడు ఆత్మానుభూతి కల్గుతుంది.

**విక్షేపశక్తి** మనస్సును పరిపరివిధాల కదల్చేది. సమస్త కర్మాచరణకి ఆధారమైనది. ఇది రజోగుణానికి చెందుతుంది. మనస్సు యొక్క వికారములైన రాగాదులు దుఃఖాదులు నిత్యం ఈ విక్షేపశక్తివల్ల కల్గుతాయి (113 శ్లో).

**వైరాగ్యం** రాగం అంటే కోరిక. అది లేనివాడు విరాగుడు. అతని ధర్మం వైరాగ్యం. "విగతః రాగః విరాగః తస్య భావః వైరాగ్యమ్". దేహంతో ఆరంభించి కార్యబ్రహ్మ పర్యంతంగల సమస్త వస్తువు అనిత్యమైనది. అనుభవింపదగ్గ ఆ వస్తువుయొక్క దర్శనం శ్రవణం మొదలైన వానియందు కోరికను విడిచిపెట్టడం వైరాగ్యం (21శ్లో).

**శమం** మనోనిగ్రహం. రూపరసగంధాది విషయములందుగల దోషాన్ని భావిస్తూ వానిపైగల అనురాగాన్ని పూర్తిగా విడిచిపెట్టి తన లక్ష్యమైన ప్రత్యగాత్మయందు మనస్సుని నిగ్రహించి స్థిరంగా నిల్పడం శమం (22 శ్లో).

**శమాది షట్కం** శమం దమం ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానం అనే ఆరింటికీ శమాదిషట్కం అని వ్యవహారం.

**శరీరత్రయం** స్థూల సూక్ష్మ (లింగ) కారణ శరీరాలు మూడింటికీ శరీరత్రయమని పేరు.

**శుద్ధ సత్త్వం** రజస్తమోగుణాలు స్వల్పంగా కూడా కలియని సత్త్వగుణం. ప్రసన్నత తనదైన ఆత్మరసాన్ని అనుభవించడం పరమశాంతి తృప్తి హర్షం పరమాత్మయందు నిష్ఠ అనేవి విశుద్ధ సత్త్వగుణ ధర్మాలు. వీనిని పొందినవాడు ఆనందాన్ని అనుభవిస్తాడు (121 శ్లో).



**శ్రద్ధ** వేదంలో చెప్పబడ్డదీ గురువుచే ఉపదేశింపబడిందీ సత్యమే అని నిశ్చయాత్మకంగా విశ్వసించడం. దీనిచేతనే ఆత్మానుభవం కలుగుతుంది (26 శ్లో).

**శ్రవణం** ఉపక్రమోపసంహారాలచే వేదాంత వాక్యాలకి అద్వితీయ పరబ్రహ్మమందు తాత్పర్యాన్ని నిర్ణయించడం వేదాంతసంప్రదాయంలో శ్రవణం అనిపించుకొంటుంది. "షడ్విధయుక్తిభిః వేదాంత వాక్యానామద్వితీయ బ్రహ్మణి తాత్పర్య నిశ్చయః శ్రవణమ్" అని శాస్త్రోక్తి.

**షడూర్ములు** క్షుత్పిపాసలు, శోకమోహాలు, జన్మమృత్యువులు అనే ఆరు (257 శ్లో).

**షడ్భావ వికారాలు** వస్తువు పొందే ఆరు విధాలైన మార్పులు. పుట్టడం, ఉండడం, మార్పు పొందడం, పెరగడం, క్షీణించడం, నశించడం అనేవి.

**సత్తు** సత్ అనగా మూడు కాలాలోను ఉండేది. ఆత్మ.

**సత్త్వగుణం** మూడు గుణాలలో ప్రధానమైనది. ఆత్మానుభవానికి అత్యంతముఖ్యమైనది. "సత్త్వాత్ సంజాయతే జ్ఞానమ్" అని గీత (14-7) సత్త్వగుణం నుండి జ్ఞానం కలుగుతుందని భావం. ఇది శుద్ధసత్త్వం, మిశ్రసత్త్వం అని రెండు విధాలు,

**సమాధానం** శుద్ధమైన బ్రహ్మమందు అంటే ప్రత్యగాత్మయందు బుద్ధిని చక్కగా స్థిరంగా ఎల్లప్పుడు నిల్పడం (27 శ్లో).

**సమాధి** ధ్యాత ధ్యానం అనే రెండింటిని విడిచి క్రమంగా ధ్యేయమైన పరమాత్మ యందు మనస్సుని గాలిలేనప్పుడు కదలకుండా ఉండే దీపంవలె స్థిరంగా నిల్పడం.

**సమ్యగ్ జ్ఞానం** బ్రహ్మము ఆత్మ అభిన్నమైనవి, ఒక్కటే అని తెలిపే జ్ఞానం అని వేదం చెప్తోంది (240 శ్లో).

**స్వప్నావస్థ** కల. జీవుడు సూక్ష్మశరీర స్థితిలో ఉండడం. తానుమాత్రమే ప్రకాశిస్తూ ఉంటాడు. జాగ్రదవస్థలో ఇంద్రియాలు ఆచరించే పనులు అన్నింటినీ స్వప్నావస్థలో బుద్ధి ఒక్కటే స్వయంగా నిర్వహిస్తుంది. కర్తృత్వాన్ని పొందుతుంది (100, 101 శ్లో).

**సాధనచతుష్టయం** నిత్యానిత్య వస్తువివేకం, ఇహాముత్రఫలభోగ విరాగం,

శమాదిషట్కం, ముముక్షుత్వం అనే నాలుగు.

**సుషుప్తి** గాఢనిద్ర. ఇంద్రియాలయొక్కయు, బుద్ధియొక్కయు వృత్తులు అన్నీ అంతఃకరణమందు లీనమై ఉండే స్థితి. ఇదే కారణ శరీరం. సర్వవిధాలైన వస్తుజ్ఞానం శాంతిస్తుంది. బుద్ధిమాత్రం బీజమాత్రంగా ఉంటుంది. సుషుప్తిని పొందినవాడు "కొంచెం కూడా తెలియని స్థితిని అనుభవించేను" అంటాడు (122, 123 శ్లో).

**సూక్ష్మ శరీరం** దీనికే లింగశరీరమని కూడా పేరు. కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు, ప్రాణవాయువులు, పంచభూతాలు, అంతఃకరణ చతుష్టయం, అవిద్య, కామం, కర్మ అనే వాని అన్నింటికీ సూక్ష్మశరీరమని పేరు. ఇది పూర్వజన్మ వాసనలు కల్గియుంటుంది. పుణ్య పాపకర్మల అనుభవానికి ఆధారమైనది (98, 99 శ్లో).

**స్థూల శరీరం** మజ్జ ఎముకలు మేదస్సు మాంసం రక్తం చర్మం త్వక్కు అనే సప్త ధాతువులతోను పాదాలు తొడలు వక్షస్థలం భుజాలు పృష్ఠం అనే అవయవాలతోను కూడినది. నేను నాది అనే మోహానికి ఆధారమైనది. పంచీకరణం పొందిన పంచభూతాలతో ఏర్పడేది (74, 75, 76 శ్లో).

## ఆత్మకు సంబంధించిన పదాల వివరణ

అఖండం = అవయవాలు లేనిది (పరిపూర్ణమైనది)
అక్రియం = ఏపని లేనిది
అక్షరం = నాశం లేనిది
అద్వయం = రెండవది లేనిది (ఎప్పుడూ ఒక్కటిగానే ఉండేది)
అద్వితీయం = రెండవది లేనిది
అద్వైతం = రెండుకానిది (ఒక్కటే అయినది)
అనంతం = అంతం లేనిది
అనాద్యంతం = మొదలు తుది లేనిది
అనాధేయం = పైనా లోపలా ఉంచదగ్గ వస్తువు లేనిది
అనాశ్రయం = ఏవిధమైన ఆశ్రయం (ఆధారం) లేనిది
అనిరూప్య స్వరూపం = ఇది అని చెప్పడానికి శక్యంగాని ఆకారం గలది
అనిర్వచనీయం = చెప్పలేని ఆకారం గలది



అనుపాదేయం = గ్రహింపదగనిది
అప్రతర్క్యం = ఊహకు అందనిది
అప్రమేయం = కొలతకు శక్యం గానిది
అవికారం = ఏవిధమైన మార్పులు (షడ్భావ వికారాలు) లేనిది
అసంగం = దేనితోను కలియనిది
అసత్తు = మూడు లోకాలలో ఉండనిది
అహేయం = విడిచిపెట్టడానికి ఏమీలేనిది
ఆనందఘనం = గడ్డకట్టిన ఆనందం
ఏకం = ఒక్కటియైనది
ఏకరసం = ఆనందమాత్రమే అయినది
చిద్ఘనం = గడ్డకట్టిన చైతన్యం (జ్ఞానం)
నిత్యం = అన్ని కాలాలలోను ఉండేది
నిరంజనం = ఎటువంటి మైపూత లేనిది
నిరవద్యం = దోషాలు లేనిది
నిరాకారం = రూపం లేనిది
నిరాకృతి = ఆకారం లేనిది
నిరాలంబం = ఆధారం లేనిది
నిర్ద్వయం = రెండవ వస్తువు లేనిది
నిర్వికల్పం = భిన్నమైన వేరొక ఆలోచన లేనిది
నిర్గుణం = తెలుపు పొట్టి మొదలైన గుణాలు లేనిది
నిష్కలం = విభాగాలు లేనిది (ఏకరూపం గలది)
నిష్క్రియం = ఏవిధమైన చేష్టలేనిది
ప్రజ్ఞానఘనం = గడ్డకట్టిన జ్ఞానం
మనోవాచామగోచరం = మనస్సుకి వాక్కులకి కనబడనిది
బుద్ధం = జ్ఞాన స్వరూపం
సత్తు = మూడు లోకాలలోను ఉండేది
సత్యం = ఎప్పుడూ ఉండేది
సత్ సమృద్ధం = సత్తుతో నిండినది
సద్ఘనం = గడ్డకట్టిన సత్తు
సర్వతో ముఖం = విశ్వవ్యాప్తమైనది

| | | |
|---|---|---|
| సర్వాతీతం | = | అన్నింటికీ అతీతమైనది |
| సర్వాత్మకం | = | సర్వం అయినది |
| సూక్ష్మం | = | ఇంద్రియాలకి గోచరం గానిది |
| స్వతః సిద్ధం | = | సహజంగా ఏర్పడినది. |







# వివేక చూడామణి

సర్వవేదాంత సిద్ధాంతగోచరం తమగోచరమ్।
గోవిందం పరమానందం సద్గురుం ప్రణతోఽస్మ్యహమ్॥ 1

సమస్త వేదాంతసారమనదగిన అద్వైత సిద్ధాంతమందు స్ఫురించువాడు, ఇంద్రియాలకు కానరానివాడు, పరమానంద స్వరూపుడు, సద్గురువు అయిన గోవిందునకు నమస్కరిస్తున్నాను.

సమస్త ప్రాణికోటిలో నరజన్మ దుర్లభం. ఆ మనుష్య జన్మలో పురుషునిగా పుట్టడం, విప్రధర్మాన్ని పొందడం, వైదికధర్మాన్ని అనుష్ఠించడంలో ఆసక్తుడై ఉండడం, శాస్త్రవైదుష్యం కల్గి ఉండడం, ఆత్మ అనాత్మల వివేచన చేయగల్గడం, ఆత్మానుభవం పొందడం, అహం బ్రహ్మాస్మి అని ఎల్లప్పుడు ఉండడం అనేవి క్రమంగా దుర్లభమనదగ్గవి. సంసార బంధం నుండి ముక్తి శతకోటి జన్మలలో ఆచరించిన సత్కర్మవల్లనే పుణ్యాలచే మాత్రమే లభిస్తుంది.

జంతూనాం నరజన్మ దుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా
తస్మాద్వైదిక ధర్మమార్గపరతా విద్వత్త్వమస్మాత్పరమ్
ఆత్మానాత్మ వివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితి
ర్ముక్తిర్నో శతకోటి జన్మ సుకృతైః పుణ్యైర్వినా లభ్యతే 2

మనుష్యజన్మ, సంసారబంధవిముక్తి పొందాలనే కోరిక కల్గడం, సద్గురువుల సేవ అనేవి మూడూ దుర్లభమైనవి. భగవదనుగ్రహంచే మాత్రమే పొందదగ్గవి. దుర్లభమైన మానవజన్మ పొంది, అందులోను పురుషునిగా పుట్టి, వేదాధ్యయన ప్రవీణుడై సంసారబంధం నుండి ముక్తి పొందడానికి ప్రయత్నించకపోతే అతడు అజ్ఞానిగా పరిగణింపదగ్గవాడు. అజ్ఞానంచే తన్నుతాను స్వయంగా చంపుకొన్నవాడే అవతాడు. దుర్లభమైన మనుష్యజన్మ, అందులోను పురుషజన్మ పొంది కేవలం విషయ సుఖాలు అనుభవించడంలో మోహాన్ని చెందేవానికంటే అజ్ఞాని మరొకడు ఉండడు.

శాస్త్రాలు చదువవచ్చు. దేవతలని ఉద్దేశించి యజ్ఞాలు చేయవచ్చు. సత్కర్మలు అనుష్ఠింపవచ్చు. వివిధ దేవతలని పూజలు మొదలైన వానిచే అర్చింపవచ్చు. జ్ఞానంవల్ల నేను బ్రహ్మమును (అహం బ్రహ్మాస్మి) అనే అనుభవాన్ని పొందినప్పుడే సంసారవిముక్తి లభిస్తుంది. నూరు బ్రహ్మకల్పములకైనా మరో మార్గంచేత విముక్తి ప్రాప్తించదు. ముక్తికి కర్మహేతువు కాదని శ్రుతి "అమృతత్వస్య తు నాశాస్తి విత్తేన" అని స్పష్టంగా చెప్తోంది.

## కర్తవ్యం

శాస్త్ర పాండిత్య గలవాడు ముక్తికోసం తప్పక ప్రయత్నించాలి. బాహ్య ప్రపంచానికి సంబంధించిన రూపరసగంధాది విషయాలవల్ల కలిగే సుఖలేశాన్ని కూడా విడిచిపెట్టాలి. సత్పురుషుడు బ్రహ్మోపదేశం చేయడానికి అర్హుడైన గురువుని ఆశ్రయించాలి. అతడు ఉపదేశించిన విషయాన్ని మనస్సులో చక్కగా నిల్పుకోవాలి. చిత్తవృత్తిని స్థిరంగా నిరోధించుకొంటూ ఆత్మను దర్శించడంలో నిష్ఠను పొందాలి. సంసారసాగరంలో మునిగిన తన్ను తానే ఉద్ధరించుకోవాలి.

## కర్మానుష్ఠానం

మనస్సుని నిగ్రహించుకోడాన్ని అభ్యసిస్తున్న ధీరులైన పండితులు సమస్తకామ్యకర్మలు విడిచిపెట్టి సంసారబంధ విముక్తికోసం తప్పక ప్రయత్నించాలి. కర్మలు ఆచరించడంవల్ల చిత్తశుద్ధి మాత్రమే లభిస్తుంది. పరబ్రహ్మము ప్రాప్తింపదు. నిత్య అనిత్య వస్తు విచారంచేత మాత్రమే పరమాత్మ లభిస్తుంది. కోటి కర్మలు అనుష్ఠించినప్పటికీ కొంచెం కూడా పరబ్రహ్మము ప్రాప్తించదు. అంటే బ్రహ్మానుభవం కల్గదు.

**చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే।**
**వస్తుసిద్ధిర్విచారేణ న కించిత్కర్మ కోటిభిః॥**

మసక చీకటిలో త్రాడును చూసి భ్రాంతిచే సర్పం అనుకొన్నప్పుడు దుఃఖం కల్గుతుంది. అది త్రాడేగాని పాముకాదు అని నిర్ణయించినప్పుడు ఆ దుఃఖం నాశనమవుతుంది. ఆ నిర్ణయం వస్తుస్వరూపాన్ని బాగా విచారించినప్పుడే సిద్ధిస్తుంది. ఆప్తుని వాక్యాన్ని గ్రహించి చక్కగా విచారించడంచేత వస్తుస్వరూపం





నిశ్చయింపబడడం లోకంలో చూస్తున్నాము. స్నానంచేగాని దానంచేగాని వందల ప్రాణాయామాలచేగాని పదార్థజ్ఞానం కల్గదు. ఆత్మస్వరూపం గురూపదేశాన్ని అనుసరించి స్వయంగా విచారించడంచేతనే గ్రహింపబడుతుందిగాని స్నానదానాలచే గాని ప్రాణాయామశతంచేగాని కాదని తాత్పర్యం.

## అధికారి లక్షణాలు

విశేషంగా అధికారం గలవానికి మాత్రమే ఫలసిద్ధి (బ్రహ్మప్రాప్తి) లభిస్తుంది. ఆ విషయంలో దేశకాలాదులు కేవలం సహకరించేవి మాత్రమే. ఆ కారణంగా ముక్తిని కోరుకొనేవాడు దయాసముద్రుడు బ్రహ్మవేత్తలలో ఉత్తముడు అయిన గురువుని పొంది ఆత్మవస్తువుని తప్పక విచారించాలి.

మేధావి ఊహ అపోహ అనేవానిని వివేచింపగల పండితుడు ముందు చెప్పబోయే సాధన చతుష్టయాన్ని కల్గినవాడు ఆత్మవిద్యని పొందడంలో అధికారి అనదగ్గవాడు. వివేకం వైరాగ్యం శమాదిగుణాలు మోక్షేచ్ఛగలవాడు మాత్రమే బ్రహ్మమును గూర్చి తెలుసుకోడానికి యోగ్యుడు.

## సాధన చతుష్టయం

బ్రహ్మజిజ్ఞాసకు పండితులు నాల్గు సాధనాలు పేర్కొన్నారు. వానిని కల్గిన వానికే అది సిద్ధిస్తుంది. అవి లేనివానికి సిద్ధించదు. అవి:(1)నిత్యానిత్యవస్తు వివేకం (2) ఇహాముత్ర ఫలభోగ విరాగం (3) శమాది షట్క సంపత్తి (4) ముముక్షుత్వం.

**ఆదౌ నిత్యాఽనిత్య వస్తు వివేకః పరిగణ్యతే**
**ఇహాముత్ర ఫలభోగ విరాగస్తదనంతరమ్**
**శమాది షట్క సంపత్తిర్ముముక్షుత్వమితి స్ఫుటమ్ 18,19**

బ్రహ్మ సత్యం జగత్తు మిథ్య అనే దృఢనిశ్చయం నిత్యానిత్య వస్తు వివేకం అనిపించుకొంటుంది. స్వయంగా దర్శించడం, వేదాంతవాక్యాలు వానితోపాటు గురూపదేశం వినడం మొదలైన వానిచే దేహంనుండి బ్రహ్మవరకుగల అనుభవింపదగ్గ వస్తుజాలం సర్వమూ అనిత్యమని తెలుసుకొని వానియనుభవమందు కోరికను పూర్తిగా విడిచిపెట్టడం వైరాగ్యం.

శమం దమం ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానం(సమాధి) అనే ఆరింటికీ శమాదిషట్కమని వ్యవహారం.

రూపరసగంధాది విషయాలని మాటమాటకీ దోషదృష్టితో దూరం చేసుకొంటూ వానియందు అనురాగాన్ని కోల్పోయి తన లక్ష్యమైన పరబ్రహ్మమందు మనస్సుని స్థిరంగా నిల్పడం శమం. జ్ఞానేంద్రియాలనీ కర్మేంద్రియాలనీ వానివాని విషయాలనుండి మరల్చి వానిని తమతమ స్థానాలలో స్థిరంగా ఉంచడం దమం. మనస్సుని బాహ్యవిషయాలపై ప్రసరించకుండా నిగ్రహించడం ఉత్తమమైన ఉపరతి. ప్రతీకారదృష్టిని పూర్తిగా విడిచిపెట్టి చింతనుగాని, బాధనుగాని పొందకుండా సర్వదుఃఖాలనీ సహించడం తితిక్ష. పండితులు వేదం(శాస్త్రం)లో చెప్పబడ్డది, గురువు ఉపదేశించింది సత్యబద్ధమైనదని నిశ్చయించుకోవడం శ్రద్ధ. దీనిచేతనే బ్రహ్మప్రాప్తి. శుద్ధమైన పరబ్రహ్మమందు ఎల్లప్పుడు బుద్ధిని స్థిరంగా నిల్పడం సమాధానం. మనస్సుని లాలించడం కాదు. తాను పరబ్రహ్మమనే జ్ఞానంచేత అజ్ఞానంచే కల్పింపబడ్డ అహంకారం మొదలుకొని దేహంవరకు గల బంధాలని విడిచిపెట్టడంలోని కోరిక ముముక్షుత్వం.

ఈవిధమైన సాధనాలు నాలుగూ కలవారు మాత్రమే బ్రహ్మజిజ్ఞాసకి అర్హులు.

వైరాగ్యం, శమాదిషట్కం అనే రెండు విషయాలు ఆధారంగా సమీక్షిస్తే కొందరిలో ముముక్షుత్వం మందంగాను, మరికొందరిలో మధ్యమంగాను ఉంటుందని తెలుస్తుంది. ఎలా ఉన్నప్పటికీ గురువుయొక్క అనుగ్రహంచేత అది బాగా వృద్ధిపొందుతుంది. ఫలాన్ని ఇస్తుందికూడా. వైరాగ్యం ముముక్షుత్వం అనేవి ఎవరిలో తీవ్రంగా ఉంటాయో వారి శమాదులే సార్థకమవతాయి. ఫలిస్తాయి. వైరాగ్యం ముముక్ష మందంగా ఉన్నవారియందు చవిటినేలలోని నీటివలె శమాదులు ప్రకాశిస్తాయి కాని ఫలింపవు.

## భక్తి స్వరూపం

మోక్షానికి సాధనమైనది జ్ఞానం. ఈ జ్ఞానానికి గల కారణ సామగ్రిలో భక్తి ఎంతో శ్రేష్ఠమైనది. తాను తన స్వరూపంలో (ప్రత్యగాత్మలో) లీనమై ఉండడం భక్తి అని చెప్పబడుతుంది. తన స్వరూపమైన పరబ్రహ్మమందు మునిగియుండడమని తాత్పర్యం. తాను పరబ్రహ్మమే అని నిత్యం భావించడం భక్తి అని కొందరిమతం.





మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ
స్వస్వరూపానుసంధానం భక్తిరిత్యభిధీయతే
స్వాత్మతత్త్వానుసంధానం భక్తిరిత్యపరే జగుః 32

## గురువు లక్షణాలు

సాధనచతుష్టయం కలిగి ఆత్మను గూర్చి తెలుసుకోవాలనే కోరికగలవాడు ప్రాజ్ఞుడైన గురువుని ఆశ్రయించాలి. అతనివల్లనే సంసారబంధ విముక్తి లభిస్తుంది. వేదవేత్త (ఉపనిషత్ వైదుష్యం గలవాడు) పాపరహితుడు కోరికలచే లేశమాత్రమైనా చలించనివాడు బ్రహ్మవేత్తలలో ఉత్తముడు నిత్యం పరబ్రహ్మమందు లీనమైనవాడు కట్టెలు లేని అగ్నివలె కోరికలు లేకపోవుటచే శాంతించిన మనస్సుగలవాడు కారణం లేకుండానే దయకు సముద్రం వంటివాడు వినమ్రులైన సత్పురుషులకు అంటే శిష్యులకు బంధువు అయినవాడు గురువుగా గ్రహింపదగ్గవాడు.

శ్రోత్రియోఽవృజినోఽకామహతో యో బ్రహ్మవిత్తమః
బ్రహ్మణ్యుపరతశ్శాంతో నిరింధన ఇవానలః
అహేతుక దయాసింధుర్బంధురానమతాం సతామ్॥ 34,35

అట్టి గురువుని భక్తితో వినయవిధేయతలతో ఆరాధించి ప్రసన్నుణ్ణి చేసుకొని ఆత్మను గూర్చి తెలుసుకోవలసినదాన్ని ఇలా ప్రశ్నించాలి.

## ప్రశ్నింపవలసిన పద్ధతి

స్వామీ! వంగి నమస్కరించేవారికి బంధువైనవాడా! దయకు సముద్రము వంటివాడా! నేను భవసాగరంలో పడ్డాను. క్రీగంటి ప్రసారంతో కారుణ్యామృతాన్ని వర్షించి నన్ను ఉద్ధరించు.

నేను వారింపశక్యంగాని సంసారమనే కార్చిచ్చుచే దహింపబడుతున్నాను. దురదృష్టములు (పాపములు) అనే వాయువులచే ఎగురగొట్టబడుతున్నాను. భయపడుతున్నాను. నిన్ను శరణు పొందుతున్నాను. అన్ని విధములా మృత్యువునుండి నన్ను రక్షించు. నువ్వు తప్ప నాకు రక్షకులు ఎవ్వరూ లేరు.

దుర్వార సంసార దవాగ్ని తప్తం
దోధూయమానం దురదృష్టవాతైః
భీతం ప్రపన్నం పరిపాహి మృత్యోః
శరణ్యమన్యం యదహం న జానే॥ 38

శాంతస్వభావులు మహాత్ములు అయిన సత్పురుషులు వసంతఋతువువలె లోకానికి ఆహ్లాదాన్ని కల్గిస్తూ సంచరిస్తూ ఉంటారు. భయంకరమైన సంసారసాగరాన్ని స్వయంగా వారు తరించి అకారణంగానే ఇతరులని కూడా తరింపజేస్తూ ఉంటారు. ఇతరుల శ్రమను పోగొట్టడంలో ఆసక్తి కల్గి ఉండడం మహాత్ముల సహజలక్షణం. సూర్యుని వేడికిరణాలచే బాగా తపింపబడ్డ భూమిని ఈ చంద్రుడు స్వయంగా రక్షిస్తాడుగదా.

ప్రభూ! నేను సంసారమందలి తాప (త్రయం)మనే కార్చిచ్చు మంటలచే బాగా తపింపబడుతున్నాను. బ్రహ్మానందరసానుభూతిగలవి, పవిత్రమైనవి, మిక్కిలి చల్లనైనవి, మీయొక్క వాక్కులనే కలశములచే విడిచిపెట్టబడుతున్నవి, చెవులకు ఇంపైనవి అయిన వాక్యామృతాలని నాపై చల్లండి. మీ కటాక్ష పాతాన్ని క్షణమైనా పొంది పాత్రులై మీచే స్వీకరింపబడ్డవారు ధన్యులుగదా.

బ్రహ్మానంద రసానుభూతి కలితైః పూతైః సుశీతైర్యుతై
ర్యుష్మద్వాక్కలశో జ్ఝితైః శ్రుతిసుఖైర్వాక్యామృతైః సేచయఙ
సంతప్తం భవతాప దావ దహన జ్వాలాభిరేనం ప్రభో!
ధన్యాస్తే భవదీక్షణక్షణగతేః పాత్రీకృతాః స్వీకృతాః॥ 41

ఈ సంసార సాగరాన్ని ఎలా తరిస్తాను? ఏదిగతి? ఏది ఉపాయం? ప్రభూ! కొంచెంకూడా తెలుసుకోలేకపోతున్నాను. దయతో నన్ను కాపాడు. సంసార దుఃఖనాశాన్ని కల్గించు.

## గురువుయొక్క అభయం

ఈవిధంగా ప్రార్థిస్తూ సంసారమనే కార్చిచ్చుమంటలచే తపింపబడి తన్ను శరణువేడి వచ్చినవాణ్ణి దయారసంతో ఆర్ద్రమైన చూపుతో మహాత్ముడైన గురువు





వెంటనే అభయాన్ని అనుగ్రహిస్తాడు. దరిచేరినవాడు మోక్షేచ్ఛగలవాడు ఉపదేశాన్ని చక్కగా ఆచరించేవాడు ప్రశాంతచిత్తుడు శమంగలవాడు అయిన ఆ శిష్యునికి విద్వాంసుడైన గురువు దయతో తత్త్వోపదేశం చేయాలి. ఈవిధంగా చేరదీయాలి.

"ఓ విద్వాంసుడా! భయపడకు. నీకు అపాయం లేదు. సంసార సాగరాన్ని తరించడానికి ఉపాయం ఉంది. యతులు దేనిచేత సంసార సాగరం యొక్క ఒడ్డుని చేరేరో ఆ మార్గాన్ని నీకు నిర్దేశిస్తున్నాను. సంసార భయాన్ని నాశనంచేసే గొప్ప ఉపాయం ఉంది. దానిచే నువ్వు సంసార సముద్రాన్ని దాటి పరమానందాన్ని అనుభవిస్తావు.

ఉపనిషత్తులలో నిరూపింపబడ్డ అర్థాన్ని విచారించడంవల్ల ఉత్తమమైన జ్ఞానం లభిస్తుంది. దానిచే సమస్తమైన సంసారదుఃఖం నశిస్తుంది. ముముక్షువుకి భక్తిశ్రద్ధ ధ్యానం యోగం అనే నాలుగూ ముక్తికి హేతువులని వేదవాక్కు ఆ నాల్గింటిని ఎవడు ఎప్పుడు కల్గిఉంటాడో అప్పుడు అతనికి అజ్ఞానంచే కల్పింపబడ్డ దేహబంధం నుండి ముక్తి లభిస్తుంది.

ఆత్మస్వరూపుడవైన నీకు అజ్ఞానంవల్ల అనాత్మయైన దేహంతో బంధం ఏర్పడింది. దానివల్ల సంసారం ప్రాప్తించింది. ఏది ఆత్మయో ఏది అనాత్మయో వివేచన చేయడంవల్ల కల్గిన జ్ఞానాగ్ని అజ్ఞానాన్నీ దానివల్ల ఏర్పడ్డ సంసారాన్నీ సమూలంగా నాశనం చేస్తుంది".

## శిష్యుని పరిప్రశ్న

శిష్యుడు ఇలా అన్నాడు. "స్వామీ! దయతో వినండి. ఒక్క ప్రశ్న వేస్తున్నాను. సమాధానం మీ ముఖం నుండి విని కృతార్థుణ్ణి అవతాను.

బంధం అంటే ఏమిటి? ఆ బంధం ఎక్కడినుండి వచ్చింది? దానికి ఆధారం ఏది? ఆ బంధం ఎలా విడిపోతుంది? అనాత్మ అంటే ఏది? తన స్వరూపమైన పరమాత్మ ఏది? అనాత్మ ఆత్మ అనే ఆ రెండింటి వివేకం ఎలా కల్గుతుంది? వివరించగోరుతున్నాను."

కోనామ బంధః కుత ఏష ఆగతః
కథం ప్రతిష్ఠాఽస్య కథం విమోక్షః
కోసావనాత్మా పరమః క ఆత్మా
తయోర్వివేకః కథమేతదుచ్యతామ్ 51

## గురువచనం

గురువు ఇలా అన్నాడు. "అజ్ఞాన బంధవిముక్తి పొంది బ్రహ్మత్వం పొందాలని కోరుకొంటున్నావు. ధన్యుడివి. కృతకృత్యుడివి. నీచే నీ కులం పవిత్రమయింది. తండ్రికి ఋణవిముక్తి గావించే కొడుకులు మొదలైనవాళ్లు ఉన్నారు. కాని సంసార బంధ విముక్తిని ఎవ్వరూ కల్గించలేరు. తనకు తానే ప్రయత్నించి విముక్తిని పొందాలి.

నెత్తిమీదనున్న బరువు మొదలైన దానివల్ల కలిగే దుఃఖాన్ని ఇతరులు తొలగింపగల్గుతారు. కాని ఆకలి మొదలైన వానివల్ల కలిగే దుఃఖాన్ని ఎవ్వరూ పోగొట్టలేరు. తనకు తానే నివారించుకోవాలి. ఆరోగ్యం కోసం రోగియే పథ్యం చేయాలి. ఔషధాన్ని సేవించాలి. అతనివంతు మరొకరు ఆ రెండూ చేస్తే ప్రయోజనం చేకూరదుగదా. ఆత్మస్వరూపం స్పష్టమైన జ్ఞాననేత్రంచేత ఎవనికి వాడే స్వయంగా గ్రహించాలి. అది శాస్త్రపాండిత్యంచే పండితునిచే తెలియబడేదిగాదు. చంద్రుని స్వరూపం స్వయంగా చూసి తెలుసుకోదగ్గదే గాని ఇతరులు చూస్తే తెలియబడదు. అవిద్య కామం కర్మ మొదలైన పాశబంధాన్ని ఎవనికి వాడే స్వయంగా జ్ఞానప్రాప్తి చేత విప్పుకోవాలి. శతకోటి కల్పములకైనా మరొకవిధంగా ఎవ్వడూ వదల్చుకోలేడు.

సంసార బంధవిముక్తి యోగంచేగాని, సాంఖ్యంచేగాని, కర్మచేగాని, శాస్త్రవైదుష్యంచేగాని సిద్ధింపదు. జీవుడు బ్రహ్మము అభిన్నములు అంటే ఒక్కటే అనే జ్ఞానంచేత మాత్రమే ఆ విముక్తి లభిస్తుంది. మరో మార్గం లేదు. వీణయొక్క రూపసౌందర్యమూ, ఆ వీణని వాయించడంలోని ప్రావీణ్యమూ ప్రజలను రంజింప చేయగలవు గాని సామ్రాజ్యాన్ని ఇప్పింపలేవుగదా.

## పాండిత్య స్వభావం

వాక్చాతుర్యం ప్రవాహంగా పదాలు ప్రయోగించడం శాస్త్రాన్ని





వ్యాఖ్యానించడంలో నైపుణ్యం పాండిత్యం అనేవి పండితులకి భుక్తిని కల్గిస్తాయిగాని ముక్తిని ఒసంగలేవు.

వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్
వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయే న తు ముక్తయే॥ 60

పరతత్త్వం తెలుసుకోలేకపోతే ఆ శాస్త్రాధ్యయనం నిష్ఫలమే అవుతుంది. పరతత్త్వం బాగా తెలిస్తే కూడా ఆ శాస్త్రాధ్యయనం ప్రయోజనరహితమే అవుతుంది.

అవిజ్ఞాతేపరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా
విజ్ఞాతేఽపి పరే తత్త్వే శాస్త్రాఽధీతిస్తు నిష్ఫలా॥ 61

శాస్త్రాలలోని పదజాలం మహారణ్యం వంటిది. చిత్తానికి భ్రాంతిని కల్గిస్తుంది. కాబట్టి ప్రయత్నించి తత్త్వం బాగా తెలిసినవానినుండి ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవాలి.

అజ్ఞానమనే పాముచే కరవబడినవానికి బ్రహ్మజ్ఞానమనే ఔషధం ఒక్కటే ప్రయోజనాన్ని చేకూరుస్తుంది. వేదాలచే శాస్త్రాలచే మంత్రాలచే ఔషధాలచే ఫలం దక్కదు. ఔషధాన్ని సేవిస్తేనే రోగం నివారింపబడుతుందిగాని ఔషధం యొక్క పేరు చెప్పడంచేత తొలగదు. సంసారబంధం స్వయంగా బ్రహ్మానుభూతిని పొందితేనే తొలగుతుందిగాని "అహం బ్రహ్మాస్మి" అని ఉచ్చరించడం చేత విడిపోదు. కంటికి కనబడుతున్న ప్రపంచాన్ని లయంచేసుకోకుండా ఆత్మతత్త్వం తెలుసుకోకుండా బాహ్యంగా నేను బ్రహ్మను అని ఎన్నిసార్లు అనుకొంటున్నప్పటికీ ముక్తి లభింపదు. శత్రువులని సంహరించకుండా సమస్త భూసంపదను పొందకుండా నేను రాజుని అని ఉచ్చరించడంవల్ల అతడు రాజు కాలేడు.

భూమిలోనున్న నిధిని పొందడానికి యథార్థం చెప్పేవాని మాటను అనుసరించి త్రవ్వడం, ఆ నిధిపై మూతగానున్న బండరాతిని తొలగించడం అవసరం. బైట ఇక్కడ నిధి ఉందని చెప్పడంవల్ల ఆ నిధి లభింపదు. ఆవిధంగా మాయచేతను, దాని కార్యాలచేతను కప్పబడ్డ తనదైన స్వచ్ఛమైన తత్త్వం (ఆత్మతత్త్వం) గురువైన బ్రహ్మవేత్త గావించిన ఉపదేశాన్ని గ్రహించి మనన ధ్యానాదులు ఆచరిస్తే పొందబడుతుంది. కేవలం శాస్త్రవాక్యాలు వల్లించడంవల్ల ఆత్మతత్త్వం అనుభవింపబడదు.

ఆప్తోక్తిం ఖననం తథోపరి శిలాపాకర్షణం స్వీకృతిం
నిక్షేపః సమపేక్షతే న హి బహిః శబ్దైస్తు నిర్గచ్ఛతి
తద్వద్బ్రహ్మవిదోపదేశ మనన ధ్యానాదిభిర్లభ్యతే
మాయాకార్య తిరోహితం స్వమమలం తత్త్వం న దుర్యుక్తిభిః॥ 67

కాబట్టి అన్నివిధాలా ప్రయత్నించి భవబంధ విముక్తికోసం రోగాదుల విషయంలో ప్రయత్నించినట్లు పండితులు ఎవరికి వారే కర్తవ్యంగా తప్పక ప్రయత్నించాలి. విద్వాంసుడవైన ఓ శిష్యుడా! నవ్వు అడిగిన ప్రశ్న శ్రేష్ఠమైనది. శాస్త్రవేత్తలకి సమ్మతమైనది. సూత్రప్రాయమైనది. నిగూఢమైన అర్థం గలది. ముముక్షువులచే తప్పక తెలుసుకోదగ్గది. నేను చెప్పేదాన్ని సావధానంగా విను. దీన్ని వినడంచేత వెంటనే భవబంధం నుండి విముక్తి పొందుతావు.

## ముక్తి హేతువు

అనిత్యములైన వస్తువులయందు అత్యంతమైన వైరాగ్యాన్ని పొందడం మోక్షానికి మొదటి హేతువుగా చెప్పబడుతోంది. ఆ పిమ్మట శమం దమం తితిక్ష ఇష్టములైన (కామ్య) సమస్తకర్మలను పూర్తిగా విడిచిపెట్టడం అనేవి కూడా హేతువులుగా పరిగణింపబడతాయి. వీనిని పొందిన తర్వాత మునికి వేదాంత శ్రవణం, వాని మననం నిత్యం నిరంతరం చిరకాలం తనదైన తత్త్వాన్ని (ఆత్మతత్త్వాన్ని) ధ్యానించడం అవసరం. ఈ ధ్యానం మొదలైనవానిని కల్గిన పండితుడు వికల్పరహితమైన పరబ్రహ్మమును అనుభవిస్తూ ఈ లోకంలోనే నిర్వాణసుఖాన్ని పొందుతాడు. అంటే జీవన్ముక్తుడు అవతాడు.

## స్థూల శరీరం

ఈ శరీరం మజ్జ ఎముకలు మేదస్సు మాంసం రక్తం చర్మం త్వక్కు అనే సప్తధాతువులతోను, పాదాలు తొడలు రొమ్ము భుజాలు వీపు శిరస్సు అనే అంగాలతోను, కన్ను మొదలైన ఉపాంగాలతోను కూడుకొని ఉంటుంది. ఇది నేను నాది అనే మోహానికి ఆధారమైనది. దీన్ని పండితులు స్థూలశరీరం అంటారు.





మజ్జాస్థి మేదః పలరక్త చర్మ
త్వగాహ్వయైర్ధాతుభిరేభిరన్వితమ్
పాదోరు వక్షో భుజ పృష్ఠమస్తకై
రంగైరుపాంగైరుపయుక్త మేతత్
అహం మమేతి ప్రథితంశరీరం
మోహాస్పదం స్థూలమితీర్యతే బుధైః॥ 74,75

ఆకాశం వాయువు అగ్ని జలం భూమి అనే పంచభూతాలు సూక్ష్మరూపంలో పరస్పరాంశాలతో కలిసి అంటే పంచీకరణం పొంది స్థూలశరీరానికి హేతువులు అవతాయి. ఆపంచభూతాలకీ శబ్దం స్పర్శ రూపం రసం గంధం అనే అయిదూ విషయాలు. వీనికి పంచతన్మాత్రలని వ్యవహారం. భోక్తయైన జీవునికి ఈ పంచతన్మాత్రలు సుఖాన్ని కల్గించడంలో విషయాలు అవతాయి.

అజ్ఞానులు ఈ అయిదు విషయములందు అనురాగం అనే దుస్సహమైన గొప్ప పాశంచే బంధింపబడి అధోలోకాలకీ, ఊర్ధ్వలోకాలకీ ఇంకా వానిపైన ఉండే లోకాలకీ వెళ్తూ వస్తూ ఉంటారు. వారు గావించిన కర్మ అనే దూత వాళ్లని వేగంగా ఆయా లోకాలకి తీసుకొని వెళ్తూ ఉంటుంది.

య ఏషు మూఢా విషయేషు బద్ధా
రాగోరుపాశేన సుదుర్దమేన
ఆయాంతి నిర్యాంత్యధ ఊర్ధ్వముచ్చైః
స్వకర్మదూతేన జవేన నీతాః॥ 77

లోకంలో శబ్దమందలి అనురాగంచే లేడి, స్పర్శయందలి అనురాగంచే ఏనుగు, రూపమందలి అనురాగంచే మిడుత, రసమునందలి అనురాగంచే చేప, గంధమందలి అనురాగంచే తుమ్మెద బాధింపబడి మరణిస్తున్నాయి. విషయాలు అయిదింటిలో ఒక్కొక్కదానిపై అనురాగం గాఢంగా ఉండడంవల్లనే ఒక్కొక్కటి మరణిస్తున్నప్పుడు అయిదింటిపై ప్రబలమైన అనురాగం గలవాడు ఎట్టి అవస్థను పొందుతాడో చెప్పనక్కరలేదుగదా. శబ్దస్పర్శాది విషయాలు దోషంలో నల్లత్రాచు పాము విషంకంటె కూడా ఎంతో తీవ్రమైనవి. భక్షించినవాళ్లే విషం చంపుతుంది. శబ్దం రూపం మొదలైన విషయంపై దృష్టి పడితేచాలు. వాళ్లే అది చంపుతుంది.

శబ్దస్పర్శాది విషయాలపై ఆశ ఎంతో బలీయమైనది. సుఖంగా విడిచిపెట్టడానికి సాధ్యంకానిది. అట్టి ఆశ అనే పాశం నుండి విముక్తి పొందినవాడే సంసారబంధం నుండి ముక్తుడవతాడు. షట్ శాస్త్రాలలో పండితుడే అయినా విషయాలపై ఆశ అనే మహాపాశం నుండి ముక్తిని పొందనివాడు సంసారబంధంనుండి బైటపడలేడు.

ఏదో నిమిత్తంగా వైరాగ్యం పొంది భవసాగరాన్ని తరించాలని పూనుకొన్న ముముక్షువులని విషయాలపై ఆశ అనే మొసలి పీకపట్టుకొని ప్రయత్నంనుండి మరల్చి సంసాగరసాగరం మధ్యలోకి ముంచుతుంది. కాబట్టి శుద్ధమైన వైరాగ్యమనే కత్తితో విషయమనే మొసలిని చంపినవాడు నిర్విఘ్నంగా సంసారమహాసాగరంయొక్క ఒడ్డుని చేరుతాడు.

విషయాఖ్యో గ్రహో యేన సువిరక్త్యసినా హతః
స గచ్ఛతి భవాంభోధేః పారం ప్రత్యూహ వర్జితః॥ 82

విషయం యొక్క మార్గం ఎంతో విషమమైనది. అందులో వెళ్లే కలుషితమైన బుద్ధిగలవాడు అడుగడుగునా దెబ్బతింటాడు. మృత్యువుని కూడా పొందుతాడు. హితులు ఉత్తములు అలాగే గురువు చెప్పిన మాటలనీ తన శాస్త్రానుసారమైన యుక్తినీ అనుసరించి వెళ్లేవానికి ఫలం సిద్ధిస్తుంది. ఇది సత్యం. తెలుసుకో.

కాబట్టి శిష్యా! నీకు మోక్షకాంక్ష ఉంటే విషాన్ని దూరంగా విడిచినట్లు విషయాలని దూరంగా విడిచిపెట్టు. సంతోషం దయ క్షమ ఆర్జవం ప్రశాంతి దాంతి అనేవానిని అమృతాన్ని ఆదరించేటట్లు ఆదరించు. నిత్యం సేవించు.

అనాదియైన అజ్ఞానంచే ఏర్పడిన బంధం నుండి విముక్తి అవశ్యం కర్తవ్యం. దాన్ని అనుక్షణం విడిచిపెట్టి ఈ దేహమే గొప్ప సంపద అని తలుస్తూ దీన్ని పోషించడంలో బాగా ఆసక్తుడై ఉండేవాడు తన్ను తాను చంపుకొనేవాడు. శరీర పోషణ కోరుకొంటూ ఆత్మదర్శనానికి ప్రయత్నించేవాడు మొసలిని కర్ర అని పట్టుకొని నదిని దాటడానికి వెళ్లేవాడు అవతాడు. ముముక్షువుకి శరీరం మొదలైన వానియందలి మోహమే మృత్యువు. మోహాన్ని ఎవడు పూర్తిగా జయిస్తాడో అతడు మోక్షానికి అర్హుడు. కాబట్టి పండితుడా! దేహం భార్య పిల్లలు మొదలైన వానియందు మహామృత్యువు వంటి మోహాన్ని విడిచిపెట్టు. మునులు మోహాన్ని





జయించి విష్ణుపదాన్ని అనగా సర్వవ్యాపకమైన స్వరూపాన్ని పొందుతారు.

మోహ ఏవ మహామృత్యుః ముముక్షోర్వపురాదిషు
మోహో వినిర్జితో యేన స ముక్తిపదమర్హతి
మోహం జహి మహామృత్యుం దేహదార సుతాదిషు
యం జిత్వా మునయో యాంతి తద్విష్ణోః పరమం పదమ్॥ 87,88

## స్థూల శరీర తత్త్వం

త్వక్కు మాంసం స్నాయువులు మేదస్సు మజ్జ ఎముకలు అనేవానితో గూడినది, మూత్ర పురీషాలతో నిండినది స్థూలశరీరం. ఇది నింద్యమైనది. ఇది పంచీకరణం పొందిన పంచభూతాలతో పూర్వజన్మలో అచరించిన కర్మకు అనుగుణంగా కల్గుతుంది. జీవాత్మ సుఖదుఃఖాలు అనుభవించడానికి ఇదే ఆధారం. స్థూలశరీరం సుఖదుఃఖాలని అనుభవించే దశ జాగ్రదవస్థ. జీవుడు పూలమాల గంధం స్త్రీ మొదలైన రూపాలలో ఉండే స్థూల పదార్థాలని చక్షువు త్వక్కు మొదలైన బాహ్యేంద్రియాలతో స్వయంగా తాదాత్మ్య భావంతో అనుభవిస్తాడు. కాబట్టి ఈ స్థూల శరీరానికి జాగ్రదవస్థ అనే పేరు ఏర్పడింది. గృహస్థాశ్రమంలో ఉన్నవానికి సర్వసంసార నిర్వహణకి గృహం ఎటువంటిదో జీవుని సర్వసంసారానుభవానికి ఆశ్రయమైనది ఈ స్థూల శరీరం.

## స్థూల శరీర ధర్మాలు

పుట్టుక ముసలితనం మరణం అనేవి స్థూల శరీర ధర్మాలు. లావు సన్నం పొడవు పొట్టి మొదలైనవి, శైశవం కౌమారం మొదలైన దశలు స్థూల శరీరానికే చెందుతాయి. బ్రాహ్మణ క్షత్రియాది వర్ణాలకీ బ్రహ్మచర్య గార్హస్థ్యాది ఆశ్రమాలకీ సంబంధించిన బహువిధ నియమాలు అలాగే పూజ అవమానం మొదలైన విశేషాలు కూడా స్థూల శరీరానికి సంబంధించినవే.

## ఇంద్రియాలు

శబ్దం స్పర్శ మొదలైన విషయాలని గ్రహిస్తాయి కాబట్టి చెవి చర్మం కన్ను ముక్కు నాలుక అనే అయిదింటికీ జ్ఞానేంద్రియాలు అని వ్యవహారం. వివిధ

కర్మలందు ప్రవర్తిస్తాయి. కాబట్టి వాక్కు పాణి పాదం పాయువు ఉపస్థ అనే అయిదూ కర్మేంద్రియాలు అని చెప్పబడతాయి.

## అంతఃకరణం

తమతమ పనులను బట్టి మనస్సు బుద్ధి అహంకారం చిత్తం అని పేర్కొబడుతున్న నాల్గింటికీ అంతఃకరణం అని పేరు కల్గింది. విషయాలని అనుభవించడంలో సంకల్పాలకీ వికల్పాలకీ ఆధారమైనది మనస్సు. పదార్థం యొక్క రూపాన్ని పొంది (తదాకారాకారితమయి) పదార్థ నిశ్చయాన్ని కల్గించేది బుద్ధి. నేను నాది అనే అనుభవానికి ఆధారమైనది అహంకారం. విషయాన్ని జ్ఞాపకం చేసే ధర్మం గలది చిత్తం.

## ప్రాణం

అంతా బంగారమే అయినా వివిధ రూపాలు పొందడంవల్ల హారం నూపురం అని వివిధ నామాలతో వ్యవహరింపబడుతోంది. అంతా జలమే అయినా ఉండడాన్ని బట్టి కూజానీళ్లు, కుండనీళ్లు అని వేరు వేరుగా పేర్కొబడుతోంది. అలాగే ప్రాణం ఒక్కటే అయినప్పటికీ స్థానాన్ని బట్టి, పొందుతున్న పరిణామాలనుబట్టి ప్రాణం, అపానం, వ్యానం, ఉదానం, సమానం అని అయిదు పేర్లతో పిలువబడుతోంది.

## సూక్ష్మ శరీరం

(i) వాక్కుపాణి మొదలైన కర్మేంద్రియాలు (5), (ii) చెవిత్వక్కు మొదలైన జ్ఞానేంద్రియాలు (5), (iii) ప్రాణ అపానాది వాయువులు (5), (iv) ఆకాశం పృథివి మొదలైన భూతాలు (5), (v) అంతఃకరణం (4), (vi) అవిద్య, (vii) కామం, (viii) కర్మ అనే ఎన్మిదింటికీ పుర్యష్టకం అని పేరు. దీన్నే సూక్ష్మశరీరం అంటారు. దీనికే లింగశరీరం అనికూడా పేరు.

ఈ సూక్ష్మశరీరం పంచీకరణం పొందని పంచభూతాలతో ఏర్పడుతుంది. పూర్వజన్మ వాసనలని కల్గియుంటుంది. సుఖదుఃఖ రూపమైన కర్మఫలాన్ని అనుభవింపజేస్తుంది. తన అజ్ఞానంవల్ల ఏర్పడుతుంది. ఇది అనాది. జీవునికి ఇది ఉపాధి.





వాగాది పంచ శ్రవణాది పంచ
ప్రాణాది పంచాఽభ్రముఖాని పంచ
బుద్ధ్యాద్యవిద్యాఽపి చ కామకర్మణీ
పుర్యష్టకం సూక్ష్మశరీరమాహుః
ఇదం శరీరం శృణు సూక్ష్మసంజ్ఞితం
లింగం త్వపంచీకృత భూత సంభవమ్
సవాసనం కర్మఫలాఽను భావకం
స్వాఽజ్ఞానతోఽనాదిరుపాధిభిరాత్మనః॥ **98,99**

ఈ సూక్ష్మశరీరానికి స్వప్నావస్థ ఆధారం. స్వప్నంలో సూక్ష్మశరీరం ఒక్కటే ప్రకాశిస్తుంది. స్వప్నంలో బుద్ధి ఒక్కటే స్వయంగా జాగ్రదవస్థకు చెందిన వివిధ వాసనలచే నేను కర్తను భోక్తను మొదలైన భావాలను పొంది ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ స్వప్నదశలో బుద్ధిని మాత్రమే ఉపాధిగా చేసుకొని ప్రత్యగాత్మ స్వప్నంలోని కర్మలన్నింటికి సాక్షిగా ఉంటుంది. బుద్ధి ఆచరించే కర్మల పూతలచే అది పూయబడదు. కాబట్టి ప్రత్యగాత్మ అసంగంగా ఉంటుంది. కార్యనిర్వహణలో వడ్రంగికి ఉలి, బాడిద పనిముట్లు అయినట్లే చిదాత్మకి సర్వవ్యాపారములయందు ఈ లింగశరీరం సాధనంగా ఉంటుంది. అయినప్పటికీ ఆత్మ అసంగం.

గుణదోషాలవల్ల ఏర్పడ్డ అంధత్వం పటుత్వం అనేవి కంటికి సంబంధించిన ధర్మాలు. చెవుడు మూగ మొదలైనవి చెవి మొదలైనవాని ధర్మాలు. ఇవన్నీ ఇంద్రియాలకి సంబంధించినవేగాని జ్ఞాతయైన ఆత్మకు చెందవు. ఆత్మ అసంగం.

ఉచ్ఛ్వాసనిశ్వాసలు ఆవులింత, ఆకలి కదలిక మొదలైనవి, పైకి లేచుట మొదలైన క్రియలు ప్రాణాపానాదుల కర్మలని పండితులు చెప్తారు. ఆకలి దప్పిక అనేవి ప్రాణధర్మాలు.

శరీరంలోను కన్ను మొదలైన ఇంద్రియాలలోను అంతఃకరణం ఆభాసతేజస్సుచేత అంటే బుద్ధియందు ప్రతిఫలించిన తేజస్సుచేత నేను అనే అభిమానాన్ని కల్గియుంటుంది. దీన్నే పండితులు అహంకారం అని చెప్తారు. ఈ అహంకారమే నేను కర్తని, నేను భోక్తని, అనే అభిమానాన్ని పొందియుంటుంది.

ఈ అహంకారమే సత్త్వరజస్తమోగుణాలతో కూడి జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు మూడింటిని పొందుతుంది.

విషయాలు అనుకూలంగా ఉన్నప్పుడు నేను సుఖంగా ఉన్నాను అని, ప్రతికూలంగా ఉన్నప్పుడు నేను దుఃఖాన్ని అనుభవిస్తున్నాను అని జీవుడు అనుకొంటాడు. సుఖం దుఃఖం అనేవి అంతఃకరణ ధర్మాలు. ఎల్లప్పుడు ఆనందస్వరూపంగా ఉండే ఆత్మకు చెందవు. అంటే అవి ఆత్మధర్మాలు కావు.

విషయం స్వయంగా ప్రియమైనది కాదు. తనకు అనుకూలమైనప్పుడు మాత్రమే ప్రియమైనది అవుతుంది. కాని స్వభావంచే ఆత్మ అందరికీ ప్రియతమమైనది. కాబట్టి ఆత్మ ఎప్పుడు ఆనందస్వరూపమే. దానికి ఎప్పుడు దుఃఖం ఉండదు. సుషుప్తిదశ విషయశూన్యమైనది. కాబట్టి అప్పుడు ఆత్మయొక్క స్వరూపమైన ఆనందం అనుభవింపబడుతోంది. ఆత్మస్వరూపం ఆనందమని ప్రత్యక్షంగాను, ఐతిహ్యంగాను అంటే తరతరాలుగా చెప్పబడడంవల్లను అనుమాన ప్రమాణంచేతను తెలుసుకోదగ్గదని శ్రుతికూడా "ప్రత్యక్షమైతిహ్యమనుమానం చ జాగ్రతి" అని చెప్తోంది.

## మాయ

పరమేశ్వరుని శక్తికి అవ్యక్తమని పేరు. అది మూల ప్రకృతి. అది అనాది. అదే అవిద్య. అది సత్త్వరజస్తమోగుణాత్మికం. అది అన్నింటికీ అతీతమైనది. అదే మాయ అని కూడా పిలువబడుతోంది. పండితునిచే అది కార్యాన్ని బట్టి ఊహింపబడగ్గది. దానినుండియే ఈ విశ్వం సర్వం ఆవిర్భవిస్తోంది.

అవ్యక్త నామ్నీ పరమేశ శక్తి
    రనాద్య విద్యా త్రిగుణాత్మికా పరా
కార్యానుమేయా సుధియైన మాయా
    యయా జగత్సర్వమిదం ప్రసూయతే॥ 110

అది సత్తుకాదు. అసత్తూ కాదు. రెండూ కలిసినదీ కాదు. పరమేశ్వరుని కంటె భిన్నమైనది కాదు. అభిన్నమైనదీ కాదు. భిన్నాభిన్నం కూడా కాదు. అవయవాలతో ఏర్పడ్డదీ కాదు. అవయవాలు లేనిదీ కాదు. అవయవాలు ఉన్నదీ





లేనిదీ కూడా కాదు. మహాద్భుతమైనది. అనిర్వచనీయ రూపం గలది (చెప్పలేని ఆకారంగలది).

అది త్రాడే అని స్పష్టంగా తెలుసుకొన్నప్పుడు భ్రాంతి వల్ల కల్గిన సర్పభావం తొలగిపోతుంది. అలాగే శుద్ధం అద్వయం అయిన బ్రహ్మని తెలుసుకోగా అంటే బ్రహ్మజ్ఞానం కల్గగా ఆ మాయ నాశనమవుతుంది. మాయయొక్క కార్యములచే ప్రసిద్ధి పొందిన సత్త్వరజస్తమోగుణాలు మూడూ ఆ మాయకు సంబంధించినవే.

## విక్షేప శక్తి

విక్షేపశక్తి రజోగుణానికి చెందిన కర్మకు సంబంధించినది. ఈ విక్షేపశక్తి వల్లనే సమస్త సృష్టీ ప్రవర్తిస్తోంది. మనస్సు యొక్క వికారములైన రాగద్వేషాదులు, దుఃఖాదులు ఈ విక్షేపశక్తివల్లనే కల్గుతూ ఉంటాయి. భయంకరములైన కామం క్రోధం లోభం దంభం అభ్యసూయ అహంకారం ఈర్ష్య మాత్సర్యం మొదలైనవన్నీ రజోగుణానికి చెందిన ధర్మాలు. ఈ రజోగుణంచేతనే ప్రతివ్యక్తీ వివిధ కార్యాలు ఆచరించదానికి పూనుకొంటాడు. ఈ రజోగుణం సంసారబంధానికి హేతువుగా చెప్పదగ్గది.

విక్షేపశక్తీ రజసః క్రియాత్మికా
    యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ
రాగాదయోఽస్యాః ప్రభవంతి నిత్యం
    దుఃఖాదయో యే మనసో వికారాః
కామక్రోధో లోభదంభాభ్యసూయాఽ
    హంకారేర్ష్యా మత్సరాద్యాస్తు ఘోరాః
ధర్మా ఏతే రాజసాః పుంప్రవృత్తి
    రస్మాదేతత్త్రజో బంధహేతుః 113, 114

## ఆవరణ శక్తి

ఆవరణశక్తి తమోగుణానికి చెందుతుంది. దీనిచేతనే ఒక వస్తువు మరియొక వస్తువుగా భాసిస్తుంది. పురుషునికి సంసారం ప్రాప్తించదానికి ఇదే ఆధారం. జన్మ మరణ రూపమైన సంసారాన్ని ఆవరణ శక్తి కల్గింపగా విక్షేపశక్తి జీవుణ్ణి ఆ సంసారంలో ప్రసరింపజేస్తుంది.

ఏషా వృత్తిర్నామ తమో గుణస్య
శక్తిర్యయా వస్త్వవభాసతేఽన్యథా
సైషా నిదానం పురుషస్య సంసృతే
ర్విక్షేప శక్తేః ప్రసరస్య హేతుః 115

ప్రజ్ఞావంతుడే అయినా, పండితుడే అయినా, నేర్పుగలవాడే అయినా, అత్యంత సూక్ష్మ విషయాలని దర్శించేవాడే అయినా తమోగుణంచే ఆవరింపబడితే స్పష్టంగా ఎన్నో పర్యాయాలు తెలిసినప్పటికీ ఆత్మని తెలుసుకోలేదు. భ్రాంతిచే ఆరోపింపబడ్డ అసద్వస్తువుని అంటే దేహాదికాన్నీ జగత్తునీ సత్యమని విశ్వసిస్తాడు. దానికి సంబంధించిన అంటే అసద్వస్తువుకి సబంధించిన ధర్మాలనే అవలంబిస్తాడు. ఆహా! తమోగుణానికి చెందిన ఆవరణ శక్తి ఎంత ప్రబలమైనదోగదా! ఎంత దురంతమైనదో గదా!

అభావన, విపరీత భావన, సంభావనా విప్రతిపత్తి అనే మూడూ ఆవరణశక్తి లక్షణాలు. సత్యమైన ఆత్మవస్తువు లేదని అనుకోవడం అభావన. నిత్యమైన దేహాదికమే తాను అని భావించడం విపరీత భావన. శ్రుతి వాక్యాలనీ గురూపదేశాన్నీ సంశయంగా గ్రహించడం సంభావనా విప్రతిపత్తి. ఈ ఆవరణ శక్తితో కూడుకొన్నవానిని నిశ్చయంగా విక్షేపశక్తి విడిచిపెట్టదు. సంసారంలోనికి విసరివేస్తుంది.

అజ్ఞానం ఆలస్యం జడత్వం నిద్ర ప్రమాదం మూఢత్వం మొదలైనవి తమస్సు యొక్క ధర్మాలు. ఈ గుణాలతో బాగా కూడుకొన్న వాడు కొంచెం కూడా సత్యాన్ని అంటే ఆత్మని తెలుసుకోలేడు. నిద్రయే స్వభావంగాగలవానివలె, స్తంభంవలె ఉంటాడు.

## మిశ్రసత్త్వ గుణం

నిర్మలమైన నీటివలె సత్త్వగుణం శుద్ధమైనది. సత్త్వగుణం ప్రధానమైనదై ఉంటూ దానితో రజస్తమోగుణాలు కొంచెంకొంచెంగా కలిసినప్పుడు లింగశరీరం ఏర్పడుతుంది. ఆ శుద్ధసత్త్వమందు ఆత్మ ప్రతిబింబిస్తుంది. సూర్యుడు సమస్త వస్తువులనీ ప్రకాశింపజేసేటట్లు ఆ శుద్ధ సత్త్వమందు ప్రతిబింబించిన ఆత్మబింబం జడమైన దేహాదికాన్ని ప్రకాశింపజేస్తుంది.





తన్నుతాను పొగడుకోకుండా ఉండడం, దంభంలేకుండా ఉండడం మొదలైనవి, యమం అహింస సత్యం మొదలైన నియమాలు శ్రద్ధ భక్తి ముముక్షుత్వం అనేవి, అభయం సత్త్వసంశుద్ధి మొదలైన దైవగుణాలు, అసత్తు అయిన దేహాదికం తాను కాదని నిశ్చయించుకోడం అనేవి మిశ్రమసత్త్వం యొక్క ధర్మాలు. ప్రసాదం ఆత్మానుభూతి పరమప్రశాంతి తృప్తి హర్షం పరమాత్మయందు నిష్ఠ అనేవి శుద్ధ సత్త్వం యొక్క గుణాలు. ఈ గుణాలు గలవాడు ఎల్లప్పుడు బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు.

## కారణ శరీరం

సత్త్వరజస్తమోగుణాలు మూడూ సమపాళ్లలో ఉంటే దాన్ని అవ్యక్తం అంటారు. అది ఆత్మకు కారణశరీరమని చెప్పబడుతోంది. ఇది సుషుప్తి దశలో ప్రస్ఫుటమవుతుంది. ఆ అవస్థలో ఇంద్రియాల ప్రవృత్తీ, బుద్ధియొక్క ప్రవృత్తీ ఆత్మలో లీనమైపోతాయి.

అవ్యక్తమేతత్ త్రిగుణైర్నిరుక్తం
తత్కారణం నామ శరీరమాత్మనః
సుషుప్తిరేతస్య విభక్త్యవస్థా
ప్రలీన సర్వేంద్రియ బుద్ధి వృత్తిః॥ 122

ఈ సుషుప్తి అవస్థలో సర్వవిధములైన వస్తుజ్ఞానం పూర్తిగా లయమవుతుంది. బీజమాత్రంగా బుద్ధిమాత్రమే నిలుస్తుంది. సుషుప్తి అవస్థను పొందినవాడు ఆదశలో నాకు ఏమీ తెలియలేదు అనే అనుభవాన్ని పొందడం జగత్ప్రసిద్ధం.

## అనాత్మ స్వభావం

స్థూలశరీరం దశవిధములైన ఇంద్రియాలు పంచవిధములైన ప్రాణం మనస్సు అహంకారాదులు సుఖదుఃఖాలు ఆకాశం మొదలైన పంచభూతాలు సమస్తమైన విశ్వం ఇలా అవ్యక్తంవరకు గల సమస్తమూ అనాత్మగా పరిగణింపబడుతుంది. మాయ మాయాకార్యసర్వస్వం అంటే మహత్తు నుండి దేహం వరకు గల సమస్తమైన విశ్వం అసత్తుగా పరిగణింపబడుతుంది. అది అనాత్మ. అది ఎండమావి వంటిది.

## పరమాత్మ స్వరూపం

ఇక పరమాత్మ స్వరూపాన్ని చెప్తున్నాను. విను. దీన్ని తెలుసుకొన్నవాడు సంసారబంధం నుండి ముక్తుడవతావడు. కేవల పరబ్రహ్మాను అనుభవిస్తాడు.

నిత్యం స్వయంగా నేను అనే జ్ఞానానికి ఆధారమైనది ఒకటి ఉన్నది. అదే పరమాత్మ. అది జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు మూడింటికి సాక్షిగా ఉంటుంది. అన్నమయ ప్రాణమయాది పంచకోశాలకీ విలక్షణమైనది. జాగ్రదాది అవస్థలు మూడింటిలో బుద్ధీ దాని వృత్తులూ సత్తు అసత్తు నేను అనే వీనిని అన్నింటిని తెలుసుకొనేది అదే!.

స్వయంగా అది సర్వాన్నీ చూస్తుంది. ఏదీ (ఏ ఇంద్రియమూ) దీన్ని చూడలేదు. బుద్ధి మొదలైన వానిని అన్నింటిని అది చైతన్యవంతం చేస్తుంది. దాన్ని ఏదీ చైతన్యవంతం చేయలేదు. విశ్వమంతట అది వ్యాపించియున్నది. ఏదీ దాన్ని వ్యాపించలేదు. ప్రకాశమానంకాని ఈ సర్వమూ ఆత్మచేతనే ప్రకాశిస్తోంది. ఆపరమాత్మ ఎదురుగా ఉండడంచేతనే దేహం ఇంద్రియాలు మనస్సు బుద్ధి అనేవి తమ తమ విషయములందు ఎవరిచేతనో ప్రేరేపింపబడినట్లు ప్రవర్తిస్తున్నాయి.

**యస్య సన్నిధి మాత్రేణ దేహేంద్రియమనోధియః**
**విషయేషు స్వకీయేషు వర్తంతే ప్రేరితా ఇవ॥ 131**

నిత్యం జ్ఞానస్వరూపమైన ఆ పరమాత్మ చేతనే అహంకారం నుండి దేహం వరకు గల విషయాలు, సుఖదుఃఖాలు ఇదికుండ అని తెలియబడేటట్లు గుర్తింపబడుతున్నాయి.

ఆ పరమాత్మ సమస్త ప్రాణులలోను ఉంటుంది. హృదయగుహ దాని స్థానం. అంతర్యామియైన ఆ పరమాత్మ ప్రాచీనమైనది. అది ఏకధారగా అఖండంగా ఉండే ఆనందానుభవం. అది ఎప్పుడూ అద్వితీయమైనది. జ్ఞానంచే మాత్రమే తెలియబడేది. ఆ పరమాత్మ ప్రేరణ చేతనే వాక్కు ప్రాణాలు చరిస్తున్నాయి. శుద్ధ సత్త్వమయమైన బుద్ధిగుహ అనబడే అవ్యాకృతాకాశమందు (మాయయందు) గొప్ప ప్రకాశంతో పరమాత్మ తన తేజస్సుతో సమస్త విశ్వాన్నీ ప్రకాశింపజేస్తూ ఆకాశంలో ఉచ్ఛంగా ఉండే





సూర్యునివలె వెలుగుతూ ఉంటుంది. మనస్సు అహంకారం దేహం ఇంద్రియాలు ప్రాణం అనేవి చేసే సర్వకార్యాలనీ ఆ పరమాత్మ తెలుసుకొంటాడు. ఇనుమును పొందిన అగ్నివలె వానిని అనుసరిస్తూ ఉంటాడు. ఏమీ చలించడు. పరిణామాన్ని పొందడు.

ఆత్మ పుట్టదు. మరణించదు. వృద్ధి పొందదు. తగ్గదు. పరిణామం పొందదు. నిత్యమైనది. ఈ శరీరంలో లీనమై ఉంటుంది. ఐనప్పటికీ కుండలో ఉండే ఆకాశంవలె అంటకుండా స్వయంగా ఉంటుంది. అంటే పరమాత్మ షడ్భావ వికారాలు లేనిది.

ప్రకృతికంటె (అజ్ఞానంకంటె) పరమాత్మ భిన్నమైనది. వికృతి కంటె (ప్రపంచంకంటె) వేరయినది. శుద్ధమైన జ్ఞానమే స్వభావంగా గలది. మూర్త అమూర్త రూపంలో ఉండే ఈ సమస్తాన్నీ ప్రకాశింపజేస్తుంది. నిర్విశేషమైనది. జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు మూడింటిలోను నేను నేను అని సాక్షాత్తూ బుద్ధికి సాక్షిరూపంలో ఉంటుంది. ఓ శిష్యా! నువ్వు మనస్సుని విషయాలపై ప్రసరించకుండా ఉండేటట్లు నిగ్రహించుకొని ప్రసన్నమైన బుద్ధితో నీ స్వరూపం ఆ పరమాత్మయే అని తెలుసుకో. అది నేను అనే రూపంలో సాక్షాత్తుగా ఉంటుందని గుర్తించు. జనన మరణాలు అనే తరంగాలతో గూడిన అపార సంసార సాగరాన్ని తరించు. బ్రహ్మత్వం పొంది కృతార్థుడివి అగుము.

## సంసార బంధహేతువు

పురుషునికి సంసారబంధం అంటే అనాత్మయైన దేహమందు ఆత్మభావం పొందడం. అది అజ్ఞానంవల్ల ప్రాప్తిస్తోంది. జననమరణాలవల్ల కలిగే క్లేశానికి అది హేతువు. దీనిచేతనే అసత్యమయిన దేహం సత్యమైనదనీ అదే తాను అనీ భావిస్తూ పురుషుడు ఆ శరీరాన్ని రూపరసాది విషయాలతో సాలెపురుగు దారాలతో అల్లిన గూటినివలె పోషిస్తున్నాడు. సేవిస్తున్నాడు. రక్షిస్తున్నాడు.

మిత్రమా! మూఢుడు అజ్ఞానంచే కానిదానియందు అవునన్న భావాన్ని పొందుతున్నాడు. ఒక వస్తువునందు మరియొక వస్తుభావాన్ని పొందుతున్నాడని భావం. జ్ఞానం లేకపోవడం చేతనే త్రాడునందు సర్పబుద్ధి కల్గుతుంది. ఆ పిమ్మట

తత్ఫలంగా ఎన్నో అనర్థాలు వచ్చిపడతాయి. కాబట్టి అజ్ఞానమే బంధంగా ఏర్పడుతోంది. వింటున్నావుగదా. ఆత్మకాని దేహమందు ఆత్మభావాన్ని పొందడానికి కారణం అజ్ఞానం. అదే బంధంగా చెప్పదగ్గదని తాత్పర్యం.

పరిపూర్ణం నిత్యం అద్వయం జ్ఞానశక్తిచే స్ఫురించేది అనంతమైన వైభవం గలది అయిన ఆత్మను తమోగుణమయమైన ఆవరణశక్తి సూర్యబింబాన్ని రాహువువలె ఆవరించియుంటుంది. మిక్కిలి స్వచ్ఛమైన తేజస్సుగలది తన రూపమైనది అయిన ఆత్మ తమోగుణానికి చెందిన ఆవరణ శక్తిచే కప్పబడగా అజ్ఞానంవల్ల పురుషుడు శరీరమే తాను అని భావిస్తాడు. అప్పుడు అట్టి పురుషుణ్ణి రజోగుణానికి చెందిన గొప్పదైన విక్షేపశక్తి కామక్రోధాది గుణాలచే బంధించి బాధిస్తుంది.

మహామోహం అనే మొసలి మ్రింగగా పురుషుని ఆత్మజ్ఞానం తొలగిపోతుంది. తమోగుణమయమైన బుద్ధిచే అతడు పెక్కు దురవస్థలు అనుభవిస్తాడు. రూపరసగంధాది విషయాలు అనే విషంతో నింపబడ్డ అపార సంసారసాగరంలో ఆ కుమతి కుత్సితములైన మార్గాలలో మునుగుతూ తేలుతూ తిరుగుతూ ఉంటాడు.

సూర్యుని కిరణాల నుండి ఏర్పడ్డ మేఘపంక్తి ఆ సూర్యుణ్ణి కప్పి విజృంభిస్తుంది. అలాగే ఆత్మనుండి కల్గిన అహంకారం (అజ్ఞానం) ఆత్మతత్వాన్ని కప్పి స్వయంగా విజృంభిస్తుంది. దట్టమైన మేఘాలచే సూర్యుడు ఆచ్ఛాదింపబడగా ఆ దుర్దినమందు చల్లని ఝంఝూ వాయువు ఉగ్రమై ఆ మేఘాలని బాధిస్తుంది. ఆవిధంగానే దట్టమైన తమోగుణంచే ఆత్మ ఆవరింపబడగా (ఆవరణశక్తి ఆవరింపగా) విక్షేపశక్తి ఆ అజ్ఞానిని బహువిధములైన దుఃఖాలచే బాధిస్తుంది. ఈ విధంగా ఆవరణ విక్షేపశక్తులచే మాత్రమే పురుషునికి సంసారబంధం సంభవిస్తోంది. ఆ రెండింటిచే విశేషమైన మోహంగలవాడై అతడు ఈ దేహమే నేను అని విశ్వసిస్తున్నాడు.

## సంసార వృక్షం

సంసారమనే వృక్షానికి బీజం అజ్ఞానం. దేహమే ఆత్మ అనే బుద్ధి మొలక. శబ్దరసాది విషయాలపై పొందే అనురాగం చివురు. కర్మ ఆ వృక్షానికి పోసే నీళ్లు. శరీరం బోదె. పంచప్రాణాలు శాఖలు. ఇంద్రియాల సముదాయం అగ్రభాగాలు. శబ్దాది విషయాలు పుష్పాలు. నానావిధాలైన కర్మలు ఆచరించడంచే కలిగే





బహువిధాలైన దుఃఖం ఆ వృక్షం యొక్క ఫలం. ఫలభోక్తయైన జీవుడు పక్షి.

**బీజం సంసృతి భూమిజస్య తు తమో దేహాత్మధీరంకురో**
**రాగః పల్లవమంబు కర్మ తు వపుః స్కంధోఽసవః శాఖికాః**
**అగ్రాణీంద్రియసంహతిశ్చ విషయాః పుష్పాణి దుఃఖం ఫలం**
**నానాకర్మ సముద్భవం బహువిధం భోక్తాత్ర జీవః ఖగః॥** 147

మనస్సు అనే ఓపక్షీ! పరమాత్మ అనే ఎత్తైన వృక్షానికి మూలం ఆనందం. సత్త్వరజస్తమోగుణాలు అనేవి ఈ వృక్షానికి చివుళ్లు. ఆత్మతత్త్వం శాఖలు. వేదాంతములు అంటే ఉపనిషత్తులు పుష్పాలు, ఫలాలు. మోక్షరసాదులతో ఆవృక్షం నిండుగా ఉంటుంది. అటువంటి వృక్షాన్ని విడిచిపెట్టి సంసారమనే శుష్కవృక్షంపై ఎందుకు అనురాగంతో ఉన్నావు?

## అనాత్మ బంధం

అనాత్మయైన శరీరంతో అజ్ఞానంవల్ల బంధం ఏర్పడుతోంది. ఆ బంధం సహజం. అనాది. అనంతం. అదే జన్మ వ్యాధి జర మొదలైన దుఃఖ ప్రవాహంచే తాపాన్ని కల్గిస్తుంది.

అజ్ఞానవశాత్తు కల్గిన ఈ అనాత్మ బంధం అస్త్రాలచేగాని శస్త్రాలచేగాని వాయువుచేగాని అగ్నిచేగాని ఛేదింపబడదు. కోటికర్మలు ఆచరించడంవల్ల కూడా అది తొలగదు. అది ఈశ్వరానుగ్రహంచే మనోహరంగా వాడిగా ఉండే ఆత్మానాత్మ వస్తువివేకరూపమైన విజ్ఞానమనే మహాఖడ్గంచే మాత్రమే నరకబడుతుంది. వేదవాక్యాలందు ప్రమాణ బుద్ధిగలవానికి తన ధర్మాన్ని అనుష్ఠించడంలో (తనకు విహితములైన కర్మలని ఆచరించడంలో) నిష్ఠ లభిస్తుంది. ఆ నిష్ఠచే మనస్సు విశేషంగా శుద్ధమవుతుంది. విశుద్ధమైన బుద్ధిగలవానికే పరమాత్మ జ్ఞానం లభిస్తుంది. ఆ జ్ఞానంవల్లనే సంసారం సమూలంగా నాశనమవుతుంది.

దిగుడుబావిలోని నీరు తననుండి పుట్టిన నాచుచే కప్పబడితే ప్రకాశింపదు. అలాగే ఆత్మకూడా తన శక్తి వల్ల ఉద్భవించిన అన్నమయాది కోశాలు అయిదింటిచే కప్పబడి ప్రకాశింపదు. ఆ నాచుని తొలగిస్తే నీరు శుద్ధమై కనబడుతుంది.

పురుషునికి దాహాన్ని తీరుస్తుంది. వెంటనే సుఖాన్ని ఇస్తుంది. అలాగే అన్నమయాది పంచకోశాలనీ తొలగిస్తే ఆత్మ నిత్యం ఆనందైకరసం పరం స్వయంజ్యోతి స్వరూపం అయిన ప్రత్యగాత్మగా ప్రకాశిస్తుంది. కాబట్టి పండితుడు బంధవిముక్తికోసం తప్పక ఆత్మ అనాత్మ వివేకం చేయాలి. దానిచేతనే తాను స్వయంగా సచ్చిదానంద స్వరూపుడని తెలుసుకొంటాడు. ఆనందిస్తాడు.

ముంజగడ్డి (దర్భ విశేషం) నుండి ఇషీకాన్ని (సన్నంగా ఉండే చివరి ఆకుని) వేరుచేసినట్లు కనబడే సర్వపదార్థాలనుండి అసంగం అక్రియం అయిన ప్రత్యగాత్మని వేరుచేసి దృశ్యమైన సర్వాన్నీ ఆ ప్రత్యగాత్మయందు లయంచేసి ఎవడు ఆ ప్రత్యగాత్మ స్వరూపుడై ఉంటాడో వాడు సంసారబంధం నుండి విముక్తుడు.

## అన్నమయకోశం

ఈ స్థూల శరీరం అన్నంనుండి ఉద్భవించింది. కాబట్టి అన్నమయ కోశంగా పేర్కొదగ్గది. అది అన్నం వల్ల జీవిస్తోంది. అన్నం లేకపోతే నశిస్తుంది. త్వక్కు చర్మం మాంసం రక్తం ఎముకలు పురీషం అనేవాని రాశిగా ఉండే ఈ స్థూల శరీరం నిత్యశుద్ధమైన ఆత్మ కాలేదు.

దేహోఽయమన్న భవనోఽన్నమయస్తు కోశ
శ్చాన్నేన జీవతి వినశ్యతి తద్విహీనః
త్వక్చర్మ మాంసరుధిరాస్థి పురీష రాశి
ర్నాయం స్వయం భవతుమర్హతి నిత్యశుద్ధః॥ 157

ఈ దేహం పుట్టేముందు లేదు. మరణించిన పిమ్మటకూడా ఉండదు. పుట్టి క్షణం ఉంటుంది. క్షణంలో మార్పుపొందుతుంది. అనియతమైన స్వభావం గలది. ఒక్కటి కానిది. అంటే అవయవాల సముదాయంచే ఏర్పడేది. జడం. ఘటంవలె చూడదగ్గది. అట్టిది శరీరంయొక్క సమస్త వికారాలు తెలుసుకొనే ఆత్మ ఎలా అవుతుంది?

దేహం పాణిపాదాలు మొదలైన అవయవాలు గలది. వానిలో కొన్ని లేకపోయినా జీవిస్తుంది. కనుక అది ఆత్మ కానేరదు. ఆత్మ అవయవాలు లేనిది





గదా. ఆత్మయొక్క శక్తికి నాశం ఉండదు. ఆ కారణంచే కూడా దేహం ఆత్మకాదు. ఆత్మ నియామకుడు. అన్నింటిని నియమించేది అని అర్థం. దేహం ఆత్మచే నియమింపబడేది. కాబట్టి దేహం ఆత్మ ఎలా అవుతుంది? దేహానికీ దేహధర్మానికీ దేహం పొందే బాల్యయౌవనాది అవస్థలు మొదలైన అన్నింటికీ ఆత్మ సాక్షియైనది. స్వతంత్రమైనది. స్వతః సిద్ధమైనది. దేహం ఆత్మకంటె విలక్షణమైనది.

శరీరం మాంసంతో పూయబడ్డ ఎముకల గుంపు. మలంతో నిండినది. అతికశ్మలమైనది. అటువంటి శరీరం అన్నింటికీ సాక్షియైన ఆత్మ ఎలా అవుతుంది? ఆత్మ స్వయంగా విలక్షణమైనది. త్వక్కు మాంసం మేదస్సు అస్థి పురీషం అనేవాని రాశిగా ఉండే స్థూల శరీరమే నేను అని అజ్ఞాని తలుస్తాడు. ఆత్మ అనాత్మల విచారం చేసే పండితుడు దేహాన్ని విలక్షణమైనదని తెలుసుకొంటాడు. తాను ప్రత్యగాత్మ స్వరూపమని భావిస్తాడు. అజ్ఞాని దేహమే నేను అని తలుస్తాడు. కేవల శాస్త్రపండితుడు దేహమందు జీవునియందు (బుద్ధియందు ప్రతిఫలించిన చిత్ ప్రతిబింబమందు) నేను అనే బుద్ధిని పొందుతాడు. ఆత్మ అనాత్మల వివేకం వల్ల విజ్ఞానంగల మహాత్ముడు ఎల్లప్పుడు నేను పరబ్రహ్మను (అహం బ్రహ్మాస్మి) అని భావిస్తాడు.

అజ్ఞానీ! త్వక్కు మాంసం మొదలైన వానితో ఏర్పడ్డ స్థూల శరీరమందు నేను అనే బుద్ధిని విడిచిపెట్టు. సర్వమయం నిర్వికల్పం అయిన బ్రహ్మమునందు నేను అనే బుద్ధిని పొందు. పరమశాంతిని అనుభవించు. అసత్తయిన దేహేంద్రియాదులందు భ్రాంతివల్ల కల్గిన నేను అనే భావాన్ని విడిచిపెట్టనంతకాలం విద్వాంసునికి సంసారబంధవిముక్తి వార్తగా కూడా లభించదు. అతడు వేదాంత తత్త్వాన్ని దర్శించినవాడే అయినప్పటికీ విముక్తి కల్గదు.

నీడ రూపంలో నున్న శరీరమందు, అద్దం మొదలైన వానిలో ప్రతిబింబంగా ఉన్న శరీరమందు, స్వప్నంలో తోచే శరీరమందు, జాగ్రదవస్థలో మనస్సుచే కల్పింపబడ్డ శరీరమందును ఆత్మబుద్ధిని పొందవుగదా. ఆ శరీరమే నేను అని అనుకోవుగదా. అలాగే జీవించియున్న (స్థూల) శరీరమందు కూడా ఆత్మబుద్ధిని పొందకు. అజ్ఞానులు సంసారంవల్ల పొందే దుఃఖానికి (జన్మాది దుఃఖానికి) బీజం దేహమందు ఆత్మబుద్ధి కల్గడం. స్థూల శరీరమే నేను అని భావించడం వల్లనే అజ్ఞానులకు సంసారదుఃఖం ప్రాప్తిస్తోంది. కాబట్టి ఏదోవిధంగా శరీరమందు

ఆత్మబుద్ధిని విడిచిపెట్టు. ఆ బుద్ధి తొలగిపోతే తిరిగి జన్మించడమందు ఆశ కల్గదు.

## ప్రాణమయకోశం

వాక్కు పాణి పాదం మొదలైన పంచకర్మేంద్రియాలతో కూడుకొని ప్రాణం (ప్రాణవాయువు) ప్రాణమయకోశంగా ఏర్పడుతుంది. ఈ ప్రాణమయకోశం చేతనే అన్నమయకోశం నేను అనే స్ఫురణ పొందుతోంది. అన్నంతో పూర్ణమై సమస్త కర్మలందు ప్రవర్తిస్తోంది.

కర్మేంద్రియైః పంచభిరంచితోఽయం
ప్రాణో భవేత్ప్రాణమయస్తు కోశః
యేనాత్మవానన్నమయోఽన్న పూర్ణాత్
ప్రవర్తతేఽసౌ సకల క్రియాసు॥ 167

ఈ ప్రాణమయకోశం కూడా ఆత్మ కాదు. అది కేవలం వాయువికారం. అది వాయువువలె లోపల బైట వచ్చి వెళ్తూ ఉంటుంది. ఏనాడు కొంచెం కూడా ఇష్టం అనిష్టం అనేవి దీనికి లేవు. తన్నుగాని ఇతరమైనదాన్ని గాని ఇది తెలుసుకోలేదు. కేవలం పరతంత్రమైనది. స్వతంత్రత లేనిది. ప్రత్యగాత్మచే మాత్రమే ప్రకాశించేది అని భావం.

## మనోమయకోశం

త్వక్కు జిహ్వా మొదలైన ఐదు జ్ఞానేంద్రియాలు మనస్సు అనే వానికి మనోమయకోశం అని వ్యవహారం. ఇదే వస్తువులందు నాది నేను అనే ఆలోచనలు కల్గిస్తుంది. విశ్వంలోని వివిధ సంజ్ఞలు మొదలైన భేదాలు కల్పిస్తుంది. చాల బలీయమైనది. దీనికి ముందున్న ప్రాణమయకోశమందు పూర్తిగా వ్యాపించి విజృంభిస్తుంది.

జ్ఞానేంద్రియాణి చ మనశ్చ మనోమయః స్యాత్
కోశో మమాహమితి వస్తు వికల్ప హేతుః
సంజ్ఞాది భేదకలనాకలితో బలీయాం
స్తత్పూర్వ కోశమభిపూర్య విజృంభతే యః॥ 169





ఈ మనోమయం అనే అగ్ని జ్ఞానేంద్రియాలు అనే ఐదుగురు ఋత్విక్కులచే రగుల్కొల్పబడి శబ్దరూపాది విషయాలు అనే నేతిధారతో వృద్ధిపొందుతూ పూర్వవాసనలు అనే సమిథలచే జాజ్వల్యమానమై ప్రపంచాన్ని దహిస్తుంది.

అవిద్య మనస్సుకంటె వేరుగా ఉండదు. మనస్సే అజ్ఞానం. అదే సంసారబంధానికి హేతువు. అది చక్కగా నష్టమైతే సంసారం సర్వమూ నశిస్తుంది. అది విజృంభిస్తే సమస్త సంసారమూ విజృంభిస్తుంది. వస్తువులు ఏవీ లేనటువంటి స్వప్నంలో మనస్సే తన శక్తిచేత అనుభవించేవాణ్ణీ విశ్వాన్నీ సర్వాన్నీ కూడా సృష్టిస్తుంది. జాగ్రదవస్థ కూడా స్వప్నావస్థ వంటిదే. ఆ అవస్థ సర్వం కూడా మనస్సు యొక్క విజృంభణమే. స్వప్నావస్థకీ జాగ్రదవస్థకీ ఏమీ భేదం లేదు. రెండూ సమానమే. మనస్సుయొక్క విజృంభణచేత ఏర్పడ్డవే. సుషుప్తి అవస్థలో మనస్సు లయమవుతుంది. వస్తుస్ఫురణ కొంచెం కూడా ఉండదు. అప్పుడు నాకు ఏమీ తెలియలేదు అని అనడం లోకప్రసిద్ధమేగదా. కాబట్టి పురుషునికి సంసారం కేవలం మనస్సు యొక్క కల్పనవల్ల ఏర్పడ్డదే. యథార్థంగా లేనేలేదు.

వాయువు మేఘాన్ని తీసుకొని వస్తుంది. దానిచేతనే ఆ మేఘం ఎక్కడకో ఎగురగొట్టబడుతుంది. అలాగే మనస్సుచేతనే సంసారబంధం, సంసార మోక్షం కూడా కల్పింపబడతాయి. దేహాది సర్వవిషయములందు మనస్సు అనురాగాన్ని కల్పించి పురుషుణ్ణి త్రాడుతో పశువుని బంధించినట్లు ఆ అనురాగంతో బంధిస్తుంది. ఆ పిమ్మట విషంతో సమానమైన ఆ విషయములందు వైరస్యం కల్పించి ఆ బంధం నుండి మనస్సే అతణ్ణి విడిపిస్తుంది.

దేహాది సర్వ విషయే పరికల్ప్య రాగం
బధ్నాతి తేన పురుషం పశువద్గుణేన
వైరస్యమత్ర విషవత్సువిధాయ పశ్చా
దేనం విమోచయతి తన్మన ఏవ బంధాత్॥ 175

కాబట్టి ప్రాణుల సంసార బంధానికీ బంధమోక్షానికీ మనస్సే కారణం. రజస్తమోగుణాలచే మలినమైన మనస్సు బంధానికి హేతువు. రజస్తమోగుణాల సంపర్కంలేని శుద్ధమైన మనస్సు మోక్షానికి హేతువు.

వివేకం వైరాగ్యం అనే ఆ రెండింటి ఆధిక్యంచేత మనస్సు శుద్ధమై సంసారబంధముక్తిని కల్గిస్తుంది. కాబట్టి బుద్ధిమంతుడైన ముముక్షువు ముందుగా వివేక వైరాగ్యాలు గట్టిపరుచుకోవాలి.

మనస్సు అనే మహావ్యాఘ్రం రూపరసాది విషయాలు అనే అరణ్యభూములలో సంచరిస్తూ ఉంటుంది. సత్పురుషులు మోక్షేచ్ఛగల వారు ఆ అరణ్యభూములకి వెళ్లకూడదు. జాగ్రదవస్థలో స్థూలశరీరంతోను, స్వప్నావస్థలో సూక్ష్మశరీరంతోను అనుభవించడానికి మనస్సు ఎన్నో విషయాలని సృష్టిస్తోంది. శరీరానికి సంబంధించిన బ్రాహ్మణ క్షత్రియాది వర్ణాలు, బ్రహ్మచర్యం మొదలైన ఆశ్రమాలు, వివిధ పశుపక్ష్యాది జాతులు, పొడవు పొట్టి నలుపు తెలుపు మొదలైన ధర్మాలు, వివిధ కర్మలు, వీని ఫలాలు అన్నీ కూడా నిత్యం మనస్సుచే కల్పింపబడ్డవే.

మనః ప్రసూతే విషయానశేషాన్
స్థూలాత్మనా సూక్ష్మతయా చ భోక్తుః
శరీర వర్ణాశ్రమ జాతిభేదాన్
గుణక్రియా హేతుఫలాని నిత్యమ్॥ **179**

అసంగం చిద్రూపం అయిన ఈ ఆత్మని మనస్సే మోహపెట్టి దేహం ఇంద్రియాలు ప్రాణాలు గుణాలు అనే వానితో బంధిస్తుంది. కర్మలని ఆచరించేటప్పుడు వాని ఫలాలని అనుభవించేటప్పుడు కూడా నాది అనే భ్రాంతిని కల్గించేది మనస్సే.

అనాత్మయైన దేహాదులందు ఆత్మబుద్ధి పొందడమే పురుషునికి సంసారం. ఆ అధ్యాసబంధం ఈ మనస్సుచేతనే కల్పింపబడుతోంది. రజస్తమోగుణాల దోషం గల అవివేకికి జన్మాదిదుఃఖం కల్గడానికి మనస్సే మూలకారణం. అందుకే తత్త్వాన్ని దర్శించిన పండితులు మనస్సే అవిద్య అని చెప్తారు. పెనుగాలి మేఘమండలాన్ని త్రిప్పేటట్లు మనస్సు విశ్వాన్ని త్రిప్పుతోంది. కాబట్టి మోక్షాన్ని కోరుకొనేవాడు మనస్సుని శుద్ధం చేసుకోవాలి. మనస్సు శుద్ధమైనదయితే మోక్షం అరచేతిలోని ఉసరికాయ వంటిది అవుతుంది. మోక్షమందు మాత్రమే ఆసక్తి ఉన్నప్పుడు శబ్ద రసాది విషయములందలి అనురాగాన్ని విడిచిపెట్టాలి. కామ్యకర్మలు త్యజించాలి.





మంచి శ్రద్ధతో వేదాంత వాక్యాలనీ గురూపదేశాన్నీ శ్రవణ మననాదులతో నిల్పుకోవాలనే నిష్ఠను కల్గియుండాలి. అప్పుడే అతడు బుద్ధియొక్క రజోగుణవృత్తిని దూరం చేసుకోగల్గుతాడు.

ఈ మనోమయకోశం కూడా ఆత్మ కాజాలదు. ఇది ఆద్యంతాలు గలది. పరిణామం పొందేది. దుఃఖాత్మకమైనది. విషయాలని అనుభవించడానికి హేతువు. పరమాత్మ ఎప్పుడు ద్రష్టయే. అతనిచే చూడబడే మనోమయకోశం దృశ్యమవుతుంది. కాబట్టి ద్రష్టయైన పరమాత్మ దృశ్యం ఎలా అవతాడు? ఎప్పుడూ కాలేదు.

## విజ్ఞానమయకోశం

జ్ఞానేంద్రియాలు వాని వృత్తులు నేను కర్తని అనే అహంకారం అనేవానితో కూడిన బుద్ధి విజ్ఞానమయకోశమవుతుంది. ఆ విజ్ఞానమయకోశమే పురుషుని సంసారప్రాప్తికి హేతువు.

బుద్ధిర్బుద్ధీంద్రియైఃసార్ధం సవృత్తిః కర్తృలక్షణః
విజ్ఞానమయకోశః స్యాత్ పుంసః సంసారకారణమ్॥ **186**

జాగ్రదవస్థ మొదలైన మూడు అవస్థలందు అనుసరించియుండు చైతన్యం యొక్క ప్రతిబింబం విజ్ఞానమయకోశం అని పరిగణింపబడుతుంది. ఇది సత్త్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతి యొక్క వికారం. దేహం ఇంద్రియాలు మొదలైన వానియందు వివిధ వస్తువుల స్వరూపాన్ని నేను తెలుసుకొంటున్నాను, వివిధ కర్మలు నేను ఆచరిస్తున్నాను అని కర్తృత్వ భావాన్ని ఎల్లప్పుడు ఇదే మిక్కిలి ఎక్కువగా అనుభవింపజేస్తుంది.

అనువ్రజచ్చిత్ప్రతిబింబ శక్తి
ర్విజ్ఞాన సంజ్ఞః ప్రకృతేర్వికారః
జ్ఞానక్రియావానంహమిత్యజస్రం
దేహేంద్రియాదిష్వభిమన్యతే భృశమ్॥ **187**

ఈ చిత్ప్రతిబింబం అనాది. అహంకార స్వరూపమైనది. జీవుడు అని

వ్యవహరింపబడుతోంది. ఇదే సమస్త వ్యవహారాలనీ భరిస్తుంది. పూర్వజన్మ వాసనలని అనుసరించి పుణ్యపాపకర్మలు ఆచరిస్తుంది. ఫలాన్ని అనుభవిస్తుంది. ఈ విజ్ఞానమయుడే విచిత్రములైన యోనులందు జన్మిస్తాడు. అంటే వివిధ జన్మలు పొందుతాడు. అధోలోకాలకీ ఊర్ధ్వలోకాలకీ వెళ్తూ వస్తూ ఉంటాడు. కర్మల ఫలాన్ని అనుభవిస్తాడు. జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు మూడూ అతనివే. సుఖదుఃఖానుభవం కూడా అతనిదే.

ఈ విజ్ఞానమయకోశం దేహాదులకు చెందిన ఆశ్రమధర్మములందు, కర్మలందు, గుణములందు నాది అనే అభిమానం కలది. పరమాత్మకి అతి సన్నిహితంగా ఉండడంవల్ల ఎక్కువ ప్రకాశం కల్గియుంటుంది. కాబట్టి అది జీవునికి ఉపాధి. దీనివల్లనే అసత్తయిన దేహాదికమందు నేనే ఆత్మని అనే బుద్ధి కలిగి భ్రాంతితో ప్రవర్తిస్తూ ఉంటుంది.

ఈ విజ్ఞానమయుడు ప్రాణమందు హృదయమందు జ్యోతిగా స్ఫురిస్తూ ఉంటాడు. ఆత్మ కూటస్థమే అయినప్పటికీ విజ్ఞానమయకోశం ఉపాధిగాగలది కాబట్టి కర్త భోక్త కూడా అవుతోంది. కర్తృత్వభోక్తృత్వాలు లేనిదే అయినప్పటికీ ఉపాధిలో ఉండడంవల్ల ఈ రెండు ధర్మాలు పొందుతోందని భావం.

పరమాత్మ మిథ్యాత్మయైన బుద్ధితో తాదాత్మ్యాన్ని పొందడం అనే దోషంవల్ల స్వయంగా వేరుగా జీవాత్మ అని పిలువబడుతోంది. పరమాత్మ సర్వాత్మకం. మట్టి యొక్క వికారమే అయినా కుండలు మట్టికంటె వేరుగా విడిగా కుండలు అని పిలువబడుతున్నాయి. అట్లే సర్వాత్మకమైన పరమాత్మ జీవాత్మగా పేర్కోబడుతోంది. పరమాత్మ ఉపాధియొక్క సంబంధంవల్ల ఉపాధియొక్క గుణాలు కలిగి ఉపాధి ధర్మాలతో ప్రకాశిస్తోంది. అగ్నికి వికారాలు లేవు. కాని అది ఇనుముతో కూడియున్నప్పుడు ఇనుముయొక్క వికారాలు పొందుతోంది. అలాగే పరమాత్మ ఏకరూపుడే అయినప్పటికీ ఉపాధిని పొంది దాని స్వభావం వల్ల వేరుగా జీవాత్మగా వ్యవహరింపబడుతోంది.

## శిష్యుని పరిప్రశ్న

శిష్యుడు ఇలా అడుగుతున్నాడు : పరమాత్మకు జీవాత్మభావం భ్రాంతిచేతనో





ఏదో మరొకదానిచేతనో కలుగవచ్చు. ఆ పరమాత్మకు ఉపాధియైన అవిద్య అనాది. అంటే ఆరంభంలేనిది. అనాదికి నాశంలేదుగదా. అప్పుడు ఆత్మకు కలిగిన జీవభావం దానితోపాటు సంసారం కూడా నిత్యమే అవుతుంది. అలా అయితే సంసారం తొలగింపబడేది కాదుగదా. గురుదేవా! నాకు మరి ఈ సంసారం నుండి మోక్షం ఎట్లు ప్రాప్తిస్తుంది? చెప్పండి.

## గురువాక్యం

గురువు ఇలా చెప్తున్నాడు : వత్సా! చక్కని ప్రశ్న వేసేవు. చెప్తున్నాను. సావధానంగా విను. అజ్ఞానంచే కల్పింబడింది ఎన్నడూ ప్రమాణబద్ధం కాదు. పరమాత్మ అసంగుడు. నిష్క్రియుడు. నిరాకారుడు. అట్టివానికి విషయాలతో సంబంధం ఎన్నడూ కుదరదు. సంబంధం ఉందని భావించడం భ్రాంతియే అవుతుంది. నల్లదనం మొదలైనవి ఆకాశంయొక్క ధర్మాలు అనడం భ్రాంతివల్లనేగదా.

పరమాత్మ స్వయంగా ద్రష్ట. నిర్గుణుడు. నిష్క్రియుడు. ప్రత్యగాత్మ. ఆనందస్వరూపుడు. అతనికి జీవభావం బుద్ధియొక్క భ్రాంతిచేతనే ప్రాప్తించింది. జీవాత్మ అనే వ్యవహారం బుద్ధియొక్క భ్రాంతిచేతనే ఏర్పడిందని భావం. జీవభావం పరమాత్మకు లేనేలేదు. భ్రాంతి (అజ్ఞానం) తొలగిపోతే పరమాత్మకంటె వేరుగా మరొకవస్తువు అనుభవింపబడదు. భ్రాంతి ఉన్నంతవరకే మిథ్యాజ్ఞానంచేత ప్రమాదవశాత్తు విజృంభిస్తున్న జీవభావం ఉంటుంది. భ్రాంతి నశిస్తే జీవభావం ఆత్మకు తొలగిపోతుంది. ఆత్మభావమే భాసిస్తుంది. భ్రాంతి సమయంలోనే కదా త్రాడుకి సర్పత్వం. భ్రాంతి వదలితే సర్పత్వం ఉండనే ఉండదు. అది త్రాడుగానే కనబడుతుంది. జ్ఞానం కల్గనంతవరకే అవిద్యకీ దాని కార్యాలకీ అనాదిత్వం. జ్ఞానం కల్గితే అనాదియైన అవిద్య సమూలంగా నశిస్తుంది. స్వప్నంలో పొందిన అనుభవం అంతా మెలకువ రానంతవరకే గదా. మెలకువ వస్తే స్వప్నంలో పొందినవీ వాని అనుభవం సర్వం నశిస్తాయిగదా.

అవిద్య అనాది అయినప్పటికీ నిత్యంగాదు. ఘటంయొక్క ప్రాగభావం కూడా అనాదియే. ఘటం ఉత్పన్నం కాగా అనాదియైన ఆ ప్రాగభావం పూర్తిగా ధ్వంసం అవుతోందిగదా. అలాగే అవిద్యకూడా జ్ఞానప్రాప్త్యనంతరం నశిస్తుంది.

బుద్ధితోగల ఉపాధి సంబంధంవల్ల ఆత్మయందు జీవత్వం బాగా కల్పింపబడింది. కాబట్టి ఆత్మకంటె వేరుగా జీవుడు లేనేలేడు. స్వరూపంచే జీవుడు విలక్షణుడు. మిథ్యాజ్ఞానంచేత తన స్వరూపమైన ఆత్మకు బుద్ధితో సంబంధం కల్పింపబడింది. సమ్యగ్ జ్ఞానంచేత మాత్రమే మిథ్యాజ్ఞానం తొలగిపోతుంది. కర్మలని అనుష్ఠించడంచేగాదు. జీవబ్రహ్మల ఐక్యరూపమైన (జీవో బ్రహ్మైవ) విజ్ఞానం సమ్యగ్ జ్ఞానం అని శ్రుతి సమ్మతం. ఆత్మ అనాత్మల వివేకంచేతనే ఆ సమ్యగ్ జ్ఞానం లభిస్తుంది. కాబట్టి ఏది ప్రత్యగాత్మయో ఏది అసద్రూపమైన ఆత్మయో అంటే జీవాత్మయో తప్పక తెలుసుకోవాలి.

బురదతో కూడిన జలం అస్పష్టంగా ఉంటుంది. ఆ బురద తొలగితే నీళ్లు స్ఫుటంగా భాసిస్తాయి. అలాగే ఆత్మ కూడా దోషాలు లేకపోతే స్ఫుటంగా ప్రకాశిస్తుంది. అసత్తు (అజ్ఞానం) తొలగిపోతే ఎల్లప్పుడు ఆ ప్రత్యగాత్మ స్ఫుటంగా భాసిస్తుంది. కాబట్టి ఆ సద్రూపమైన ఆత్మకు సంబంధించిన అహంకారం మొదలైన వస్తువు తప్పక తిరస్కరింపదగ్గది.

అందువల్ల విజ్ఞానమయకోశం పరమాత్మ కాదు. వికారి జడం ఒకే ఆవరణకు పరిమితమైనట్లు పరిగణింపబడ్డది. అది దృశ్యం. వివిధ రూపములందు ప్రవర్తించేది. కనుక విజ్ఞానమయకోశం అనిత్యమవుతుంది. ఆ కారణంగా అది నిత్యమైన ఆత్మ ఎన్నడూ కాజాలదు.

## ఆనందమయకోశం

ఆనందం యొక్క ప్రతిబింబంచే వ్యాప్తి పొందిన శరీరం గలది, తమోగుణం చేత విజృంభించేది ఆనందమయకోశమని చెప్పబడుతుంది. ప్రియము మొదలైనది గుణంగా గలది. ఇది ఇష్టమైన వస్తువు లభించడంచేత కల్గుతుంది. పుణ్యాత్ములకు పుణ్యాన్ని అనుభవించడంలో ప్రస్ఫుటమవుతుంది. శరీరం ఒక్కటి ఉంటే చాలు. ప్రయత్నం లేకుండానే స్వయంగా ఆనందరూపాన్ని పొంది అనుభవింపజేస్తుంది.





ఆనంద ప్రతిబింబ చుంబితతనుర్వృత్తి స్తమోజృంభితా
స్యాదానందమయః ప్రియాది గుణకః స్వేష్టార్థలాభోదయః
పుణ్యస్యానుభవే విభాతి కృతినామానందరూపః స్వయం
భూత్వా నందతి యత్ర సాధు తనుభృన్మాత్రః ప్రయత్నం వినా॥ 209

ఈ ఆనందమయకోశం సుషుప్తిదశలో బాగా స్ఫురిస్తుంది. స్వప్నావస్థలోను జాగ్రదవస్థలోను ఇష్టమైన వస్తువుని పొందడంవల్ల కొంచెం కల్గుతుంది. ఈ ఆనందమయకోశం కూడా పరమాత్మ కాదు. ఎందుకంటే ఇది తమోగుణం ఉపాధిగా గలది. ప్రకృతి యొక్క వికారం. పుణ్యకర్మల ఫలంగా లభిస్తుంది. వివిధ వికారాల కలయిక వల్ల కల్గుతుంది.

ఈవిధంగా యుక్తులు వేదాంత వాక్యాలు ఆధారంగా పరిశీలిస్తే అన్నమయాది కోశాలు అయిదూ కూడా ఆత్మ కాదని నిషేధింపబడ్డాయి. ఈ అయిదూ కాకపోయినప్పుడు సాక్షిగా జ్ఞానరూపంగా ఉండే వస్తువు మాత్రమే మిగులుతుంది. అదే ఆత్మ. స్వయం ప్రకాశకం. పంచకోశాలకంటె వేరైనది. జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు మూడింటికీ సాక్షియైనది. జాయతే అస్తి మొదలైన షడ్విధ వికారాలు లేనిది. నిరంజనమైనది. సదా ఆనందస్వరూపంగా తన స్వరూపంగా అది పండితునిచే తెలుసుకోదగ్గది.

## శిష్యుని ప్రశ్న

శిష్యుడు ఇలా అడుగుతున్నాడు : గురూత్తమా! మిథ్యవల్ల కలిగేయి అని పంచకోశాలనీ తిరస్కరిస్తే నాకు సర్వం అభావంగానే కనబడుతోంది. ఇక పండితునిచే తెలుసుకోదగ్గ వస్తువు తనయందు ఉన్నదా?

## గురువు సమాధానం

గురువు ఇలా వివరిస్తున్నాడు : విద్వాంసుడా! సత్యం చెప్పేవు. ఆత్మను గూర్చి విచారించడంలో నిపుణుడివి అయ్యేవు. ఆ అహంకారం మొదలైన వికారాలు వాని అభావం కూడా ఎవనిచే చూడబడుతున్నాయో, ఎవడు దేనిచేతనూ చూడబడడో అతడు పరమాత్మ అనీ అతడు సమస్తం తెలిసినవాడు అనీ మిక్కిలి సూక్ష్మమైన బుద్ధితో గ్రహించు.

ఏదైనా ఎవనిచేతనైనా చూడబడితే దానికి అతడు సాక్షి అవతాడు. చూడనిదానికి సాక్షిగా ఉండడం సాధ్యం కాదుగదా. అనగా సాక్షిత్వం కుదరదు. పరమాత్మ స్వయంగా తనకు తానుగా చూడబడేది. కాబట్టి దానికదే సాక్షిగా చెప్పదగ్గది. అది పరబ్రహ్మము. అదే సాక్షాత్తూ ప్రత్యగాత్మ. ఇతరమైనది కాదు. పరబ్రహ్మముతో అభిన్నమైనది.

జాగ్రత్ స్వప్నసుషుప్తి అవస్థలు మూడింటిలో ప్రత్యగాత్మగా ఏది స్ఫుటతరంగా ప్రకాశిస్తుందో, లోపల ఒక్కటిగా నేను నేను అని ఏది స్ఫురిస్తుందో, నానా ఆకార వికారములతో అహంకారం మొదలైన ఈ అన్నింటిని చూస్తూ ఎల్లప్పుడు ఆనంద జ్ఞానరూపంలో స్ఫురించేది ఏదో దాన్ని నీ స్వరూపంగా హృదయంలో తెలుసుకో.

> జాగ్రత్ స్వప్నసుషుప్తిషు స్ఫుటతరం యోఽసౌ సముజ్జృంభతే
> ప్రత్యగ్రూపతయా సదాహమహమిత్యంతః స్ఫురన్నైకధా
> నానాకార వికార భాజిన ఇమాన్ పశ్యన్నహంధీముఖాన్
> నిత్యానంద చిదాత్మనా స్ఫురతి తం విద్ధి స్వమేతం హృది॥ 219

## చిదాభాసుడు

కుండలోని నీటిలో ప్రతిఫలించిన సూర్యబింబం చూసి మూఢుడు సూర్యుడే అనుకొంటాడు. అలాగే అజ్ఞాని బుద్ధి అనే ఉపాధియందున్న చిదాభాసుణ్ణి (జీవుణ్ణి) చూసి భ్రాంతితో ఆ చిదాభాసుడే తాను (ఆత్మ) అని తలుస్తాడు. పండితుడు ఆత్మానాత్మల వివేచన చేయగలవాడు గనుక కుండనీ కుండలోనున్న నీటినీ ఆ నీటియందు ప్రతిఫలించిన ప్రతిబింబాన్నీ సర్వాన్నీ విడిచిపెట్టి ఆకాశంలోనున్న సూర్యుణ్ణి చూస్తాడు. ఆకాశంలోనున్న సూర్యుడు తటస్థంగా ఉంటూ కుండనీ ఆకుండలోని నీటినీ దానియందున్న ప్రతిబింబాన్నీ ప్రకాశింపజేస్తున్నాడనీ అతడు స్వయం ప్రకాశకుడు అనీ కూడా గుర్తిస్తాడు. అలాగే ఆ పండితుడు దేహాన్నీ బుద్ధినీ అందులోని ఆ చైతన్య ప్రతిబింబాన్నీ (జీవుణ్ణీ) విడిచిపెట్టి బుద్ధి గుహాయందున్న ప్రత్యగాత్మని దర్శిస్తాడు. అట్లే తాను ఆత్మస్వరూపుడనీ ఆ ఆత్మ ద్రష్ట అఖండ జ్ఞానస్వరూపం అనాత్మయైన దేహాదికం సర్వాన్నీ ప్రకాశింపజేసేది సత్ అసత్ అనేవానికంటె విలక్షణం నిత్యం సర్వాధిపత్యం గలది అంతటా ఉండేది





మిక్కిలి సూక్ష్మమైనది లోపలా బైటా శూన్యమైది అనన్యమైనది అని తెలుసుకొంటాడు. దాని వల్ల ఆ పురుషుడు పాపరహితుడు రజోగుణంలేనివాడు మృత్యువు పొందనివాడు శోకం విడిచినవాడు ఆనందఘనుడు అవతాడు. అతడు దేనినుండీ స్వయంగా కొంచెం కూడా భయపడడు. ముముక్షువుకి సంసారబంధ విముక్తికి తన తత్త్వాన్ని (ఆత్మస్వరూపాన్ని) పొందడం తప్ప మరొక మార్గం లేదు.

బ్రహ్మముతో అభిన్నత్వం అనుభవించడం అనే విజ్ఞానం సంసార విముక్తికి కారణం. ఆ బ్రహ్మైక్యానుభవం చేతనే అద్వితీయం ఆనందస్వరూపం అయిన బ్రహ్మను పండితులు పొందుతారు. బ్రహ్మాఽభిన్నమైన అనుభవంగల పండితుడు తిరిగి సంసారంలో ప్రవర్తించడు. జననమరణాత్మకమైన సంసారంలో ప్రవేశింపడని తాత్పర్యం. కాబట్టి తాను బ్రహ్మమే, బ్రహ్మముకంటె వేరయినవాడు కాడు అని తప్పక తెలుసుకోవాలి.

## బ్రహ్మ స్వరూపం

బ్రహ్మము సత్యమైనది. జ్ఞానస్వరూపం. అనంతం. విశుద్ధం. అన్నింటికీ పరమైనది. స్వతః సిద్ధం. నిత్యం. ఆనందమయం. ప్రత్యగాత్మతో అభిన్నం. అది నిరంతరం ప్రకాశిస్తూ ఉంటుంది. అది సద్రూపం. తనకంటె వేరుగా మరొక వస్తువు లేనిది. పరం. అద్వైతం. పరతత్త్వాన్ని తెలుసుకొన్నప్పుడు మరొకటి ఏదీ కొంచెం కూడా స్ఫురణలో ఉండదు. అంతటా ఒక్క బ్రహ్మమే గోచరిస్తూ ఉంటుంది. ఈ విశ్వం సమస్తమూ నానా రూపాలతో అజ్ఞానం వల్లనే స్ఫురిస్తుంది. కాని అదికూడా నానా కల్పనారహితమైన బ్రహ్మమే.

మట్టిచే చేయబడింది అంతా మట్టియే అవుతుంది. దానికంటె భిన్నం కాదు. అంతటా కుండ మట్టిరూపంలోనే ఉంటుంది. మట్టికంటె వేరుగా కుండ ఎక్కడా ఉండదు. కుండ అనే పేరు మిథ్యచే కల్పింపబడింది మాత్రమే. ఎవడైనా మట్టి నుండి వేరుచేసి కుండ రూపాన్ని చూపించగలడా? అది అసాధ్యంగదా. కాబట్టి అజ్ఞానంచే కుండ అనేది కల్పింపబడింది. యథార్థంగా అక్కడ ఉన్నది మట్టియే. అలాగే సద్రూపమైన బ్రహ్మము నుండి వచ్చినది సర్వమూ సత్తే (బ్రహ్మమే). అది సన్మాత్రమేగాని తద్భిన్నమైనది ఏదీలేదు. ఒకవేళ ఎవడైనా సత్తుకంటె వేరుగా

ఉందని అంటే ఇంకా అజ్ఞానం అతణ్ణి వీడలేదని చెప్పవలసి ఉంటుంది. ఏదో వేరుగా ఉందనడం నిద్రలో పలవరింతవంటిదే.

అథర్వవేదానికి చెందిన శ్రేష్ఠమైన వాక్కు ఈ విశ్వం బ్రహ్మమే అని స్పష్టంగా "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్" అని చెప్తోంది. కాబట్టి ఈ విశ్వం సర్వం బ్రహ్మ మాత్రమే. అధిష్ఠానంకంటె ఆరోపితం భిన్నంగా ఉండదుగదా. రజ్జుసర్పభ్రాంతిలో రజ్జువు అధిష్ఠానం. సర్పం ఆరోపిత వస్తువు. రెండూ అభిన్నమే గదా. రెండు వస్తువులు యథార్థంగా లేవుగదా. అలాగే బ్రహ్మము అధిష్ఠానం. విశ్వం ఆరోపింపబడ్డ వస్తువు. కాబట్టి విశ్వం బ్రహ్మముకంటె వేరు కాదు. రెండూ అభిన్నములే.

ఒకవేళ విశ్వం సత్యమైనది అయితే బ్రహ్మమును గూర్చి చెప్పే "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అనే శ్రుతి వాక్యంలో అనంతత్వం వ్యర్థమవుతుంది. రెండవది వేదవాక్యం అప్రమాణం అవుతుంది. మూడవది వేదాలని అందించిన పరమేశ్వరునికి అసత్యవాదిత్వం అనే దోషం సంభవిస్తుంది. మహాత్ములకు ఈ మూడూ సమ్మతములు హితములు కావు.

బ్రహ్మతత్త్వం తెలిసిన ఈశ్వరుడు ఆ భూతములలో నేను లేను. ఆ సర్వభూతములు నాలో లేవు అని "మత్స్థాని సర్వభూతాని న చాహంతేష్వవస్థితః నచ మత్స్థాని భూతాని" (గీత 9-4,5) అనియే చెప్పినాడు. దీన్నిబట్టి కూడా సర్వవ్యాపకమైన బ్రహ్మము అద్వితీయం, తద్భిన్నమైనది ఏదీలేదు అని విశదమౌతోంది. ఒకవేళ ఈ విశ్వం సత్యం (ఉన్నదే) అయితే సుషుప్తిదశలో అది పొందబడాలి. కాని కొంచెం కూడా లభ్యంకాదు. కాబట్టి విశ్వం అసత్తు. స్వప్నంలోని వస్తువువలె మిథ్యయే. అందువల్ల పరబ్రహ్మముకంటె వేరుగా జగత్తు లేదు. వేరుగా కనబడడం మిథ్యామాత్రమే. అది త్రాడు సర్పంగా కనబడడం వంటిదే. ఆరోపితమైన వస్తువుకి అస్తిత్వం (ఉనికి) ఉంటుందా? అధిష్ఠానమైన బ్రహ్మమే ఆ విధంగా జగత్తుగా భ్రాంతిచేత కనబడుతోంది. భ్రాంతి పొందిన వానికి భ్రమచే కనబడే ప్రతి వస్తువు కూడా బ్రహ్మమే. శుక్తి రజత భ్రాంతిలో కనబడే వెండి ముత్యపుచిప్ప మాత్రమే. కాబట్టి ఇది అనే చూపబడే జగత్తు సద్రూపమైన బ్రహ్మమే. బ్రహ్మమునందు ఆరోపింపబడ్డ ఆ జగత్తు నామమాత్రమే.





ఆ కారణంగా బ్రహ్మము "సత్తు. అద్వితీయం. విశుద్ధమైన విజ్ఞానఘనం. నిరంజనం. ప్రశాంతం. ఆద్యంతహీనం. అక్రియం. నిరంతరమైన ఆనంద స్వరూపం. మాయచే కల్పింపబడ్డ సర్వభేదాలు లేనిది. నిత్యం ధ్రువం. నిష్కలం. అప్రమేయం. (ఏరకమైన కొలతచేతను కొలవశక్యంగానిది). రూపరహితం. అవ్యక్తం. నామరహితం. అవ్యయం. స్వయంప్రకాశం. జ్ఞాత జ్ఞేయం జ్ఞానం అనే త్రిపుటి లేనిది. అనంతం. నిర్వికల్పం. కేవలం అఖండమైన చిన్మాత్రం. పరతత్త్వం" అని పండితులు తెలుసుకొంటారు. ఆత్మ విడిచిపెట్టడానికి గాని గ్రహించడానికి గాని శక్యంగానిది. మనస్సుచే వాక్కులచే పొందరానిది. కొలతకి అందనిది. ఆద్యంతరహితం. అట్టి పరిపూర్ణమైన మహాతేజస్సు నేనే అని తెలుసుకోదగ్గది.

## తత్త్వమసి వాక్యార్థ నిరూపణం

తత్ త్వమ్ అనే పదాలకి అభిధావృత్తిచేత బ్రహ్మస్వరూపులైన జీవాత్మ పరమాత్మలు అని అర్థం చెప్పబడుతోంది. ఆ జీవుడు ఈశ్వరుడు శోధింపబడినవారు కాగా ఛాందోగ్యోపనిషత్తులోని తత్త్వమసి అనే వాక్యం వారికి చక్కగా ఏకత్వాన్ని మాటమాటకీ ప్రతిపాదిస్తోంది. తత్ ఆ పరబ్రహ్మము త్వమ్ నీవు అసి అయితివి అని బోధిస్తోంది. మిణుగురుపురుగు-సూర్యుడు, రాజు-సేవకుడు, బావి-సముద్రం, పరమాణువు-మేరువు అనేవి విరుద్ధ ధర్మాలు గలిగినట్లే జీవేశ్వరులు కూడా విరుద్ధ ధర్మాలు గలవారే. వాచ్యార్థంలో ఆ జీవేశ్వరులకి ఐక్యం కుదరదు. లక్ష్యార్థంలో మాత్రమే ఆ ఏకత్వం (అభిన్నత్వం) సాధ్యమౌతుంది.

జీవేశ్వరులకి విరోధం ఉపాధివల్ల కల్పింపబడింది. యథార్థంగా వారికి విరోధంలేదు. ఈశ్వరునికి ఉపాధి మహదాదులకి కారణమైన మాయ. జీవునికి అవిద్యకు కారణమైన అన్నమయాది పంచకోశాలు ఉపాధి. ఈ ఉపాధులు రెండింటినీ తొలగిస్తే ఈశ్వరుడు జీవుడు అని రెండు ఉండవు. రాజుకిగల రాజ్యాన్నీ భటునికి గల ఆయుధాన్ని (ఇద్దరి ఉపాధులనీ) తొలగిస్తే ఇద్దరూ అంటే రాజు భటుడు సమానులే అవతారు. రాజ్యం చేతనే రాజు అనీ, ఆయుధం చేతనే రాజభటుడు అని వ్యవహారం ఏర్పడింది..

"అథాత ఆదేశః" (అథాత ఆదేశో నేతినేతి) అనే శ్రుతివాక్యం స్వయంగా

బ్రహ్మమునందు ద్వైతభావాన్ని నిషేధిస్తోంది. శ్రుతి ప్రమాణంచేతను, అనుగ్రహించిన యుక్తిచేతను ఈశ్వరునికీ జీవునికీ గల భేదం తప్పక తిరస్కరింపదగ్గదే అవుతుంది. జీవేశ్వరులకి భేదం కల్పితం. కాబట్టి సత్యం కానేరదు. త్రాడునందు చూడబడ్డ సర్పత్వం, అలాగే స్వప్నంలో పొందిన విశ్వం సత్యం కానట్లే ఈశ్వరునియందు జీవత్వం కూడా యథార్థం కాదు. ఈవిధంగానే దృశ్యమైన విశ్వాన్ని కూడా సాధుయుక్తితో తిరస్కరించి బ్రహ్మముతో విశ్వానికి గల ఏకత్వాన్ని తెలుసుకోవాలి. విశ్వం కూడా భ్రాంతిచే కల్పింపబడ్డదే గాని బ్రహ్మముకంటె వేరుగా నున్నది కాదని తాత్పర్యం.

జీవేశ్వరులకు ఐక్యం కేవలం లక్షణావృత్తిచేతనే సిద్ధిస్తుంది. ఆ రెండింటికి అఖండమైన ఆనందరూపాన్ని సిద్ధించడానికి జహత్, అజహత్ భేదాలు రెండూకూడా చాలవు. ఆ రెండింటిచేత (జహదజహల్లక్షణ చేత) మాత్రమే ఐక్యం సాధ్యమవుతుంది. ఎప్పుడో ఎక్కడో చూసిన దేవదత్తుణ్ణి ఉద్దేశించి "ఆ దేవదత్తుడే వీడు" అని చెప్పినప్పుడు దేశకాలాది విరుద్ధ ధర్మాలు తొలగిస్తేనే ఆ దేవదత్తుడు ఈ దేవదత్తుడు అవతాడు. విరుద్ధంగా ఉండే ధర్మాలు విడిచిపెడ్తేనే ఇద్దరికీ ఏకత్వం సమన్వయం అవుతుంది. అలాగే "తత్త్వమసి" అనే వాక్యమందు కూడా తత్, త్వమ్ అనే రెండింటికీ చెందిన సర్వజ్ఞత్వం, కించిద్జ్ఞత్వం అనే విరుద్ధధర్మాలు తొలగించి ఇద్దరిలో సమానంగా ఉన్న చైతన్యాన్ని మాత్రం తీసుకొంటే జీవేశ్వరులకి ఐక్యం స్పష్టమవుతుంది. పండితులు ఈశ్వరునియందు జీవునియందు గల చైతన్యాన్ని మాత్రమే గ్రహించి జీవేశ్వరులకి అఖండ భావాన్ని నిరూపిస్తున్నారు. బ్రహ్మాత్మలకి ఐక్యాన్నీ అఖండత్వాన్నీ ఎన్నో మహావాక్యాలు బోధిస్తున్నాయి.

బృహదారణ్యకంలోని "అస్థూల మనణ్వహ్రస్వ మదీర్ఘమలోహిత మస్నేహమ్" అనే వాక్యం ప్రకారం అసత్తుని నిషేధిస్తే ఆత్మ స్వయం సిద్ధమైనది ఆకాశంవలె ఊహింపశక్యంగానిది అని విశదమవుతుంది. కనుక ఈ కనబడే దేహాదికం మిథ్యామాత్రమే. దానియందు అదే నేను అనే బుద్ధిని విడిచిపెట్టు. విశుద్ధమైన బుద్ధితో నేను బ్రహ్మమే అనీ, నేను అఖండమైన జ్ఞానస్వరూపాన్ని అనీ తెలుసుకో.





మట్టితో చేయబడ్డ కుండ మొదలైనవి అన్నీ మట్టికంటె వేరుగాలేవు. అలాగే సత్తు (బ్రహ్మము) నుండి పుట్టిన దేహాదికం, జగత్తు మొదలైనవన్నీ కూడా సదాత్మకమే అవతాయి. సత్తుకంటె ఏదీ వేరుగా లేదు. అది సత్యం (త్రికాలా బాధితమైనది) స్వయంగా ఆ బ్రహ్మమే నీవు. కాబట్టి శిష్యా! నీవు ఆ బ్రహ్మమే అయి ఉన్నావు (తత్త్వమసి). ప్రశాంతం అమలం అన్నింటికీ పరం అయిన అద్వయ బ్రహ్మమే నీవు.

**మృత్కార్యం సకలం ఘటాది సతతం మృణ్మాత్రమేవాఽభితః**
**తద్వత్ సజ్జనతం సదాత్మకమిదం సన్మాత్రమేవాఖిలమ్**
**యస్మాన్నాస్తి సతః పరం కిమపి తత్ సత్యం స ఆత్మా స్వయం**
**తస్మాత్ తత్త్వమసి ప్రశాంతమమలం బ్రహ్మాద్వయం యత్పరమ్॥ 253**

నిద్రలో స్వప్నమందు అనుభవించిన దేశం కాలం విషయం జ్ఞాత (నువ్వు) అంతా మిథ్య అని స్పష్టమేగదా. అలాగే జాగ్రదవస్థలో జగత్తు కూడా అజ్ఞానం వల్ల ఏర్పడ్డదే. ఆ ప్రకారంగానే ఈ శరీరం ఇంద్రియాలు ప్రాణం అహంకారం మొదలైనవి అన్నీ కూడా అసత్తే. మిథ్యయే. కాబట్టి నువ్వు ఆ పరబ్రహ్మావి. ప్రశాంతం అమలం అయిన అద్వయ బ్రహ్మావి.

## తత్త్వమసి వాక్యార్థ వివరణం

జాతి నీతి కులం గోత్రం అనే వానికి దూరమైనది బ్రహ్మము. అది నామం రూపం గుణం దోషం లేనిది. దేశం కాలం విషయం అనేవానికి అతీతమైనది. ఆ బ్రహ్మమే నీవు. ఆ బ్రహ్మమే నేను అని మనస్సులో భావిస్తూ ఉండు.

అన్నింటికీ పరమైనది సకల వాక్కులకు అగోచరమైనది, విమలమైన జ్ఞాననేత్రానికి గోచరించే, శుద్ధం చిద్ఘనం అనాది అయిన ఆ బ్రహ్మమే నీవు. ఆ బ్రహ్మమే నేను అని మనస్సులో భావించు. క్షుత్పిపాసలు, శోకమోహాలు జననమరణాలు అనే ఊర్ములు లేనిదీ, యోగుల హృదయంలో భావింపబడేదీ, ఇంద్రియాలచే భావింపశక్యంగానిదీ, బుద్ధిచే తెలుసుకోదగ్గదీ, దోషంలేని ఐశ్వర్యమైన ఆ బ్రహ్మమే నీవు. ఆ బ్రహ్మమే నేను అని మనస్సులో భావించు.

భ్రాంతిచే కల్పింపబడ్డ ఈ జగత్తుకీ దాని కార్యాలకీ కూడా ఆశ్రయమైనది,

తనకు తానే ఆశ్రయమైనది, సత్తు అసత్తు అనే రెండింటికీ విలక్షణమైనది, అవయవాలు లేనిది, సాటిలేనిది, పరిపూర్ణమైనది అయిన ఆ బ్రహ్మము నీవు. ఆ బ్రహ్మమే నేను అని మనస్సులో భావించు. పుట్టుక వృద్ధి పరిపాకం తగ్గుదల వ్యాధి నాశనం అనేవి లేనిది అవ్యయమైనది జగత్తుయొక్క సృష్టి స్థితిలయాలకి కారణమైనది అయిన ఆ బ్రహ్మమే నీవు. ఆ బ్రహ్మమే నేను అని మనస్సులో భావించు. తనకంటె వేరైనది లేనిది, లక్షణాలకి అందనిది, కెరటాలు లేని జలరాశివలె నిశ్చలమైనది నిత్యం బంధాల నుండి విడివడినది (బంధరహితమైనది) అయిన బ్రహ్మమే నీవు. ఆ బ్రహ్మమే నేను అని మనస్సులో భావించు. ఏకం సద్రూపం అనేక కారణరూపం, కారణాంతరాలు లేనిది, కార్యకారణాలకి విలక్షణమైనది, స్వతంత్రమైనది అయిన ఆ బ్రహ్మమే నీవు. మనస్సులో ఆ బ్రహ్మమే నేను అని భావించు.

వికల్పాలు లేనిది అనల్పమైనది అక్షరమైనది క్షర అక్షరాలకంటె విలక్షణమైనది అన్నింటికీ పరమైనది నిత్యమైనది తరగని సుఖస్వరూపమైనది నిరంజనమైనది అయిన ఆ బ్రహ్మమే నీవు. మనస్సులో ఆ బ్రహ్మమే నేను అని భావించు. కంకణాలు కేయూరం అని వివిధ రూపాలతో నామాలతో బంగారం వ్యవహరింపబడుతున్నట్లు సత్తు నామరూప గుణ విక్రియలతో భ్రమచే అనేక విధాలుగా భాసిస్తోంది. అది స్వయంగా క్రియారహితమైనది. అదే బ్రహ్మము. ఆ బ్రహ్మమే నేను అని మనస్సులో భావించు.

ఏకరూపమైనది (వేరొకటి లేనిది) పరమైనదానికంటె పరమైనది ప్రత్యగాత్మయైనది ఏకరస (ఆనంద) రూపమైనది ఆత్మలక్షణం గలది సత్యం చిత్సుఖం అనంతం అవ్యయం అయి ప్రకాశించేది బ్రహ్మము. ఆ బ్రహ్మమే నేను అని మనస్సులో భావించు.

ఈ విధంగా చెప్పిన ఈ వస్తువుని (బ్రహ్మమును) స్వయంగా ప్రసిద్ధమైన యుక్తులతో సంశయరహితంగా మనస్సులో భావించు. దానివల్ల అరచేతిలోని నీటివలె తత్త్వజ్ఞానం ప్రాప్తిస్తుంది. శుద్ధమైన జ్ఞానమాత్రంగా పరిశుద్ధమైన తత్త్వాన్ని తెలుసుకో. అది సంఘంలోను సైన్యంలోను రాజువలె ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ పరతత్త్వాన్ని ఆశ్రయించు. ఎల్లప్పుడు నీ స్వరూపమైన ఆత్మయందే ఉంటూ బ్రహ్మమునందు సమస్త విశ్వాన్నీ లయం చేసుకో.





బుద్ధి గుహయందు సత్ అసత్ అనేవానికి విలక్షణమైన బ్రహ్మము ఉంటుంది. అది సత్యం పరం అద్వితీయం. ఆ బుద్ధి గుహయందు బ్రహ్మముగా ఉండేవానికి శిష్యా! తిరిగి సంసారగుహాప్రవేశం ఉండదు. అతడు జనన మరణాత్మకమైన సంసారానుభవం పొందడని భావం.

## వాసనాత్రయం

బ్రహ్మానుభవం కల్గినప్పటికీ పెక్కు జన్మలనుండి వస్తున్న వాసన బలీయమైనది. అది అనాది. నేను కర్తని నేను భోక్తని అనే వాసన దృఢంగా ఉంటే అది అతని సంసారప్రాప్తికి హేతువు అవుతుంది. ఆత్మయందు ప్రత్యగ్ దృష్టితో (ఇంద్రియాల శక్తులని లోపలికి మరల్చుకొని) నేను ప్రత్యగాత్మని అనే భావాన్ని పొందుతూ ఉండేవాడు ప్రయత్నించి ఆకర్తృత్వ భోక్తృత్వ రూపమైన వాసనని పోగొట్టుకోవాలి. ఆ వాసనని వదల్చుకోడమే ముక్తి అని మునులు చెప్తారు.

అనాత్మయైన దేహాదులందు నేను నాది అనే భావం అధ్యాస అనిపించుకొంటుంది. పండితుడు ఆత్మనిష్ఠుడై (తన స్వరూపమైన ఆత్మయందే ఉంటూ) ఆ అధ్యాసని వదల్చుకోవాలి.

**అహం మమేతి యో భావో దేహాదావనాత్మని**
**అధ్యాఽసోయం నిరస్తవ్యో విదుషా స్వాత్మనిష్ఠయా॥ 269**

బుద్ధికీ దాని వృత్తులకీ సాక్షియైన ప్రత్యగాత్మ నీ స్వరూపమని తెలుసుకొని ఆ బ్రహ్మమే నేను అని పరమాత్మయందే ఉంటూ అనాత్మయైన దేహాదికమందు ఆత్మభావాన్ని విడిచిపెట్టు.

లోకవాసనని దేహవాసనని శాస్త్రవాసనని విడిచిపెట్టి ఆ మూడింటివల్ల కలిగే అధ్యాసని పోగొట్టుకో. అనాత్మయైన దేహాదికమందు ఆత్మభావాన్ని తొలగించుకోవాలని భావం. లోకవాసన దేహవాసన శాస్త్రవాసన ఉన్నంతకాలం జ్ఞానం కల్గదు. సంసారమనే కారాగారంనుండి ముక్తి కోరుకొనేవారికి పటిష్ఠములైన ఈ మూడు వాసనలు కాళ్లకు కట్టిన ఇనుప సంకెళ్ల వంటివని తత్త్వవేత్తలు చెప్తారు. ఆ వాసనలనుండి విడివడినవాడు ముక్తిని పొందుతాడు.

గంధపుచెక్క ఎక్కువకాలం నీటిలో ఉంటే మలినగంధం దాన్ని ఆవరిస్తుంది. సహజంగా దానికున్న సుగంధం లోపిస్తుంది. కాని దాన్ని ఒక్కసారి సానమీద అరగదీస్తే బాహ్యంగా ఉండే వాసన (దుర్గంధం) పోతుంది. సహజమైన సుగంధం పరిమళిస్తుంది. అలాగే లోపల అంటిపెట్టుకొనియున్న దురంతములైన మలినవాసనల ధూళి పరమాత్మకు చెందిన వాసనని కప్పిపుచ్చుతుంది. ప్రజ్ఞయొక్క సంఘర్షణచేత మలినవాసనలు దూరమవతాయి. ఆత్మవాసన విశుద్ధమై ప్రస్ఫుటమవుతుంది.

మనస్సు ప్రత్యగాత్మయందు స్థిరంగా ఉన్నంతకాలం అది బాహ్యావాసనలని విడిచిపెడ్తుంది. వాసనలు నిశ్శేషంగా తొలగిపోతే ఏ ప్రతిబంధకం లేని ఆత్మానుభవం లభిస్తుంది.

యథా యథా ప్రత్యగవస్థితం మనః
తథా తథా ముంచతి బాహ్యావాసనాః
నిశ్శేషమోక్షే సతి వాసనానా
మాత్మానుభూతిః ప్రతిబంధశూన్యా॥ 277

యోగుల మనస్సు ఎల్లప్పుడు ఆత్మయందే స్థిరంగా నిలిచి లయమవుతుంది. కనుక వాసనలు లయం చేసుకో. అధ్యాసను తొలగించుకో. తమోగుణం సత్త్వరజోగుణాలచేతను, రజోగుణం సత్త్వగుణంచేతను, మిశ్రిత సత్త్వం శుద్ధసత్త్వం చేతను నశిస్తుంది. కాబట్టి ధైర్యంతో శుద్ధ సత్త్వగుణాన్ని ఆధారంగా చేసుకొని అధ్యాసని వదల్చుకో. శరీరాన్ని ప్రారబ్ధకర్మ పోషిస్తుందని నిశ్చయించుకొని నిశ్చలంగా ఉండు. ధైర్యంతో ప్రయత్నించి అధ్యాసను తొలగించుకో.

నేను జీవుణ్ణి కాను పరబ్రహ్మని అని నిత్యం నిరంతరం ధ్యానిస్తూ వాసనల వేగంవల్ల ప్రాప్తించిన నీ అధ్యాసను పోగొట్టుకో. శ్రుతి, యుక్తి, స్వానుభవం అనే మూడింటిచేత నేను సర్వమయుణ్ణి అని తెలుసుకొని ఆభాసవల్ల కల్గిన అధ్యాసను పోగొట్టుకో. ఆత్మనిష్ఠునికి వస్తువుని గ్రహించినా విడిచిపెట్టినా కొంచెం కూడా అది ఫలప్రదమైన కర్మ కాదు. నిత్యం ఆత్మయందే స్థిరంగా నీ అధ్యాసను తిరస్కరించుకో.

తత్త్వమసి మొదలైన వాక్యాలవల్ల జీవేశ్వరుల ఐక్యజ్ఞానం కల్గుతుంది. దానిచే బ్రహ్మమునందు జీవాత్మ దృఢంగా ఉండడంకోసం నీ అధ్యాసను లయం





చేసుకో. ఈ దేహమందు ఇది నేను అనే భావం నిశ్శేషంగా లయమయ్యేవరకు సావధానంగా మనస్సుని నిగ్రహించుకొని నీ అధ్యాసని పోగొట్టుకో. ఓ పండితుడా! జీవాత్మ జగత్తు అనే రెండూ స్వప్నంలో పొందిన వస్తువులవలె కల్పింపబడ్డవి యథార్థములు కావు అని స్ఫురించే వరకు నీ అధ్యాసను నిరంతరం తొలగించుకో. నిద్రకు గాని లోకవ్యవహారానికి సంబంధించిన మాటకుగాని పరాకుకి గాని కొంచెం కూడా అవకాశం ఇవ్వకుండా మనస్సులో (అంతఃకరణంలో) ఆత్మను ధ్యానించు.

తల్లిదండ్రుల శుక్లశోణితరూపమైన మలంనుండి ఈ దేహం పుట్టింది. మలమాంసమయం. అట్టిదాన్ని దూరంగా విడిచి బ్రహ్మమే అయి జీవితాన్ని సార్థకం చేసుకో. ఓ మునీ! ఘటమందు పరిమితమైయున్న ఆకాశాన్ని మహాకాశంలో లయంచేసినట్లు జీవాత్మని పరమాత్మయందు లయం చేసుకొని పరిపూర్ణమైన బ్రహ్మరూపంతో ఎల్లప్పుడు తూష్ణీభావంతో ఉండు. పరమాత్మ స్వయం ప్రకాశకం. సర్వానికీ ఆధారం. మనస్సులో ఆ పరమాత్మని పొంది పిండాండం (నీ శరీరం) బ్రహ్మాండం (చతుర్దశ భువనాలతో కూడినది) కూడా మలభాండములని తలచి విడిచిపెట్టు. దేహంపై పొందుతున్న నేను అనే భావాన్ని ఎల్లప్పుడు చైతన్య స్వరూపమైన సదానందమందు (బ్రహ్మమునందు) ఉంచి లింగశరీరాన్ని విడిచిపెట్టి కేవల పరబ్రహ్మము అగుము.

అద్దంలో ప్రతిబింబించిన అంతఃపురంవలె దేనియందు ఈ జగత్తు ఆభాసగా ఉంటోందో ఆ పరబ్రహ్మమే నేను అని తెలుసుకొంటే కృతకృత్యుడివి అవతావు. సత్యం నీ యథార్థరూపం ఆద్యం నిరాకారం అక్రియం జ్ఞానం అద్వయానందం అయిన ఆ పరబ్రహ్మమును పొంది అసత్యమైన శరీరాన్ని విడిచిపెట్టు. అది ఆత్మకి నాట్యకాడు ధరించిన వేషంవంటిది.

క్షణంలో లయమవడాన్ని చూస్తూ ఉడదంచేత అన్నివిధాలా ఈ కనబడే సర్వం మిథ్యయే. అసత్యమే. అది నేను అనేదానికి అర్థం కాలేదు. అహం మొదలైనవానికి క్షణికత్వమే సిద్ధిస్తున్నప్పుడు నేను సర్వం తెలుసుకొంటున్నాను అనే జ్ఞానం ఎలా సిద్ధిస్తుంది?

అహంకారం మొదలైన వాని అన్నింటికీ ప్రత్యగాత్మ సాక్షియైనది. అది నిత్యం సుషుప్తిదశలో స్పష్టంగా గోచరిస్తుంది. "అజో నిత్యః" అనే శ్రుతివాక్యం స్వయంగా ప్రత్యగాత్మ పుట్టుకలేనిది నిత్యమైనది సత్తు అసత్తు అనే వానికంటె విలక్షణమైనది అని చెప్తోంది. ఆ ప్రత్యగాత్మ షడ్భావ వికారాలు గల ఇంద్రియాల సర్వవికారాలు తెలిసినది. కాబట్టి తప్పక నిత్యం వికారరహితమై ఉండడానికి అర్హమైనది.

కోరికలయందు, స్వప్నమందు, సుషుప్తియందు పూర్వం చెప్పబడ్డ దృశ్య ప్రపంచం అహంకారం అనే వానియొక్క అభావం (లేకపోవడం) స్పష్టంగా మాటమాటకీ చూడబడుతోంది. ఆ కారణంగా మాంసపిండమైన దేహమందు, అలాగే బుద్ధిచే కల్పింపబడ్డ దేహమే నేను అని తలంచే అహంకారమందు అభిమానాన్ని (నేను నేను అనే భావాన్ని) విడిచిపెట్టు. మూడుకాలాలచే బాధింపబడని అఖండమైన జ్ఞానస్వరూపాన్ని (ప్రత్యగాత్మని) తెలుసుకో. అదే నీ రూపమని గుర్తించి శాంతిని పొందు. తడిసిన శవంవంటి శరీరాన్ని ఆశ్రయించి ఏర్పడ్డ కులం గోత్రం నామం రూపం ఆశ్రమం అనేవానియందు అభిమానాన్ని విడిచిపెట్టు. లింగశరీరానికి చెందిన కర్తృత్వ భోక్తృత్వాది ధర్మాలని కూడా పరిత్యజించు. అఖండ సుఖ స్వరూపుడివి అగుము.

## అహంకారం

పురుషుడికి సంసారహేతువులుగా మరికొన్ని ఇతర ప్రతిబంధకాలు కూడా చూడబడుతున్నాయి. వాని అన్నింటికి మూలం అహంకారం. అది మొదటి వికారం. ఆత్మకు దుష్టమైన అహంకారంతో సంబంధం ఉన్నంతకాలం విలక్షణమైన ముక్తివార్త లేశమాత్రంగా అయినా ఉండదు. అహంకారమనే గ్రహంనుండి బైటపడినవాడే తన స్వరూపమైన ప్రత్యగాత్మని పొందగల్గుతాడు. అది చంద్రునివలె స్వచ్ఛమైనది. పరిపూర్ణమైనది. స్వయం ప్రకాశకం. నిత్యమైన ఆనందం. విస్తరించిన తమోగుణంచే వివేకాన్ని కోల్పోయిన బుద్ధిచేత పొందబడినది ఈ దేహం. అదే నేను అనే అనుభవం నిశ్శేషంగా నాశనమయినప్పుడు ప్రతిబంధకాలు లేని బ్రహ్మమే నేను అనే భావం కల్గుతుంది.

బ్రహ్మానందం ఒక నిధి వంటిది. దాన్ని బలవంతమైన అహంకారమనే భయంకర సర్పం బాగా చుట్టుకొని సంరక్షిస్తోంది. ఆ మహాసర్పానికి





సత్త్వరజస్తమోగుణాలు మూడూ తీవ్రములైన శిరస్సులు. ఆ మూడు తలలని శ్రుతి ప్రతిపాదితమైన విజ్ఞానమనే గొప్ప కత్తితో నరికి ఆ పాముని నిర్మూలించేవాడు సుఖాన్ని చేకూర్చే ఆ నిధిని అనుభవించడానికి సమర్థుడు.

బ్రహ్మానంద నిధిర్మహాబలవతాహంకార ఘోరాహినా
సంవేష్ట్యాత్మని రక్ష్యతే గుణమయైశ్చండై స్త్రిభిర్మస్తకైః
విజ్ఞానాఖ్యమహాసినా శ్రుతిమతా విచ్ఛిద్య శీర్షత్రయం
నిర్మూల్యాహిమిమం నిధిం సుఖకరం ధీరోఽనుభోక్తుం క్షమః॥ 303

శరీరంలో కొంచెమైనా విషదోషస్ఫూర్తి ఉన్నంతకాలం ఆరోగ్యం కల్గదుగదా. అలాగే అహంకారం కొంచెమైనా ఉన్నంతకాలం యోగికి ముక్తి లభింపదు. అహంకారాన్ని పూర్తిగా నిర్మూలించుకొని ఆ అహంకారంవల్ల కలిగే నానావికల్పాలనీ తొలగించుకొని ప్రత్యగాత్మకు చెందిన వివేకం పొందడంవల్ల ముముక్షువు "అహం బ్రహ్మాస్మి" అనే తత్త్వాన్ని పొందుతాడు. నేను చూస్తున్నాను నేను వింటున్నాను మొదలైన వానియందు కర్తృత్వరూపమైన అహంకారాన్ని వేగంగా విడిచిపెట్టు. అది వివిధ వికారాలలో ఉంటుంది. నీ స్వరూపమైన ఆత్మను కప్పిపుచ్చుతూ ఉంటుంది. నీవు సుఖస్వరూపుడివి. ప్రత్యగాత్మవి. నీకు జనన మరణ జరాదుఃఖాలు ఎక్కువగా గల సంసారం అనాత్మయైన దేహాదికమందు నేను అనే అహంకారబుద్ధి కల్గడంచేతనే ప్రాప్తించింది.

నువ్వు సత్ స్వరూపుడివి. అద్వితీయుడివి. చిన్మయుడివి. సర్వాధిపతివి. ఆనందమూర్తివి. అనవద్యకీర్తివి. నిర్వికారుడివి. అట్టి నీకు అహంకార రూపమైన అధ్యాసే సంసారం. మరొకటి కాదు. అందువల్ల తింటున్నవాని కంఠంలో ముల్లు వంటిది ఈ అహంకారం. అది నీ శత్రువు వంటిది. దాన్ని విజ్ఞానమనే మహాఖడ్గంతో ముక్కలుగా నరుకు. స్ఫుటంగా భాసించే ఆత్మ సామ్రాజ్య సుఖాన్ని నీ ఇష్ట ప్రకారం అనుభవించు. అహంకారాదుల నుండి మనస్సుని మరల్చుకొని విషయాలపై రాగాన్ని విడిచిపెట్టి ఆత్మసుఖానుభూతిచే బ్రహ్మమునందు పరిపూర్ణంగా నిర్వికల్పుడవై క్రియారహితుడవై ఉండు.

## వాసనల ప్రాబల్యం

గొప్ప శక్తిగల అహంకారం సమూలంగా విచ్ఛిన్నమైనప్పటికీ ఒక్క క్షణం మనస్సు ఆ అహంకారాన్ని స్పృశిస్తే మళ్ళీ అది బాగా జీవాన్ని పొందుతుంది. వర్షాకాలంలో గాలిచే మేఘం బహుధా విస్తరించినట్లు వందల విక్షేపాలని (సంకల్పాలని) కల్గిస్తుంది. ఆ కారణంచే శత్రువైన అహంకారాన్ని అరికట్టు. విషయచింతనకు అవకాశం ఇవ్వకు. ఎండిన నిమ్మచెట్టుని నీళ్ళు చిగిరింపజేసినట్లు విషయచింతన అహంకారాన్ని బాగా బ్రతికించడానికి హేతువు అవుతుంది.

దేహమే నేను అని స్థిరంగా ఉన్నవాడు కోరికలు గలవాడు అవతాడు. ఈ దేహం నేను కాదు అని దృఢంగా నమ్మినవాడు కామి కాలేడు. విషయచింతన పరత్వమే భేదబుద్ధిని పెంచుతుంది. సంసారబంధానికి హేతువు అవుతుంది.

కార్యం బాగా పెరుగుతూ ఉంటే బీజం బాగా వృద్ధి పొందుతోందని విశదమవుతోంది. కార్యనాశంవల్ల బీజనాశం అవుతుంది. కాబట్టి కార్యాన్ని నిరోధించాలి. కార్యమనగా విషయచింతన. దానికి బీజం జన్మాంతరవాసన. విషయచింతన పరిహరిస్తే వాసనాక్షయమవుతుందని తాత్పర్యం. వాసన వృద్ధి పొందడంచేత విషయానుభవరూపమైన కార్యం కూడా పెరుగుతుంది. కార్యవృద్ధి చేత వాసనకూడా అనేక విధాలుగా వృద్ధి పొందడంవల్ల పురుషునికి సంసారం తొలగదు.

యతి సంసారబంధాన్ని త్రెంచుకోడం కోసం వాసననీ అలాగే దానివల్ల వృద్ధిపొందే కార్యాన్నీ కూడా బాగా నాశనం చేసుకోవాలి. విషయచింతన, విషయాన్ని అనుభవించడం అనే రెండింటివల్ల వాసన వృద్ధి అవుతుంది. ఆవిధంగా పెరిగిన ఆ వాసన పురుషునికి సంసారాన్ని కల్గిస్తుంది. కాబట్టి ఎల్లప్పుడు జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలు మూడింటిలో కూడా వాసన, విషయచింతన, బాహ్యానుభవం అనే మూడూ క్షయమవడానికి ఉపాయాన్ని ఆశ్రయించాలి. అంతటా అన్ని విధాలా సర్వాన్నీ బ్రహ్మముగా దర్శించాలి. సర్వం బ్రహ్మమే అనే భావం దృఢంగా ఉంటే ఆ వాసన విషయచింతన బాహ్యానుభవం అనే మూడూ లయమవతాయి.

బాహ్యక్రియానాశం (విషయానుభవనాశం) అయినప్పుడు చింత





నాశనమవుతుంది. చింతానాశం వల్ల వాసన క్షయమవుతుంది. వాసన పూర్తిగా ఏమీ మిగలకుండా నాశనమవడమే మోక్షం. అదే జీవన్ముక్తి.

**క్రియానాశే భవేచ్చింతానాశోఽస్మాద్వాసనాక్షయః**
**వాసనా ప్రక్షయో మోక్షః స జీవన్ముక్తిరిష్యతే॥ 318**

చీకటి మిక్కిలి దట్టమైనదే అయినప్పటికీ అరుణకాంతియందు చక్కగా లయమయిపోతుంది. అట్లే సత్తుకి సంబంధించిన వాసనా స్ఫూర్తి విజృంభిస్తే అహమాది వాసన పూర్తిగా లయమవుతుంది. సూర్యుడు ఉదయిస్తే చీకటి తొలగుతుంది. చీకటిలో చేసే పనులవల్ల కలిగే అనర్థాల సముదాయంకూడా అదృశ్యమవుతుంది. ఆవిధంగానే అద్వయమైన బ్రహ్మానందరసానుభూతి కల్గినప్పుడు సంసారబంధం ఉండదు. దానికి సంబంధించిన దుఃఖలేశం కూడా ఉండదు. రెండూ క్షయమవతాయి.

కర్మబంధం ఉంటున్నప్పటికీ కనబడుతున్న ప్రపంచాన్ని ప్రకృష్టంగా నాశనం చేసుకో. నేను బ్రహ్మని, ఆనందఘనాన్ని అని గాఢంగా విశ్వసించు. బైటా అంతఃకరణంలో కూడా నిగ్రహం పొంది కాలాన్ని గడుపు.

## ప్రమాదం

బ్రహ్మమునందు స్థిరంగా ఉంటున్నప్పుడు ఏనాడూ ఏమరుపాటు పొందకూడదు. మహాత్ముడూ బ్రహ్మమానస పుత్రుడూ అయిన సనత్కుమారుడు ప్రమాదం మృత్యువు అని చెప్పేడు. జ్ఞానికి తనరూపమైన బ్రహ్మానందాన్ని అనుభవించడంలో ప్రమాదంకంటే వేరొక అనర్థం లేదు. ఆ అనర్థంనుండి మోహం, దానినుండి అహంకారం, దానినుండి సంసారబంధం కల్గుతుంది. దానివల్ల దుఃఖం ప్రాప్తిస్తుంది.

అతడు పండితుడే కావచ్చు. విషయాలకి అభిముఖుడై ఉంటే అతణ్ణి బుద్ధియొక్క దోషాలచే మరపు జారుడైన పురుషుణ్ణి స్త్రీవలె విషయానుభవంలో ముంచుతుంది. దట్టమైన నాచు క్షణకాలం కూడా స్థిరంగా ఉండదు. అంతటా వ్యాపిస్తుంది. అట్లే పరబ్రహ్మమునకు పరాఙ్ముఖంగా ఉంటే ప్రాజ్ఞుణ్ణి కూడా మాయ

ఆవరిస్తుంది. లక్ష్యమైన బ్రహ్మము నుండి మనస్సు జారి విషయసుఖాన్ని అనుభవించడంలో ఆసక్తిని పొందితే క్రమంగా ప్రమాదవశాత్తు ఆడుకొనే బంతి చేయిజారి మెట్లమీదనుండి క్రిందకు దొర్లి పడినట్లు అథోగతి పాలవుతుంది. విషయములందు ప్రవేశించిన మనస్సు ఆయా విషయాలకి సంబంధించిన గుణాలనే సంకల్పిస్తూ ఉంటుంది. బాగా సంకల్పించడం చేత ఆ విషయాలని అనుభవించాలన్న కోరిక కల్గుతుంది. ఆ కోరికవల్ల పురుషుడు సంసారంలో ప్రవర్తిస్తూ ఉంటాడు. దానివల్ల తన స్వరూపమైన ఆత్మనుండి దూరమవతాడు. భ్రష్టుడై అథఃపతనాన్ని పొందుతాడు. వాడు వినాశాన్ని పొందడమేగాని తిరిగి బ్రహ్మప్రాప్తికి ప్రయత్నించడు. అందువల్ల అన్నివిధములైన అనర్థాలకి కారణమైన సంకల్పాన్ని తప్పక విడిచిపెట్టాలి. ఆత్మానాత్మ వివేకంగల బ్రహ్మవేత్తకి ప్రమాదంకంటె మృత్యువు మరొకటి లేదు. ప్రమాదమే మృత్యువని తాత్పర్యం. సమాధియందు సమస్తములైన ఇంద్రియ వ్యాపారాలని అరికట్టుకొన్నవాడు సిద్ధిని పొందుతాడు. ఆ కారణంగా ఓ విద్వాంసుడా! మనస్సుని చక్కగా ఆత్మయందు లగ్నంచేసుకొని సావధానుడవైయుండు.

జీవిస్తూ కేవల బ్రహ్మత్వం పొందినవాడు దేహాన్ని విడిచిన తర్వాత కూడా ఆ కేవల బ్రహ్మస్థితినే అనుభవిస్తాడు. బ్రహ్మముకంటె కొంచెమైనా భేదాన్ని అతడు చూస్తే అదే అతనికి భయమవుతుందని యజుర్వేదం "ఏతస్మిన్నుదరమంతరం కురుతే అథ తస్య భయం భవతి, ద్వితీయాద్వై భయం భవతి" అని చెప్తోంది.

**జీవతో యస్య కైవల్యం విదేహే చ స కేవలః**
**యత్ కించిత్ పశ్యతో భేదం భయం బ్రూతే యజుః శ్రుతిః॥ 330**

పండితుడు అనంతమైన పరబ్రహ్మమందు అణుమాత్రంగా అయినా భేదాన్ని ఎప్పుడైనా చూస్తే అదే అతనికి భయమవుతుంది. బ్రహ్మముకంటె భిన్నంగా దేన్నైనా చూడడమే భయం. వందల శ్రుతివాక్యాలచేత యుక్తులచేత నిషేధింపబడ్డ దేహాదిక మందు ఎవడు అదే నేను అనే భావాన్ని పొందుతాడో వాడు కూడని కర్మలాచరించినవాడు. మలినమైన అంతఃకరణంగలవాడు. దుఃఖపరంపరని అనుభవిస్తాడు. పరమాత్మయందు మనస్సుని సంలగ్నం చేసుకోడంలో ఆసక్తిగలవాడు సంసారబంధంనుండి విముక్తుడు అవతాడు. తన స్వరూపమైన బ్రహ్మతత్వాన్ని నిత్యమూ పొందుతాడు. అసత్యమైన దేహాదికమందు మనస్సుని నిల్పుకోడంలో





ఆసక్తిగలవాడు నశిస్తాడు. ఆ భేదం దొంగకానివానియందు, దొంగయందు స్పష్టంగా చూడబడుతున్నట్లే.

ఇంద్రియ సంయమనంగలవాడు సంసారబంధానికి హేతువైన దేహాదికమందు (అసత్తునందు) అదే నేను అనేభావాన్ని విడిచిపెట్టాలి. స్వయంగా ఆ బ్రహ్మమే నేను అనే బ్రహ్మముతో అభిన్నమైన స్థితిని అనుభవిస్తూ ఉండాలి. తాను బ్రహ్మమే అవడంచేత బ్రహ్మనిష్ఠ ఎంతో సుఖాన్ని అనుభవింపజేస్తుంది. కనబడుతున్న సంసారదుఃఖాన్ని ఆ బ్రహ్మనిష్ఠ హరిస్తుంది. మనస్సుని బాహ్యములైన విషయాలపై ప్రసరింపజేయడంవల్ల ఫలంగా అధికమైన దుర్వాసన వృద్ధి పొందుతుంది. కనుక నిత్యానిత్యవస్తు వివేకములచే బాహ్యమైన విషయచింతనని గుర్తించి విడిచిపెట్టాలి. నిత్యం మనస్సుని పరమాత్మతో అనుసంధించుకోవాలి. బాహ్యచింతనని అరికట్టుకోవడంవల్ల మనస్సు ప్రసన్న మవుతుంది. అప్పుడు పరమాత్మ దర్శనం లభిస్తుంది. ఆ పరమాత్మని చక్కగా చూడడంవల్ల భవబంధాలు నశిస్తాయి. బాహ్యవిషయచింతనయొక్క నిరోధం భవబంధముక్తికి స్థానం. సత్ అసత్ వివేకంగలవాడు, వేదవాక్యాలు ప్రమాణంగా గ్రహించినవాడు పరమార్థాన్ని దర్శించినవాడు, ముముక్షువు అయిన ఏ పండితుడు శిశువువలె తన పతనానికి (సంసారప్రాప్తికి) హేతువయిన అసత్ అయిన దేహాదికాన్ని ఆధారంగా ఆశ్రయిస్తాడు? అదే నేను అని ఎలా భావిస్తాడు? దేహాదికాన్ని అజ్ఞాని ఆశ్రయిస్తాడు గాని జ్ఞాని ఎన్నడూ ఆశ్రయించడు.

దేహాదికంతో తాదాత్మ్య బుద్ధిగలవానికి ముక్తిలేదు. సంసారబంధ విముక్తి పొందినవారికి దేహాదికమే నేను అనే భావం ఉండదు. నిద్రలోనున్న వానికి జాగ్రదవస్థ ఉండదు. జాగరణలోనున్నవానికి స్వప్నావస్థ ఉండదు. దానికి కారణం ఆ రెండూ భిన్నగుణాలని ఆశ్రయించియుండడమే.

ఎవడు అంతఃకరణంలోను బాహ్యజగత్తులోను, స్థిరంగాను కదులుతూను ఉండే సమస్త వస్తువులయందు జ్ఞానమయుడై తన్నే (బ్రహ్మమునే) చూసుకొంటూ ఇతరములైన ఉపాధులని అన్నింటినీ విడిచిపెట్టి అఖండం పరిపూర్ణం అయిన పరబ్రహ్మముగా ఉంటాడో అతడు సంసారబంధాల నుండి ముక్తి పొందినవాడు.

అంతర్బహిః స్వం స్థిర జంగమేషు
జ్ఞానాత్మనాధారతయా విలోక్య
త్యక్తాఽఖిలోపాధిరఖండరూపః
పూర్ణాత్మనా యః స్థిత ఏష ముక్తః॥ 339

అన్నివిధాలా సర్వం తానే (పరబ్రహ్మమే) అనే అనుభవంకంటె సంసార బంధ విముక్తికి హేతువు మరొకటి లేదు. సర్వాత్మభావం ఒక్కటే హేతువని తాత్పర్యం. దృశ్యమైన దేహాదికాన్ని గ్రహించకుండా ఉండడంవల్ల ఆ సర్వాత్మభావం లభిస్తుంది. సర్వం బ్రహ్మమే అని భావించడంచే సిద్ధిస్తుందని భావం. మనస్సుని ఆత్మయందే ఎల్లప్పుడు స్థిరంగా నిల్పడంవల్ల సర్వాత్మభావం సాధ్యమౌతుంది.

బాహ్యములైన వస్తువులని అనుభవించడంలో మనస్సుని లీనం చేసుకొని, వానికి అనుగుణమైన కర్మ ఆచరిస్తూ ఈ దేహమే నేను అని దేహాత్మభావంతో ఉన్నవానికి దృశ్యమైన దేహాదికాన్నీ గ్రహించకుండా ఉండడం సాధ్యంకాదు. అజ్ఞానికి దేహాదికాన్ని విడిచిపెట్టడం సాధ్యంకాదని భావం. సమస్త ధర్మాలకీ కర్మలకీ సంబంధించిన విషయాలని విడిచినవారు, నిత్యం ఆత్మనిష్ఠాపరులు, ఆత్మతత్త్వం తెలిసినవారు, ఎల్లప్పుడు ఆత్మానందాన్నే కోరుకొనేవారు మాత్రమే ప్రయత్నించి దృశ్యాన్ని విడిచిపెట్టగలుగుతారు. వారికి మాత్రమే అది సాధ్యమౌతుంది.

## సమాధి

వేదాంతవాక్యాలని శ్రవణం చేస్తున్న సంన్యాసికి "శాంతో దాంత ఉపరతి స్తితిక్షుః సమాహితో భూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యేత్" అని శ్రుతి సమాధిని విధిస్తోంది. శమం దమం ఉపరతి తితిక్షగలవాడు సమాధిలో ఉంటూ తనలో పరమాత్మను దర్శిస్తాడని భావం.

దేహాదికమందు పొందిన బాగా శక్తిమంతమైన ఆత్మభావాన్ని నాశనం చేసుకోడం పండితులకి కూడా సులభంకాదు. నిర్వికల్ప సమాధిలో నిశ్చలంగా నున్నవారికి తప్ప ఇతరులకి ఎవ్వరికీ అది సాధ్యంకాదు. వాసనలు ఎన్నో జన్మల నుండి అంటిపెట్టుకొని ఉంటున్నవికదా.





విక్షేపశక్తి పురుషుణ్ణి ఆవరణశక్తికి చెందిన అహంకారరూపమైన మోహంతో బాగా కలుపుతుంది. అనాత్మయైన దేహాదికమందు ఆత్మభావాన్ని బాగా పెంచుతుందని భావం. అనంతరం దానిగుణాలవల్ల సంసారంలో కూలుస్తుంది. విక్షేపశక్తిని జయించడం ఎంతో కష్టం. ఆవరణశక్తిని నిశ్శేషంగా తొలగించుకొన్నప్పుడు అది సాధ్యమౌతుంది. పాలనీ నీళ్లనీ స్పష్టంగా విడదీసుకొన్నట్లు దృక్కునీ దృశ్యాన్నీ స్పష్టంగా విభజించుకొన్నప్పుడే ఆత్మని ఆవరించియున్న ఆవరణశక్తి తనంతటతానే నశిస్తుంది. దృక్కు అంటే ప్రత్యగాత్మ.

తద్భిన్నంగా అధ్యాసవల్ల గోచరించే దేహాదికం విశ్వం సర్వం దృశ్యం. ఈ రెండింటి విభాగం అనుభవంలోకి వచ్చినప్పుడు ఆవరణశక్తి తానంతటతాను నశిస్తుంది. అలా నశించినప్పుడు మిథ్యావస్తువైన అనాత్మయందు మనస్సుయొక్క ప్రవృత్తి ఉండదు. అప్పుడు ప్రతిబంధరహితమైన ఆత్మవస్తువు నిస్సంశయంగా అనుభవింపబడుతుంది.

స్పష్టమైన జ్ఞానంవల్ల నిర్దుష్టమైన నిత్యానిత్యవస్తువివేకం దృక్కు దృశ్యం అనే పదార్థాల తత్త్వాన్ని విభజిస్తుంది. దానితోపాటు మాయచే కల్పింపబడ్డ మోహబంధాన్ని (దేహాదికమందు ఆత్మభావాన్ని) త్రెంచుతుంది. ఈవిధంగా వివేకంవల్ల బంధవిముక్తి పొందినవానికి తిరిగి సంసారం ప్రాప్తించదు.

సమ్యగ్వివేకః స్ఫుటబోధ జన్యో
విభజ్య దృగ్ దృశ్య పదార్థతత్త్వమ్
భినత్తి మాయాకృత మోహబంధం
యస్మాద్విముక్తస్య పునర్న సంసృతిః॥ 346

పరుడు (ఈశ్వరుడు) అవరుడు (జీవుడు) అభిన్నులని పరావరులకు ఐక్యాన్ని బోధించే జ్ఞానమనే అగ్ని అవిద్య అనే అడవి సమస్తాన్నీ దహిస్తుంది. జీవేశ్వరైక్యరూపమైన అద్వైతానుభవం కల్గినవానికి తిరిగి సంసారానికి బీజం ఉండనే ఉండదు.

స్ఫుటమైన ఆత్మదర్శనంవల్ల (1) ఆవరణశక్తి తొలగుతుంది. (2) మిథ్యాజ్ఞానం (అనిత్యమైన దేహాదికమే నిత్యమనే భావం) నశిస్తుంది. (3) విక్షేపశక్తివల్ల కలిగే దుఃఖం నివర్తింపబడుతుంది. రజ్జువును చూసి సర్పమని భ్రాంతిపడ్డవాడు ఆ

రజ్జువుయొక్క స్వరూపాన్ని స్పష్టంగా తెలుసుకొన్నప్పుడు పై మూడూ కూడా విశదమౌతాయి. రజ్జువుని చూసి మోహంచేత రజ్జువుగా తలపకపోవడంతో ఆవరణశక్తి తొలగుతుంది. దానితోపాటు రజ్జువునందు సర్పజ్ఞానం పొందడంలో కలిగే మిథ్యాజ్ఞానం, అలాగే సర్పభావనలో విక్షేపశక్తివల్ల కలిగే భయకంపాదులు పొందడం కూడా రజ్జువుయొక్క యథార్థరూపాన్ని గ్రహించినప్పుడు తొలగిపోతాయి.

అగ్నియొక్క సంయోగం పొందడంవల్ల జడమైన ఇనుము వివిధ రూపాలు పొంది (భ్రాంతివల్ల) వివిధ నామాలతో వ్యవహరింపబడుతుంది. అలాగే బుద్ధి సత్తు (ప్రత్యగాత్మ) యొక్క సంపర్కం పొంది రూపరసాది మాత్రల రూపంతో విజృంభిస్తుంది. ఆ బుద్ధియొక్క కార్యమే ఆవరణశక్తి, మిథ్యాజ్ఞానం, విక్షేపశక్తి అనే మూడూ. కనుక ఆ మూడూ అసత్యమే. మిథ్యగా పరిగణింపదగ్గవే. రజ్జువునందు సర్ప భ్రాంతిని పొందడం వంటివే. స్వప్నంలో పొందిన విషయానుభవం వంటివే. మనస్సులో వివిధ సంకల్పాలు పొందడం వంటివే. అందుచేత అహంకారంతో ఆరంభించి దేహంవరకుగల విషయాలు అన్నీ సత్త్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతి యొక్క వికారాలే. క్షణంలో మార్పు పొందుతూ ఉంటాయి. అవి ఆత్మగా పరిగణింపదగ్గవి కావు. ఆత్మ పుట్టేది పొందబడేది మార్పు పొందేది కూడా కాదుగదా.

ఆత్మ నిత్యం. అద్వయం అఖండం చిద్రూపం ఏకం బుద్ధి మొదలైనవానికి సాక్షి. సత్ అసత్ అనే రెండింటికీ విలక్షణమైనది. నేను అనే జ్ఞానంచేత తెలుసుకోదగ్గది. ప్రత్యగాత్మరూపం. సదానందఘనం. పరాత్మ. పండితుడు ఈవిధంగా సత్ అసత్ అనేవానిని విడదీసుకొని తనస్వరూపమైన జ్ఞానాన్ని ఆధారంగా చేసుకొని తత్త్వాన్ని నిశ్చయించుకొంటూ తాను అఖండమైన జ్ఞానరూపం ఆత్మస్వరూపం అని తెలుసుకొంటాడు. అనాత్మయైన దేహాదికంనుండి స్వయంగా ముక్తుడై శాంతిని పొందుతాడు.

నిశ్చలమైన సమాధిలో ఉండడంవల్ల అద్వైతానుభవం కల్గినప్పుడు అజ్ఞాన హృదయగ్రంథి నిశ్శేషంగా విడిపోతుంది. పరమాత్మ అద్వితీయం. నిర్విశేషమైనది. నువ్వు నేను ఇది అనే వ్యవహారం కేవలం బుద్ధియొక్క దోషంచే మాత్రమే ఏర్పడుతోంది. ఆత్మతత్త్వాన్ని నిత్యం భావిస్తూ సమాధిలో ఉన్నవానికి సర్వవికల్పాలు నశిస్తాయి.





శమం దమం పరమోపరతి క్షమ కలిగి యతి సమాధిలో ఉంటూ తానే సర్వం అయినట్లు అనుభవిస్తాడు. ఆ సర్వాత్మభావాన్ని అనుభవిస్తూ ఉండడంవల్ల అజ్ఞానాంధకారంనుండి కల్గిన సమస్త వికల్పాలు దహింపబడతాయి. దానివల్ల అతడు నిష్క్రియుడు నిర్వికల్పుడు అయి సుఖంగా ఉంటాడు.

**శాంతోదాంతః పరముపరతః క్షాంతియుక్తః సమాధిం**
**కుర్వన్నిత్యం కలయతి యతిః స్వస్య సర్వాత్మ భావమ్**
**తేనాఽ విద్యాతిమిర జనితాన్ సాధు దగ్ధ్వా వికల్పాన్**
**బ్రహ్మాకృత్యా నివసతి సుఖం నిష్క్రియో నిర్వికల్పః॥ 356**

సమాధిలో ఉంటూ ప్రత్యగాత్మయందు బాహ్యమైన చెవి మొదలైన ఇంద్రియ సముదాయాన్నీ చిత్తాన్నీ నాది నేను అనేవానినీ ఎవరు పూర్తిగా లయం చేసుకొంటారో వారే సంసారబంధ విముక్తులు. వేదాంత పంక్తులు విని అహం బ్రహ్మాఽస్మి అని అనుక్కొనేవారు ముక్తులు కాలేరు.

పరమాత్మ ఏకం అద్వితీయం అయినప్పటికీ వివిధములైన ఉపాధులలో ఉంటూ భిన్నత్వం పొందుతోంది. ఉపాధులు తొలగితే స్వయంగా కేవలస్థితిలో ప్రకాశిస్తుంది. అఖండరూపంతో అనుభవింపబడుతుంది. కనుక విద్వాంసుడు ఉపాధిని లయం చేసుకోడంకోసం నిర్వికల్పసమాధినిష్ఠుడై ఉండాలి. బ్రహ్మమునందు ఏకనిష్ఠతో లీనమైనవాడు బ్రహ్మమే అవతాడు. పురుగు ఎల్లప్పుడు తుమ్మెదనే ధ్యానిస్తూ తుమ్మెద అవుతోందిగదా. అలాగే యోగి పరమాత్మ తత్త్వాన్నే నిత్యం ఏకనిష్ఠతో ధ్యానిస్తూ పరమాత్మతత్త్వాన్ని పొందుతాడు.

పరమాత్మతత్త్వం అత్యంత సూక్ష్మమైనది. శాస్త్రపాండిత్యాదికంచే పొందబడేది కాదు. రాగద్వేషాది రహితమైన (శుద్ధమైన) బుద్ధిగల పండితునిచే నిర్వికల్ప సమాధియందు సూక్ష్మవృత్తిచే మాత్రమే తెలుసుకోదగ్గది. పుటంలో పెట్టబడ్డ బంగారం తనలోని రాగి మొదలైన మలాన్ని కోల్పోయి శుద్ధమవుతుంది. అలాగే మనస్సు ధ్యానంచేత రజస్తమోగుణాలకు చెందిన రాగద్వేషాదిరూపమైన మలాన్ని కోల్పోతుంది. యథార్థతత్త్వాన్ని (బ్రహ్మతత్త్వాన్ని) పొందుతుంది.

నిరంతరం అభ్యాసంవల్ల "అహం బ్రహ్మాస్మి" అని ధ్యానిస్తూ ఆచరణలో

అనుభవిస్తూ ఉండడంవల్ల మనస్సు పక్వమై బ్రహ్మమునందు లయమవుతుంది. అప్పుడు ఆ సమాధి నిర్వికల్పమైనది అవుతుంది. తనదైన అద్వయానందరసాన్ని అనుభవింపజేస్తుంది. అట్టి సమాధిచేత సమస్త వాసనలకి సంబంధించిన గ్రంథి (ముడి) విడుతుంది. అఖిల కర్మలు నశిస్తాయి. లోపల బైటా అంతటా ఎల్లప్పుడు తనరూపమైన ఆనందరసం తనంతట తానే అప్రయత్నంగానే స్ఫురిస్తుంది. అనగా అనుభవింపబడుతుంది.

వేదాంత వాక్యాల శ్రవణంకంటె నూరురెట్లు మననం, ఆ మననంకంటె నిదిధ్యాస లక్షరెట్లు, దానికంటె నిర్వికల్పసమాధి అనంతంగాను విశిష్టమైనది.

శ్రుతేః శతగుణం విద్యాన్మననం మననాదపి
నిదిధ్యాసం లక్షగుణమనంతం నిర్వికల్పకమ్॥ 365

నిర్వికల్ప సమాధిచేత బ్రహ్మాత్వం స్ఫుటంగా పొందబడుతుంది. బ్రహ్మతత్త్వ ప్రాప్తికి నిర్వికల్పసమాధి తప్ప మరొకమార్గం లేదు. మనోగతి చంచలమైనది. ఇతరములైన అనాత్మవస్తువుల జ్ఞానంతో బాగా కలిసిపోతుంది. కాగా ఇంద్రియాలని నిగ్రహించుకొన్నవాడవై ఎల్లప్పుడు నిరంతరం విషయవాసనల (రాగద్వేషాదుల) నుండి శాంతించిన మనస్సుగలవాడవై ప్రత్యగాత్మయందు మనస్సుని నిల్పి స్థిరంగా ఉంచు. కేవలం బ్రహ్మమునే దర్శిస్తూ అనాదియైన అవిద్యచే గలిగిన అంధకారాన్ని ధ్వంసం చేసుకో.

## యోగ సాధనాలు

మౌనం అపరిగ్రహం (దేన్నీ దానంగా పుచ్చుకోకుండా ఉండడం) ఆశలు కోరికలు లేకుండా ఉండడం నిత్యం ఏకాంతంగా ఉండడాన్ని అలవాటు చేసుకోడం అనేవి చిత్తవృత్తి నిరోధానికి (యోగానికి) ప్రథమద్వారం.

ఏకాంతంగా ఉండడం ఇంద్రియాలు తమతమ పనులు చేయకుండా ఉండడానికి హేతువు. చిత్తనిరోధానికి దమం సాధనం. అహంకారరూపమైన వాసన శమంచేత పోతుంది. వాసన పోవడంవల్ల స్థిరంగా బ్రహ్మానందరసానుభవం కల్గుతుంది. ఆ కారణంవల్ల యోగియైన ముని ఎల్లప్పుడు తప్పక ప్రయత్నించి చిత్తనిరోధం ఆచరించాలి.





ఏకాంత స్థితిరింద్రియోపరమణే హేతుర్దమశ్చేతసః
సంరోధే కరణం శమేన విలయం యాయాదహం వాసనా
తేనానందరసానుభూతిరచలా బ్రాహ్మీ సదా యోగినః
తస్మాచ్చిత్త నిరోధ ఏవ సతతం కార్యం ప్రయత్నాన్మునేః॥ 369

వాక్కుని మనస్సులో లయం చేసుకో. మనస్సుని బుద్ధియందు, ఆ బుద్ధిని బుద్ధికి సాక్షియైన చైతన్యమందు (కూటస్థమైన ఆత్మయందు), దాన్ని నిర్వికల్పసమాధిలో పరమాత్మయందు పూర్తిగా లయం చేసుకొని పరమశాంతిని పొందు. దేహం ప్రాణాలు ఇంద్రియాలు మనస్సు బుద్ధి మొదలైన ఉపాధులయొక్క వృత్తులతో మనస్సు బాగా కలిస్తే యోగికి ఆయా ఉపాధులకు చెందిన భావాలు కల్గుతాయి. ఆ కారణంగా మునియైనవాడు మనస్సుని ఆయా ఉపాధుల వృత్తులతో కలియకుండా నిరోధించుకోవాలి. ఆవిధమైన నివృత్తిచేత చక్కగా సర్వవిషయాల ఉపశాంతికి చెందిన సుఖం లభిస్తుంది. అప్పుడతడు బ్రహ్మానందరసానుభవంలో ఎప్పుడూ మునుగుతూ తేలుతూ ఉంటాడు. శుద్ధమైన వైరాగ్యం గలవానికి మాత్రమే అంతరింద్రియ బహిరింద్రియ వ్యాపారాలని విడిచిపెట్టడం శక్యమవుతుంది. మోక్షప్రాప్తికి విరక్తుడే అంతరింద్రియ బహిరింద్రియ సంపర్కాన్ని విడిచిపెడ్తాడు. బ్రహ్మమందు స్థిరంగా ఉన్న విరక్తుడు మాత్రమే బాహిరములైన విషయములతోను, ఆంతరములైన అహమాదులతోను అనుబంధాన్ని విడిచిపెట్టడానికి సమర్థుడు.

ఓ వివేకీ! మోక్షసౌధం అగ్రభాగాన్ని ఎక్కడానికి పక్షికి రెండు రెక్కలువంటివి ముముక్షువుకి వైరాగ్యం జ్ఞానం అనే రెండు మార్గాలు అని బాగా తెలుసుకో. ఆ రెండూ తప్ప మరొక మార్గంచే మోక్షసౌధాగ్రభాగాన్ని చేరడం సాధ్యపడదు. పరిపూర్ణమైన వైరాగ్యంగలవానికి నిర్వికల్ప సమాధి కల్గుతుంది. దాన్ని పొందినవానికే దృఢమైన జ్ఞానం కల్గుతుంది. ఆత్మతత్త్వం బాగా తెలిసినవానికే సంసారబంధం నుండి ముక్తి లభిస్తుంది. అట్టి ముక్తునికే నిత్యమైన సుఖం ప్రాప్తిస్తుంది. బ్రహ్మానుభూతి లభిస్తుందని తాత్పర్యం.

యోగికి వైరాగ్యంకంటె సుఖాన్ని కల్గించేది మరొకటి లేదు. ఆ వైరాగ్యం శుద్ధమైన ఆత్మజ్ఞానంతో కూడుకొని ఉన్నప్పుడు స్వస్వరూపమైన ఆనందసామ్రాజ్యాన్ని అనుభవింపజేస్తుంది. అది నిత్యముక్తికాంతాప్రాప్తికి ద్వారం. కాబట్టి మోక్షంకోసం

అంతటా ఏమాత్రమూ స్పృహ పొందకుండా ఎల్లప్పుడూ పరబ్రహ్మమునకు సంబంధించిన స్పృహను పొందు.

విషతుల్యములైన రూపరసాది విషయములందు ఆశని త్రెంచుకో. అది మృత్యువుని కల్గిస్తుంది. ఇది నా జాతి. ఇది నా కులం. బ్రహ్మచర్యాది ఆశ్రమాలలో ఇది నా ఆశ్రమం అనే అభిమానాన్ని విడిచిపెట్టు. వానికి చెందిన కర్మలని దూరంగా విడిచిపెట్టు. అసత్తు అయిన దేహాదికమందు ఆత్మబుద్ధిని (అది నేనే అనే భావాన్ని) పొందకు. ప్రత్యగాత్మయందు ప్రజ్ఞను చూపించు. నువ్వు ద్రష్టవి. నిర్మలుడివి. స్వభావంచే అద్వితీయ పరబ్రహ్మవి.

**ఆశాం ఛింది విషోపమేషు విషయేష్వేషైవ మృత్యోః సృతిః**
**త్యక్త్వా జాతి కులాశ్రమేష్వభిమతిం ముంచాతి దూరాత్క్రియాః**
**దేహాదావసతి త్యజాత్మ ధిషణాం ప్రజ్ఞాం కురుష్వాత్మని**
**త్వం ద్రష్టాస్యమలోఽసి నిర్ద్వయ పరం బ్రహ్మాసి యద్వస్తుతః॥** 378

లక్ష్యమైన పరబ్రహ్మమందు మనస్సుని స్థిరంగా నిల్పుకో. కర్మేంద్రియాలనీ జ్ఞానేంద్రియాలనీ తమతమ స్థానాలలో నిల్పుకో. శరీరాన్ని నిశ్చలంగా ఉంచుకో. దేహస్థితిని ఉపేక్షించు. బ్రహ్మాత్మైక్యాన్ని పొందు. బ్రహ్మమయుడవై అఖండమైన మనోవృత్తితో ఎల్లప్పుడు మనస్సులో బ్రహ్మానందరసాన్ని తృప్తిగా త్రాగు. శూన్యములైన ఇతర భ్రమలవల్ల నీకు ఏమి ప్రయోజనం చేకూరుతుంది?

**లక్ష్యే బ్రహ్మణి మానసం దృఢతరం సంస్థాప్య బాహ్యేంద్రియం**
**స్వస్థానే వినివేశ్య నిశ్చల తనుశ్చోపేక్ష్య దేహ స్థితిమ్**
**బ్రహ్మాత్మైక్యముపేత్య తన్మయతయా చాఖండవృత్త్యానిశం**
**బ్రహ్మానందరసం పిబాత్మని ముదా శూన్యైః కిమన్యైర్భ్రమైః॥** 379

అనాత్మ వస్తువుని చింతించడం కశ్మలం. దుఃఖకారణం. ముక్తికి కారణమైన ఆనందరూపమైన ప్రత్యగాత్మని ఎప్పుడూ చింతించు. ఆ ప్రత్యగాత్మ స్వయం ప్రకాశకం. ఇంద్రియాలు మొదలైన సమస్తానికీ సాక్షి. విజ్ఞానమయకోశంలో ఎప్పుడూ వెలుగుతూ ఉంటుంది. అసత్తుకంటె విలక్షణమైనది. సద్రూపమైన ఆ ప్రత్యగాత్మని అఖండమైన





మనస్సు యొక్క వృత్తిలో నిల్పుకొని అదే స్వరూపమని భావించు. బ్రహ్మముకంటె మరొకవస్తువు ఉన్నదనే జ్ఞానాన్ని పొందకుండా ఆ పరమాత్మనే ధ్యానిస్తూ అదే నీ రూపమని స్పష్టంగా తెలుసుకో. ప్రత్యగాత్మయే నేను అనే భావాన్ని గట్టిపరుచుకొని అహంకారాదులందు ఆత్మభావాన్ని విడిచిపెట్టు. అహంకారం మొదలైనవి ఘటం పటం (బట్ట) వంటివి. వానియందు ఉదాసీనతను పొందు.

సర్వసాక్షిగా జ్ఞానస్వరూపంగా ఉండే నీ స్వరూపమందు (ప్రత్యగాత్మయందు) రాగద్వేషాదులు అనే మలంలేని శుద్ధమైన అంతఃకరణమును లయం చేసి నెమ్మదిగా నెమ్మదిగా నిశ్చలత్వం పొందుతూ ఆ పిమ్మట అఖండమైన పరబ్రహ్మమును అనుభవించాలి. నీ అజ్ఞానంచే కల్పింపబడ్డ దేహం ఇంద్రియాలు ప్రాణం మనస్సు అహంకారం మొదలైన ఉపాధులనుండి విడువడిన అఖండం పరిపూర్ణం అయి ఆకాశంవలె ఉండే పరమాత్మను దర్శించు.

ఘటం కలశం కుసూలం (పాతక) సూది మొదలైన వందల ఉపాధులలో ఆకాశం ఉంటున్నప్పటికీ అది ఆ ఉపాధుల నుండి విడిపోయి వేరుగానే ఉంటుంది. అద్వితీయంగానే ఉంటుంది. ఆకాశానికి బహువిధాలుగా ఉండే స్థితి లేదు. అట్టి ఆకాశంవలెనే శుద్ధం పరం అహమాదులనుండి వేరయినది అయిన ప్రత్యగాత్మ కూడా అద్వితీయమే. బ్రహ్మనుండి స్తంబ (గడ్డిపోచ) పర్యంతం ఉన్న ఉపాధులన్నీ అసత్యమైనవే. కనుక ఏకం అఖండం నీ స్వరూపం అయిన పరమాత్మని తప్పక చూడవలసిందే.

ఈ విశ్వం పరమాత్మయందు భ్రాంతిచే మాత్రమే కల్పింపబడింది. వివేకం కలిగితే భ్రాంతి తొలగుతుంది. విశ్వం ఆ రూపంలో గాక బ్రహ్మముగానే భాసిస్తుంది. భ్రాంతిచే మాత్రమే త్రాడు సర్పంగా కనబడుతుంది. భ్రాంతి తొలగితే సర్పత్వం నశిస్తుంది. ఆ వస్తువు రజ్జువుగానే తెలియబడుతుంది. నిత్యానిత్య వస్తువివేకం కల్గినప్పుడు అంతా బ్రహ్మముగానే అనుభవింపడుతుంది. భ్రాంతివల్ల కలిగే విశ్వం కూడా బ్రహ్మముగానే స్పష్టమవుతుంది. బ్రహ్మాభిన్నంగానే దర్శింపబడుతుంది. భ్రాంతి తొలగితే బ్రహ్మ విష్ణువు ఇంద్రుడు శివుడు ఈ విశ్వం సర్వం కూడా నీవే అవుతావు. అంటే పరబ్రహ్మమే. నీకంటె వేరుగా కొంచెం కూడా ఏదీలేదు. సర్వం పరబ్రహ్మమే.

ఈ విశ్వంలో లోపల బైట ముందు వెనక పశ్చిమంలోను ఉత్తరంలోను మీదా క్రిందా అంతటా ఉన్నది నీవే. పరమాత్మయే. నీటిలోనున్న కెరటాలు నురుగ సుళ్లు బుడగలు మొదలైనవి అన్నీ జలమేగదా. అలాగే దేహంతో ఆరంభించి అహంకారంవరకు గల సర్వమూ చిత్తే. విశుద్ధం అద్వితీయం అయిన బ్రహ్మమే. వాక్కుతోను మనస్సుతోను తెలియబడుతున్న ఈ సర్వమూ సత్తే. మాయాస్వరూపిణియైన ప్రకృతియొక్క పరిధిలోనున్న ప్రతి వస్తువూ సత్తే. సత్తుకంటె భిన్నమైనది ఏదీలేదు. కలశం ఘటం కుంభం మొదలైన వ్యవహారం కల్గినది మట్టికంటె వేరుగా ఏదైనా ఉన్నదా? లేదుగదా. అంతా మట్టియేగదా. మాయ అనే కల్లుచే మత్తెక్కినవాడు నేను అని పలుకుతూ ఉంటాడు.

క్రియలని కూరుస్తూ "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా" అని శ్రుతి ద్వైతం లేదని భ్రాంతివల్ల కల్గిన అధ్యాసని పోగొట్టుకోడం చెప్తోంది. దేనియందు మరియొకదానిని చూడడో వినడో తెలుసుకోడో అది భూమ (పరమాత్మ) అని భావం. పరమాత్మకంటె వేరుగా మరొకటి లేదని తాత్పర్యం.

పరబ్రహ్మము ఆకాశంవలె నిర్మలమైనది. నిర్వికల్పమైనది. హద్దులు లేనిది. ఏమాత్రంకూడా కదలిక లేనిది. మార్పుపొందనిది. లోపలా బైటా శూన్యమైనది. అనన్యమైనది. అద్వయమైనది. అట్టి పరబ్రహ్మమే నీవు. ఇంతకంటె తెలుసుకోదగ్గది ఉన్నదా? ఇంతకంటె పరమాత్మనుద్దేశించి చెప్పవలసింది ఇక్కడ ఎక్కువగా ఏమి ఉన్నది? జీవుడు స్వయంగా బ్రహ్మమే. పరమాణువు నుండి ఈ జగత్తు వరకు గల సర్వమూ బ్రహ్మమే. బ్రహ్మము అద్వితీయమని కూడా శ్రుతి చెప్తోంది. "అహం బ్రహ్మాస్మి" (నేను బ్రహ్మమును) అనే అనుభవంగల జ్ఞానులు బాహ్యవిషయాలు పూర్తిగా విడిచిపెడ్తారు. స్పష్టంగా బ్రహ్మత్వం పొంది ఎల్లప్పుడు చిదానందస్వరూపులై ఉంటారు. ఇది నిశ్చయం.

వక్తవ్యం కిము విద్యతేఽత్ర బహుధా బ్రహ్మైవ జీవః స్వయం
బ్రహ్మైతజ్జగదాపరాణు సకలం బ్రహ్మాద్వితీయం శ్రుతేః
బ్రహ్మైవాహమితి ప్రబుద్ధమతయః సంత్యక్త బాహ్యాః స్ఫుటం
బ్రహ్మీభూయ వసంతి సంతత చిదానందాత్మనైవ ధ్రువమ్॥ 395





మలమయమైన స్థూలదేహమందు ఆ పిమ్మట ప్రాణమయమైన లింగదేహమందు అహంకారంవల్ల కల్గిన ఆశని విడిచిపెట్టు. వేదములందు వర్ణింపబడినది, నిత్యమైనది, ఆనందస్వరూపమైనది అయిన ప్రత్యగాత్మయే నేను అని తెలుసుకొని బ్రహ్మమై ఉండు. శవరూపమైన ఈ శరీరమే నేను అని ఎంతకాలం భావిస్తాడో ఆ వ్యక్తి అంతకాలం అపవిత్రుడు. ఇతరులనుండి క్లేశం పొందుతాడు. జననం మరణం వ్యాధి నరకంకూడా అతనికి ప్రాప్తిస్తాయి. తాను శుద్ధం అచలం పరమేశ్వర స్వరూపం అని ఎవడు భావిస్తాడో అప్పుడు అతడు వానినుండి ముక్తుడవతాడు. శ్రుతి ఆవిధంగానే చెప్పింది. తనయందు (ఆత్మయందు) ఆభాసచే ఆరోపింపబడ్డ వస్తువుని తిరస్కరించడంవల్ల స్వయంగా పరిపూర్ణం అద్వితీయం అక్రియం అయిన పరబ్రహ్మము తానే అనే అనుభూతి కల్గుతుంది.

నిర్వికల్ప పరబ్రహ్మమందు చిత్తవృత్తి లయం కాగా దేహాదికం విశ్వం ఏదీ గోచరించదు. సర్వం బ్రహ్మముగానే భాసిస్తుంది. ఆపిమ్మట వికల్పం అన్నది మాటమాత్రంగానే మిగులుతుంది. ఏకం అద్వితీయంగా ఉండే బ్రహ్మమందు విశ్వం అన్నది కేవలం అసత్యకల్పనమే. నిర్వికారం నిరాకారం నిర్విశేషం అయిన పరమాత్మయందు భేదం ఎక్కడనుండి కల్గుతుంది? ద్రష్ట దర్శనం దృశ్యం మొదలైనవి ఏవీలేని అద్వితీయం నిర్వికారం నిరాకారం నిర్విశేషం అయిన బ్రహ్మమునందు భేదం ఎక్కడనుండి వచ్చింది?

కల్పాంతంలోని సముద్రంవలె పరిపూర్ణమైనది ఏకం నిర్వికారం నిరాకారం నిర్విశేషం అయిన పరమాత్మయందు భేదం ఎక్కడ నుండి వచ్చింది? చీకటి వెలుగులో లయమైనట్లు భ్రాంతికి కారణమైన అజ్ఞానం దేనిలో లయమవుతోందో ఆ అద్వితీయ పరతత్త్వమందు భేదం ఎక్కడి నుంచి వచ్చింది? ఏకంగా ఉండే పరతత్త్వమందు భేదవార్త ఎలా సంభవిస్తుంది? సుఖం మాత్రమే కల్గిన సుషుప్తిదశలో భేదం ఎవరైనా చూస్తున్నారా? బ్రహ్మజ్ఞానం కల్గడంవల్ల సత్‌రూపమైన నిర్వికల్ప బ్రహ్మమందు విశ్వం ఉండనే ఉండదు. మూడు కాలాలలో కూడా త్రాడునందు సర్పం కనబడదుగదా. ఎండమావియందు ఒక్క జలబిందువు కూడా ఉండదుగదా. ఈ ద్వైతం మాయామాత్రమే, పరమార్థంగా ఉన్నది అద్వైతమే అని శ్రుతి చెప్తోంది. సుషుప్తిదశలో అద్వైతమే అనుభవింపబడుతోంది. అధిష్ఠానమైన బ్రహ్మమునందు ఆరోపింపబడ్డ విశ్వాదికం బ్రహ్మముకంటె వేరుగా (కేవలశాస్త్ర) పండితులచే

చూపబడుతోంది. అది యథార్థం కాదు. రజ్జువునందు పాము, ఎండమావియందు నీరు, ముత్యపుచిప్పయందు వెండి భ్రాంతివల్ల కల్గినదేగదా. ఈ వికల్పం చిత్తంవల్లనే కల్గుతోంది. చిత్తం లేకపోతే కల్గనే కల్గదు. కాబట్టి ప్రత్యగాత్మ రూపమైన పరమాత్మయందు చిత్తాన్ని స్థిరంగా నిల్పుకో.

పండితుడు సమాధియందు హృదయంలో పరిపూర్ణమైన పరబ్రహ్మమును దర్శిస్తాడు. ఆ పరమాత్మ ఎల్లప్పుడు జ్ఞానస్వరూపమైనది. కేవలం ఆనందరూపం. నిరుపమం. హద్దులు లేనిది. నిత్యముక్తం. నిరీహం (ఏ కోరికలు లేనిది) అవధులు లేనిది. ఆకాశంవంటిది. నిష్కలం. నిర్వికల్పం. ప్రకృతి వికృతి శూన్యం. భావనకు అతీతం. సమరసం. అసదృశం. మనోవృత్తికి సంబంధించిన అనుభవవిశేషం. సమస్త బంధాలకీ దూరమైనది. శ్రుతివాక్యాలచే సిద్ధమైనది. నిత్యం నేను నేను అని అనుక్కొనేది. ముసలితనం మరణం లేనిది. వికల్పములు తొలగగా కనిపించే వస్తుస్వరూపం. నిశ్చలంగా ఉండే జలరాశిగా చెప్పదగ్గది. నామరహితం. సత్త్వరజస్తమోగుణాల వికారం శాంతింపగా భాసించేది. శాశ్వతం శాంతం అద్వితీయం అయినది.

నీ స్వరూపమైన పరమాత్మయందు అంతఃకరణాన్ని నిల్పుకొని అఖండ వైభవంగల పరమాత్మను దర్శించు. సంసారదుర్వాసనలతో కూడిన బంధాన్ని ప్రయత్నించి త్రెంచుకో. నీ పురుష జన్మని సార్థకం చేసుకో. సర్వ ఉపాధుల నుండి చక్కగా ముక్తం, అద్వయం అయిన సచ్చిదానందాన్ని నీ హృదయమందున్న దాన్ని నిత్యం ధ్యానించు. అప్పుడు మళ్లీ సంసారమార్గంలో పడవు.

పురుషునికి శరీరం నీడవలె అనుసరిస్తూ కనబడుతుంది. అది ఆభాసమాత్రమే. సత్యమైనది కాదు. కర్మఫలానుభవంకోసం ఆ శరీరం ఏర్పడుతుంది. పండితుడు (జ్ఞాని) అట్టి శరీరాన్ని దూరంగా శవాన్ని ఉంచినట్లు ఉంచుతాడు. తిరిగి గ్రహింపడు. నిత్యం శుద్ధం జ్ఞానానందరూపం అయిన పరమాత్మను పొంది జడం మలరూపం అయిన ఈ ఉపాధిని (శరీరాన్ని) చాల దూరంగా విడిచిపెట్టు. తిరిగి ఎన్నడూ స్మరింపకు. అది వాంతి చేసిన వస్తువు వంటిది. జుగుప్సను కల్గించేది. ఉత్తమజ్ఞాని దాన్ని సమూలంగా పూర్వజన్మ వాసనలతో కూడా నిర్వికల్ప పరబ్రహ్మమనే అగ్నియందు ఎల్లప్పుడు పూర్తిగా దగ్ధం చేసుకొంటాడు. ఆ పిమ్మట స్వయంగా తనదైన శుద్ధ





జ్ఞానానంద స్వరూపంలో ఉంటాడు. బ్రహ్మైక్యాన్ని పొందుతాడని భావం. గోవు మెడలోని పూలమాల తనవెంట వస్తోందోలేదో చూసుకోలేదు. అలాగే ఆనందస్వరూపమైన పరబ్రహ్మమందు లీనమైన చిత్తవృత్తులు గల తత్త్వవేత్త ప్రారబ్ధకర్మ అనే త్రాడుతో కూర్పబడ్డ ఈ శరీరం తనవెంట వస్తోందో లేదో తిరిగి చూడడు. అఖండం ఆనందరూపం అయిన ఆత్మయే తన స్వరూపమని బాగా తెలుసుకొన్ని తర్వాత ఇది కావాలి అని దేన్ని కోరుకొంటాడు? ఈ దేహాన్ని దేనికోసం పెంచుకొంటాడు? సిద్ధిపొంది జీవన్ముక్తుడైన యోగియొక్క ఫలం మనస్సు లోపలా బైటా కూడా ఎల్లప్పుడూ ఆనందరసాన్ని ఆస్వాదించడమే.

వైరాగ్యంయొక్క ఫలం జ్ఞానం. జ్ఞానం యొక్క ఫలం ఉపరతి. తన స్వరూపమైన ఆనందాన్ని అనుభవించడంవల్ల కలిగే శాంతి ఉపరతియొక్క ఫలం. వీనిలో ఉత్తరోత్తరం కల్గకపోతే ముందున్నవి నిష్ఫలమవతాయి. జ్ఞానం కల్గకపోతే వైరాగ్యం, ఉపరతి కల్గకపోతే జ్ఞానం, ఆత్మానుభూతివల్ల శాంతి కల్గకపోతే ఉపరతి నిష్ఫలం అని తాత్పర్యం. విషయానుభవంనుండి నివృత్తి కల్గినప్పుడు పరమతృప్తి లభిస్తుంది. అది తానయిన అనుపమానందం.

అనుభవిస్తున్న దుఃఖాలకి ఉద్వేగం పొందకపోవడం ఆత్మతత్త్వ జ్ఞానంయొక్క ప్రస్తుతఫలం. అజ్ఞానం ఆవరించినప్పుడు జుగుప్స కలిగించే నానావిధములైన కర్మ ఆచరింపబడుతుంది. వివేకం కల్గిన తర్వాత జ్ఞాని అటువంటి కర్మని ఎందుకాచరిస్తాడు? జ్ఞానంయొక్క ఫలం అసత్తునుండి నివృత్తి పొందడం. ప్రవృత్తి పొందడం అజ్ఞానంయొక్క ఫలం. ఎండమావి మొదలైన వానియందు జ్ఞాని అజ్ఞాని అనే వారియందు గల భేదం స్పష్టంగా చూడబడుతోంది. జ్ఞాని అసత్తు అని ఎండమావియందు నివృత్తి పొందుతాడు. జ్ఞానికి అసత్తునుండి నివృత్తి కలిగించే జ్ఞానంకంటె కనబడే ఫలం ఇంకేముంది? అజ్ఞాని ఆ ఎండమావి సత్యమైనదని ప్రవృత్తిని పొందుతాడు. నిశ్శేషంగా అజ్ఞానగ్రంథి నాశనమైనప్పుడు ఏ కోరికలు లేనివానికి కోరదగ్గది ఏముంటుంది? స్వయంగా సంసార ప్రవృత్తికి అతనికి ఏది కారణమవుతుంది?

అనుభవింపదగ్గ వస్తువునందు వాసన కల్గకపోవడం జ్ఞానంయొక్క పరమావధి. పరమాత్మయందు లయమైన చిత్తవృత్తులు గల యోగియొక్క ఉపరతికి మళ్లీ చిత్తవృత్తి కల్గకపోవడమే పరమావధి.

## బ్రహ్మజ్ఞాని

బ్రహ్మజ్ఞాని అరుదుగా ఉంటాడు. అనంతమైన పుణ్యఫలాన్ని అనుభవిస్తూ ఉంటాడు. ఎప్పుడూ బ్రహ్మస్వరూపుడై ఉండడంచేత బాహ్యవస్తువుల జ్ఞానాన్ని పూర్తిగా విడిచిపెడ్తాడు. అతనికి బ్రహ్మానుభవం తప్ప మరొక వస్తువుయొక్క అనుభవం ఉండదు. ఎప్పుడూ నిద్రపోయే స్వభావంగలవానివలె, బాలునివలె ప్రవర్తిస్తూ దృశ్యమైన జగత్తు సర్వం స్వప్నంలో చూసినదానివంటిదే అని తలుస్తాడు. అటువంటి మహాత్ముడు లోకంలో మాన్యుడు.

**బ్రహ్మాకారతయా సదా స్థితతయా నిర్ముక్త బాహ్యార్థధీ**
**రన్యావేదిత భోగ్య భోగకలనో నిద్రాలువద్బాలవత్**
**స్వప్నాఽఽలోకితలోకవజ్జగదిదం పశ్యన్ క్వచిల్లబ్ధధీ**
**రాస్తే కశ్చిదనంత పుణ్య ఫలభుగ్ధన్యః స మాన్యో భువి॥ 426**

బ్రహ్మమునందు మనస్సుని లయంచేసుకొని నిర్వికారుడై నిష్క్రియుడై ఎప్పుడూ ఆనందాన్ని అనుభవించే స్థితప్రజ్ఞుడు యతి.

## జీవన్ముక్తుడు

ఎవని చిత్తప్రవృత్తి జీవబ్రహ్మల ఐక్యభావమందు మునిగియుంటుందో నిర్వికల్పంగా చిన్మాత్రంగా ఉంటుందో అది ప్రజ్ఞ అని చెప్పబడుతుంది. ఎల్లప్పుడు దాన్ని పొందేవాడు జీవన్ముక్తుడు.

**బ్రహ్మాత్మనోః శోధితయోరేక భావావగాహినీ**
**నిర్వికల్పా చ చిన్మాత్రా వృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే**
**సా సర్వదా భవేద్యస్య స జీవన్ముక్త ఇష్యతే॥ 428**

ఎవనియందు ప్రజ్ఞ స్థిరంగా ఉంటుందో ఎవడు నిరంతరమైన ఆనందాన్ని





అనుభవిస్తూ ఉంటాడో, ఎవనికి ప్రపంచం విస్మరింపదగ్గదో అతడు జీవన్ముక్తుడని చెప్పదగ్గవాడు. జాగ్రదవస్థలోని విషయానుభవాలని అన్నింటిని విడిచినవాడై, బుద్ధిని ప్రత్యగాత్మయందు లయం చేసుకొన్నవాడై ఉన్నప్పటికీ ఎవడు మెలకువతో ఉంటాడో, ఎవని జ్ఞానం వాసనలు లేనిదై ఉంటుందో అతడు జీవన్ముక్తుడు. అతడు శాంతించిన సంసారంగలవాడు. పాండిత్యం ఉన్నప్పటికీ అతడు పాండిత్యం లేనివాడే. చిత్తాన్ని కల్గియున్నప్పటికీ లేనివాడు. చిత్తవ్యాపారరహితుడని భావం.

నీడవలె అనుసరిస్తూ దేహం ఉన్నప్పటికీ అహంకారం మమకారం లేకపోవడం జీవన్ముక్తుని లక్షణం.

**వర్తమానేఽపి దేహేఽస్మిన్ ఛాయావదనువర్తిని**
**అహంతా మమతాఽభావో జీవన్ముక్తస్య లక్షణమ్॥ 432**

జీవన్ముక్తుడు జరిగినవానితో సంబంధాన్ని విడిచిపెడ్తాడు. భవిష్యత్తుని తలంపడు. తనకు ప్రాప్తించిన దానికి ఉదాసీనత పొందుతాడు. స్వభావంచే ఆత్మకంటె విలక్షణం, గుణదోష విశిష్టం అయిన ఈ విశ్వంలో అంతటా పరమాత్మనే దర్శిస్తాడు. ఇష్టమైనది లభించినా అనిష్టమైనది ప్రాప్తించినా మనస్సులో రెండింటినీ సమానంగా చూసుకొంటాడు. ఆ రెండింటి విషయంలో పొంగిపోవడం, క్రుంగిపోవడం లేకుండా ఒకే స్థితిలో ఉంటాడు. యతియొక్క మనస్సు బ్రహ్మానందరసాన్ని ఆస్వాదించడంలో లీనమైయుంటుంది. ఆంతరములు బాహిరములు అయిన విషయముల జ్ఞానం అతనికి ఏమాత్రమూ ఉండదు. అది జీవన్ముక్తుని స్వభావం. దేహం ఇంద్రియాలు మొదలైనవానియందు, చేయదగ్గ కర్మయందు నాది నేను అనే భావాలు విడిచి అతడు ఉదాసీనంగా ఉంటాడు.

శ్రుతి ప్రమాణంవల్ల జీవుడు బ్రహ్మమే అని తెలుసుకొన్నవాడు, భవ బంధాలనుండి విముక్తుడు. జీవన్ముక్తుడు. దేహమందు ఇంద్రియములందు నేనే అనే భావాన్నీ అలాగే ఇతరమైన సమస్తమైన వానియందు ఇది అనే భావాన్నీ అతడు ఎప్పుడూ పొందడు. ప్రజ్ఞచేత ప్రత్యగాత్మకీ బ్రహ్మమునకూ, అలాగే బ్రహ్మమునకు విశ్వానికీ ఎప్పుడు భేదంలేదని తెలుసుకొంటాడు. సాధుజనులచే పూజింప బడుతున్నప్పుడూ దుర్జనులచే పీడింపబడుతున్నప్పుడూ అతడు సమభావంతో ఉంటాడు. నదీ ప్రవాహాలు సముద్రంలో ప్రవేశించి లీనమైనట్లు ఇతరముచే

ప్రేరేపింపబడి విషయాలు అతనియందు చేరి లయమవతాయి. అవి బ్రహ్మమాత్రంగా ఉండడంచేత అతనికి వికారాలు కలిగింపవు. అట్టి యతి జీవన్ముక్తుడు.

బ్రహ్మవేత్తకి యథాపూర్వం సంసారం ఉండదు. ఒకవేళ అతనికి సంసారానుభవంగాని ఉంటే అతడు బ్రహ్మతత్త్వం తెలిసినవాడుకాదు. బ్రహ్మ భావానుభవంగలవాడు బాహిరములైన విషయాలకి ఎన్నడూ అభిముఖుడు కాదు. ప్రాచీన జన్మవాసనలచే అతడు సంసారంలో ప్రవర్తిస్తున్నాడు అని అనడం కూడా సమంజసం కాదు. అతని వాసన బ్రహ్మైక్యాన్ని కల్గించే విజ్ఞానంచేత మందమవుతుంది. అత్యంత కాముకుడే అయినప్పటికీ తల్లి విషయంలో అతని కామప్రవృత్తి కలగని విధంగా పూర్ణానందస్వరూపమైన బ్రహ్మము అనుభవంలోకి వస్తే జ్ఞానియొక్క వాసన క్షీణిస్తుంది. నిర్వికల్ప సమాధిలో ఉన్నవానికి ఒకప్పుడు బాహ్యవిషయ జ్ఞానం ఉండవచ్చును. అట్టివాని విషయంలో ప్రారబ్ధకర్మ అనుభవింపబడుతుందనే శ్రుతివాక్యం ప్రమాణమవుతుంది. సుఖాదుల అనుభవం ఉన్నంతవరకు ప్రారబ్ధకర్మ ఉన్నట్లే. ఫలం లభించిందంటే అంతకుముందు కర్మ ఆచరింపబడియుండాలి. కర్మ చేయనివాడు ఎక్కడా ఉండడుగదా. మెలకువ కల్గినప్పుడు స్వప్నంలోని కర్మ సమస్తమూ నశిస్తుంది. అలాగే నేను బ్రహ్మము అనే విజ్ఞానంవల్ల కోట్ల జన్మల నుండి వస్తున్న సంచితకర్మ సర్వం లయమవుతుంది.

కలలో చేసిన గొప్ప పుణ్య పాపకర్మలు మెలకువ రాగానే స్వర్గాన్నో నరకాన్నో ఈయవు. తాను అసంగుడు. ఆత్మస్వరూపుడు అని తెలుసుకొని యతి ఏనాడూ కొంచెం కూడా భావికర్మలతో ఆకాశంవలె ఇతరమైనవానితో సంబంధాన్ని పొందడు అనగా కలియడు. ఘటం అనే ఉపాధిని పొందినప్పటికీ ఆ ఘటంయొక్క ధర్మాలు ఆకాశాన్ని అంటవు. కల్లుకుండలో కుండ ఉపాధి. దానికి సంబంధించిన కల్లుయొక్క దుర్గంధం ఆ కుండలోని ఆకాశాన్ని పొందదు. అలాగే ఆత్మకు దేహం ఉపాధి. ఆత్మ ఉపాధితో కూడుకొనియున్నప్పటికీ ఉపాధియైన దేహం యొక్క ధర్మాలు ఆ ఆత్మకు అంటవు. లక్ష్యాన్ని ఉద్దేశించి బాణాన్ని విడిచిపెడ్తే ఆ బాణం ఫలాన్ని ఇవ్వకుండా ఊరుకోదు. లక్ష్యాన్ని ఛేదించకుండా విడిచిపెట్టదు. అలాగే జ్ఞానోదయానికి పూర్వం ఆచరించిన కర్మ ఫలాన్ని ఇవ్వకుండా నశించదు. ఆవుని చూసి వ్యాఘ్రం అనుకొని బాణం విడిచిపెడ్తే అది వేగంగా బలంగా వెళ్లి లక్ష్యాన్ని ఛేదిస్తుంది. అది ఆవు అని తెలిసినప్పటికీ మధ్యలో ఆగిపోదు.





ప్రారబ్ధకర్మ మిక్కిలి బలమైనది అనుభవింపకతప్పదు. జ్ఞానులకి కూడా అనుభవం చేతనే అది క్షయమవుతుంది. సమ్యగ్ జ్ఞానం అనే అగ్నిచేత సంచిత ఆగామి కర్మలు పూర్తిగా లయమవతాయి. బ్రహ్మముతో ఐక్యం పొంది బ్రహ్మమయులై ఎల్లప్పుడు ఎవరు ఉంటారో వారికి ఆ మూడు కర్మలు ఏనాడు ఉండవు. వారు నిర్గుణ పరబ్రహ్మమే అయి ఉంటారు.

**ప్రారబ్ధం బలవత్తరం ఖలు విదాం భోగేన తస్య క్షయః**
**సమ్యగ్ జ్ఞాన హుతాశనేన విలయః ప్రాక్ సంచితాగామినామ్**
**బ్రహ్మాత్మైక్యమవేక్ష్య తన్మయతయా యే సర్వదా సంస్థితా**
**స్తేషాం తత్త్రితయం న హి క్వచిదపి బ్రహ్మైవ తే నిర్గుణమ్॥** **454**

ఉపాధితో తాదాత్మ్యం పొందకుండా (దేహమే నేను అనే భావాన్ని పొందకుండా) కేవలం "అహం బ్రహ్మాస్మి" అని ఎల్లప్పుడు అద్వైతానుభవంలోనే ఉండే మునికి జాగ్రదవస్థలో స్వప్నావస్థ ఉండనట్లు ప్రారబ్ధకర్మానుభవం కొంచెం కూడా ఉండదు.

నిద్రనుండి లేచినవాడు కలలో తాను పొందిన శరీరమందు, ఆ శరీరంతో తాననుభవించిన పదార్థములయందు అలాగే ప్రపంచమందు నేను నాది ఇది అనే భావాన్ని పొందడు. జాగరణలో తానుగానే ఉంటాడు. స్వప్నంలో అనుభవించిన అసత్యవస్తువులని యథార్థములని సమర్థించే కోరిక కూడా అతనికి కల్గదు. ఆయావస్తువులని జాగ్రత్త పెట్టుకోడం, ఆ విశ్వాన్ని తిరిగి చూడడం కూడా ఉండదు. ఆ అసత్య వస్తువులకి అనుకూలంగా ప్రవర్తిస్తూ ఉంటే ఇంకా అతడు నిద్రనుండి ముక్తుడు కాలేదని నిశ్చయంగా చెప్పవచ్చు. ఆ విధంగానే బ్రహ్మానుభూతి పొందుతున్నవాడు ఎప్పుడూ బ్రహ్మముగానే ఉంటాడు. ఇతరమైన వస్తువుని చూడడు. స్వప్నంలో చూసిన పదార్థం వలె బ్రహ్మవేత్తకి ఆహారాన్ని స్వీకరించడం విడిచిపెట్టడం కూడా స్మృతిప్రాయమే.

ఈ దేహం కర్మచే ఏర్పడింది. దానికి ప్రారబ్ధం కల్పింపబడింది. అనాదియైన ఆత్మకీ ప్రారబ్ధానికీ ఏమీ సంబంధంలేదు. ఆత్మ కర్మచే నిర్మింపబడలేదుగదా. "అజోనిత్యః" అని శ్రుతి ఆత్మపుట్టుకలేనిది నిత్యమైనది అని చెప్తోంది. అది అమోఘమైన

వాక్కు. అట్టి ఆత్మ తానే అని భావిస్తూ ఉంటున్న జ్ఞానికి ప్రారబ్ధకర్మ ఎక్కడనుండి కల్గుతుంది? దేహమే నేను అనే స్థితి ఉన్నంతవరకు ప్రారబ్ధకర్మ ఉంటుంది. జ్ఞానికి దేహమే నేను అనే స్థితి ఇష్టమైనది కాదు. కాబట్టి అతనికి ప్రారబ్ధకర్మ ఉంటుందనడం విడిచిపెట్టదగ్గది. పోనీ, అతని శరీరానికి ప్రారబ్ధకర్మ ఉంటుందని అందామా అంటే అది కూడా భ్రాంతియే అవుతుంది. ఎందుకంటే శరీరం భ్రాంతివల్ల కల్గింది గదా. భ్రాంతివల్ల కల్గింది సత్యం కాదుగదా. అసత్యమైనది ఎక్కడనుండి జన్మిస్తుంది? పుట్టనిదానికి నాశం ఎలా సంభవిస్తుంది? అప్పుడు అసత్తు అయిన శరీరానికి ప్రారబ్ధకర్మ ఎలా చెందుతుంది?

జ్ఞానంచేత అజ్ఞానమూ దానికార్యమూ కూడా సమూలంగా నాశనమవతాయి అని చెప్పినప్పుడు శరీరం ఎలా వచ్చింది? అని శంకించే మందమతులకి సమాధానంగా బాహ్యదృష్టితో ప్రారబ్ధకర్మ అనేదాన్ని శ్రుతి చెప్తోందిగాని పండితులకి దేహాదికం సత్యమని చెప్పడంకోసం కాదు. శ్రుతి వాక్యతాత్పర్యం పరమార్థాన్ని ముఖ్యంగా గోచరింపజేయడమే. ప్రారబ్ధకర్మ లేకపోతే జీవన్ముక్తునికి శరీరం ఉండకూడదు. కాని ఉంటోందికదా అనే శంకకు సమాధానం ఏమిటంటే జీవన్ముక్తునికి శరీరం ఉంటోంది అని మనం అనుకొంటున్నాం. కాని ఆతనికి శరీరభ్రమ ఉండదు. నిద్రపోతున్న వానికి శరీరం ఉందని మనం అనుకోవడమేగాని అతనికి అటువంటి భ్రమ ఉండదుగదా

## అద్వితీయ బ్రహ్మ నిరూపణం

బ్రహ్మము పరిపూర్ణం. అనాది. అనంతం. అప్రమేయం. అవిక్రియం. ఏకం. అద్వితీయం. సద్ఘనం. చిద్ఘనం. నిత్యమైన ఆనందఘనం. అక్రియం. ప్రత్యగాత్మ. ఏకరసం. పూర్ణం. సర్వతోముఖం. అహేయం. అనుపాదేయం. అనాధేయం. అనాశ్రయం. నిర్గుణం. నిష్కలం. సూక్ష్మం. నిర్వికల్పం. నిరంజనం. నిరూపింపశక్యంకాని రూపంగలది. మనస్సుకి వాక్కులకి గోచరించేది కాదు. సత్సమృద్ధం. స్వతః సిద్ధం. శుద్ధం. బుద్ధం. అనీదృశం. నానావిధాలుగా కనబడే విశ్వం ఆ బ్రహ్మముకంటె కొంచెంకూడా వేరుగా లేనేలేదు.

విషయాలపై అనురాగాన్ని విడిచినవారు, విషయానుభవం పరిత్యజించిన





వారు, శమం దమంగల మహాత్ములు అయిన యతులు పరతత్త్వాన్ని చక్కగా తెలుసుకొని బ్రహ్మైక్యాన్ని పొందడంచేత పరమసుఖాన్ని పొందుతారు.

## ఉపదేశం

శిష్యా! నువ్వుకూడా ఆత్మకు సంబంధించిన ఈ పరతత్త్వాన్నీ నీ స్వరూపమైన ఆనందఘనాన్నీ విచారించి నీయొక్క మనస్సుచే బాగా కల్పింపబడ్డ అజ్ఞానాన్ని విదలించుకొని ఆత్మజ్ఞానం పొంది సంసారముక్తుడివి, కృతార్థుడివి అగుము.

నిర్వికల్ప సమాధిలో ఉంటూ నిశ్చలమైన మనస్సు గలిగి స్పష్టమైన జ్ఞాననేత్రంతో ఆత్మ తత్త్వాన్ని దర్శించు. నిస్సంశయంగా చక్కగా చూస్తే నువ్వు విన్న బ్రహ్మతత్త్వం తిరిగి వికల్పాలు పొందదు. అనుభవింపబడుతుంది. తనయొక్క అజ్ఞానబంధ సంబంధంనుండి ముక్తిపొందడంవల్ల సత్య జ్ఞాన ఆనందరూపమైన పరబ్రహ్మము లభిస్తుంది. ఈ విషయంలో వేదాంతశాస్త్రం యుక్తులు గురూపదేశం ప్రమాణం. అంతఃకరణమందు కలిగే అనుభవం కూడా ప్రమాణమే.

సంసారబంధమోక్షాలు, తృప్తి, చింత, ఆరోగ్యం ఆకలి మొదలైనవి స్వయంగా అనుభవించి తెలుసుకోదగ్గవి. వీనికి సంబంధించిన జ్ఞానం ఇతరులకి ఊహింపదగ్గదే. వేదవాక్యాల వలె గురువులు కూడా తటస్థంగా ఉంటూ బ్రహ్మతత్త్వాన్ని ఉపదేశిస్తారు. విద్వాంసుడు ఈశ్వరానుగ్రహంచే కల్గిన ప్రజ్ఞచేత సంసారాన్ని తరించాలి. పండితుడు తాను అఖండమైన ప్రత్యగాత్మ స్వరూపమని స్వయంగా తెలుసుకొని నిర్వికల్పమైన ఆత్మయందు మిక్కిలి సుఖంగా ఉండాలి.

ఇది వేదాంత సిద్ధాంతవాక్యం. జీవుడూ సమస్తమైన జగత్తూ కూడా బ్రహ్మమే. అఖండమైన పరబ్రహ్మమై ఉండడమే మోక్షం. బ్రహ్మము అద్వితీయమని నిర్ణయించడానికి వేదవాక్యములే ప్రమాణం.

**వేదాంత సిద్ధాంత నిరుక్తిరేషా**
**బ్రహ్మైవ జీవః సకలం జగచ్చ**
**అఖండ రూపస్థితిరేవ మోక్షః**
**బ్రహ్మాద్వితీయే శ్రుతయః ప్రమాణమ్॥ 479**

## శిష్యుని అనుభవం

ఈవిధమైన గురూపదేశంవల్ల, శ్రుతి వాక్య ప్రమాణంవల్ల, తన యుక్తిచేత (వివేకంచేత) గొప్పదైన ఆత్మతత్త్వం పొంది ఇంద్రియ వ్యాపారాలని శమింపజేసుకొని అంతఃకరణమును వశపరుచుకొని శిష్యుడు స్థిరమైన ఆకారంతో ఆత్మనిష్ఠుడై ఉన్నాడు. కొంతకాలం మనస్సుని పరమాత్మయందు స్థిరంగా ఉంచి వేచి పరమానందం అనుభవిస్తూ గురువర్యునితో ఇలా అన్నాడు.

గురుదేవా! బ్రహ్మాత్మైక్యాన్ని పొందడంవల్ల విషయజన్యమైన బుద్ధి నష్టమయింది. ఇంద్రియాల ప్రవృత్తి లోపించింది. ఇదం (ప్రత్యక్షం) గానీ అనిదం (పరోక్షం) గానీ నాకు తెలియడం లేదు. అపారమైన సుఖాన్ని అనుభవిస్తున్నాను. ఇది ఎటువంటిదో ఎంతటిదో చెప్పలేకపోతున్నాను.

నాదైన ఆనందామృత ప్రవాహంతో నింపబడ్డ పరబ్రహ్మమనే సముద్రంయొక్క వైభవం మాటలతో చెప్పడానికిగాని మనస్సుచే పరిగణించడానికి గాని శక్యం కానిది. సముద్రంలో చల్లబడ్డ వడగళ్లవలె నా మనస్సు ఆ పరబ్రహ్మమందు చెదిరి కరిగిపోయింది. ఆ ఆనందాంశలేశమందు ఆ మనస్సు పరిపూర్ణంగా లీనమై ఆనందమయమై సుఖిస్తోంది.

ఈ జగత్తు ఎక్కడకు పోయిందో? ఎవడు దీన్ని తీసికొని పోతున్నాడో? ఎక్కడ అది కలిసిపోతోందో? ఇప్పుడేగదా అది కనబడింది. ఇప్పుడు లేదేమి? ఇది గొప్ప అద్భుతం.

అఖండమైన ఆనందామృతంతో నిండిన పరబ్రహ్మమనే సముద్రంలో విడిచిపెట్టదగ్గది గాని గ్రహింపదగ్గది గాని లేదు. అలాగే దానికంటె వేరుగా మరొకవస్తువుగాని విలక్షణమైనదిగాని ఏదీలేదు. ఇక్కడ నాకు ఏమీ కనబడడంలేదు. ఏమీ వినబడడంలేదు. ఏమీ తెలుసుకోడం లేదు. స్వయంగా ఎల్లప్పుడూ ఉండే ఆనందస్వరూపుణ్ణి అయ్యేను. విలక్షణుణ్ణి అయ్యేను.

ఎవని కటాక్షమనే చిక్కని వెన్నెల ప్రసరించడంచేత సంసార తాపంవల్ల కల్గిన శ్రమ పూర్తిగా తొలగిపోయిందో, క్షణంలో అఖండమైన వైభవంగల నా





స్వరూపమైన ఆనందాన్ని పొందగిలిగేనో ఆ గురుదేవునికి నమస్కారం. విముక్తసంగుడు సత్పురుషులలో ఉత్తముడు నిత్య అద్వయ ఆనందస్వరూపుడు సదా అపార దయాసాగరుడు మహాత్ముడు అయిన గురురూప పరబ్రహ్మమునకు నమస్కారం.

గురూత్తమా! నీ అనుగ్రహంచే ధన్యుణ్ణి కృతకృత్యుణ్ణి సంసార గ్రహవిముక్తుణ్ణి నిత్యానంద స్వరూపుణ్ణి పూర్ణుణ్ణి అయ్యేను. ఇప్పుడు నేను అసంగుణ్ణి. శరీర రహితుణ్ణి. స్త్రీ పురుషాది చిహ్నాలు లేనివాణ్ణి. నాశం లేనివాణ్ణి. ప్రశాంతుణ్ణి. అనంతుణ్ణి. అతాంతుణ్ణి (అలసటలేనివాణ్ణి). చిరంతనుణ్ణి. అక్రియుణ్ణి. శుద్ధ జ్ఞానస్వరూపాన్ని. కేవలం సదాశివుణ్ణి. ద్రష్ట శ్రోత వక్త కర్త భోక్త అనే వారికంటె విభిన్నుణ్ణి. నిత్యం నిరంతం నిష్క్రియం నిస్సీమం అసంగం అయిన పూర్ణ జ్ఞాన స్వరూపుణ్ణి. ఇది (స్థూల ప్రపంచం) అది (సూక్ష్మ ప్రపంచం) కాని వాణ్ణి. ఆ రెండింటినీ ప్రకాశింపజేసేది, పరం శుద్ధం బాహ్యాభ్యంతర శూన్యం పూర్ణం అద్వితీయం అయిన బ్రహ్మము నేను. నిరుపమానం అనాదీయైన ఆత్మతత్త్వాన్ని. నువ్వు నేను ఇది అనే కల్పనలకి దూరమైనవాణ్ణి. నిత్యానందైకరసం సత్యం అయిన అద్వితీయ బ్రహ్మము నేను.

నారాయణుడు, నరకాసురుణ్ణి సంహరించిన శ్రీకృష్ణుడు, త్రిపురాసురులను సంహరించిన పరమేశ్వరుడు, పురుషోత్తముడు కూడా నేనే. నేను అఖండ జ్ఞాన స్వరూపాన్ని. సమస్తానికీ సాక్షిని. నాపై ఎవరి ఆధిపత్యం లేనివాణ్ణి. అహంకార మమకార రహితుణ్ణి. సమస్త ప్రాణులలో ఉంటున్నవాణ్ణి. జ్ఞాతగా లోపలికి బైటకి ఆశ్రయమైనవాణ్ణి. భోక్త భోగ్యం అన్నీ అయినవాణ్ణి. ఏది ఇంతకుముందు ఇది అని వేరుగా కనబడిందో అది నేనే.

అఖండ ఆనంద సముద్రమైన నాయందు మాయ అనే వాయువుయొక్క విశేషగమనములచే ఎన్నో విశ్వములు అనే తరంగాలు ఉద్భవిస్తున్నాయి. లీనమవుతున్నాయి. నిష్కల నిర్వికల్ప బ్రహ్మమునైన నాయందు లోకులు భ్రాంతిచే ఆరోపించడం చేత స్థూలం సూక్ష్మం మొదలైన భావాలు కల్పింపబడ్డాయి. అది అపరిచ్ఛిన్నం అనంతం అయిన కాలమందు కల్పం సంవత్సరం అయనం ఋతువు మొదలైనవి కల్పింపబడడం వంటిది.

మతి దోషంచే దూషింపదగ్గ అజ్ఞానులు దేహాదికాన్నీ విశ్వాన్నీ వానికి

అధిష్ఠానమైన పరమాత్మయందు ఆరోపించేరు. ఆవిధంగా ఆరోపింపబడ్డ వస్తువు దానికి ఆశ్రయమైన బ్రహ్మమునకు న్యూనత్వాన్ని కల్గించలేదు. ఎండమావిలోని నీటి ప్రవాహం చవిటినేలను తడపలేదుగదా. నేను ఆకాశంవలె కల్పనలకి దూరంగా ఉన్నవాణ్ణి. సూర్యునివలె ప్రకాశింపజేయదగిన వస్తువులకంటె వేరుగా ఉన్నవాణ్ణి. పర్వతంవలె నిశ్చలుణ్ణి. సముద్రంవలె అంతంలేనివాణ్ణి. మేఘంతో ఆకాశానికి ఏవిధంగాను సంబంధంలేనట్లే ఈ దేహంతో నాకు సంబంధంలేదు. కాబట్టి దేహానికి చెందిన జాగ్రత్ స్వప్న సుషుప్తి అనే ధర్మాలు నాకు సంబంధించినవి ఎలా అవతాయి? ఉపాధియైన దేహం వస్తుంది. అదే పోతుంది. అదే కర్మలు ఆచరిస్తుంది. అదే కర్మఫలాన్ని అనుభవిస్తుంది. అదే జీవిస్తుంది. మరణిస్తుంది. నేను ఎల్లప్పుడు కులపర్వతంవలె నిశ్చలంగా ఉంటాను.

ఎపుడూ అద్వితీయంగా అవయవరహితంగా ఉండే నాకు ప్రవృత్తి లేదు. నివృత్తి కూడా లేదు. ఆకాశంవలె ఏకరూపంగా నిబిడంగా నిరంతరంగా ఉండే ఆ పరమాత్మ ఏవిధంగా కర్మ ఆచరిస్తుంది? నేను ఇంద్రియాలు చిత్తం షడ్భావవికారాలు ఆకారం ఏవీ లేనివాణ్ణి. అఖండ సుఖానుభవం గలవాణ్ణి. అట్టి నాకు పుణ్యపాపాలు ఎక్కడినుండి కల్గుతాయి? శ్రుతి కూడా "అనన్వాగతం పుణ్యేన, అనన్వాగతం పాపేన తీర్ణో హి తదా సర్వాన్ శోకాన్ హృదయస్య భవతి" (బృహదారణ్యకం) అని చెప్తోంది. సుషుప్తియందు ఆత్మ పుణ్య పాపాల సంబంధాన్ని పొందకుండా హృదయానికి చెందిన సర్వశోకాలనీ తరిస్తుందని భావం.

నీడ వేడినో చల్లదనాన్నో మంచినో చెడ్డనో తాకితే ఆ నీడకంటె వేరుగా నున్న పురుషుణ్ణి వేడి మొదలైనవి కొంచెం కూడా తాకవు. సాక్ష్య ధర్మాలు వానికంటె వేరుగా ఉండే సాక్షిని తాకవు. సాక్షి అవికారి. ఉదాసీనుడు. దీపం వెలుగుతూ ఉన్నప్పుడు గృహధర్మాలు నిర్వహింపబడతాయి. అవి వానికి సాక్షిగానున్న దీపానికి ఏమాత్రమూ చెందవు. అలాగే దేహధర్మాలు అన్నింటికీ ఆత్మ సాక్షిగా ఉంటుంది. వానికంటె విలక్షణమైనది. కాబట్టి అవి దాన్ని తాకవు.

సూర్యుడు సమస్త కర్మలకీ సాక్షిగానే ఉంటాడు. అతణ్ణి ఆ కర్మలు అంటవు. ఇనుముతో అగ్ని కూడినప్పుడు అగ్నియొక్క లక్షణమైన దాహకత్వంచే ఇనుము కాంతిమంతమవుతుంది. జడమైన ఇనుముయొక్క ధర్మాలు అగ్నికి కల్గవు.





రజ్జువునందు సర్పత్వం ఆరోపింపబడినప్పుడు సర్ప ధర్మాలు ఏవీ ఆ రజ్జువుని అంటవు. అలాగే నేను కూటస్థుడనైన చిదాత్మను. నాయందు దేహాదికం ఆరోపింప బడింది. ఆరోపితములైన దేహాదికం యొక్క ధర్మాలు ఏవీ నన్ను తాకవు.

నేను కర్తని కాను. ప్రేరకుణ్ణి కూడా కాను. భోక్తను కాను. భుజింపజేసే వాణ్ణి కూడా కాను. ద్రష్టను కాను. చూపించేవాణ్ణి కూడా కాను. నేను స్వయం ప్రకాశకుణ్ణి. ఇట్టిదని నిర్దేశింప శక్యంగాని ఆత్మని. నీటిలో చలిస్తున్న ప్రతిబింబాన్ని చూసి అజ్ఞానులు ఆ కదలికను సూర్యునికి కల్పిస్తారు. కదులుతున్నాడని భావిస్తారు. ఉపాధియైన దేహాదికమందు ప్రతిబింబరూపమైన జీవుడు పొందుతున్న సుఖదుఃఖాది అవస్థలని ఆత్మయందారోపించుకొని నేను కర్తని నేను భోక్తను అయ్యో! నేను హతుణ్ణి అని భావిస్తారు. జడాత్మకమైన దేహం నీటిలో మునిగినా నేలపై దొర్లినా జలధర్మంగాని నేలధర్మంగాని నన్ను అంటవు. తడియడం మట్టి అంటుకోడం అనేవి ఆత్మస్వరూపుడనైన నన్ను పొందవు.

కర్తృత్వం భోక్తృత్వం ఖలత్వం మత్తత జడత్వం బద్ధత్వం విముక్తి మొదలైనవి బుద్ధియొక్క వికల్పాలు మాత్రమే. కేవలం అద్వయంగా ఉండే నా స్వరూపమైన పరబ్రహ్మయందు ఇవేవీ లేనేలేవు. సత్త్వరజస్తమోగుణాత్మకమైన ప్రకృతి యొక్క వికారాలు పదులు వేలు ఉండవచ్చు. అసంగుణ్ణి చిద్రూపుణ్ణి అయిన నాకు ఆ వికారాలతో ఏమి పని? మేఘాడంబరం ఆకాశాన్ని స్పృశింపదుగదా.

అవ్యక్తం నుండి స్థూలదేహం వరకు గల సమస్త విశ్వమూ దేనియందు ఆభాస మాత్రంగా స్ఫురిస్తుందో ఆకాశంతో సమానమైన సూక్ష్మం ఆద్యంతహీనం అయిన ఆ అద్వైత బ్రహ్మమే నేను. సర్వవిశ్వానికీ ఆధారమైనది, సర్వవస్తువులనీ ప్రకాశింపజేసేది, సర్వాకారమైనది, సర్వమునందున్నది, సర్వశూన్యమైనది, నిత్యం శుద్ధం నిశ్చలం నిర్వికల్పం అయిన ఆ అద్వైత బ్రహ్మమే నేను. దేనియందు సమస్త మాయావిశేషం లయమవుతుందో ఏది ప్రత్యగాత్మ స్వరూపమో ఏది ఇంద్రియాల జ్ఞానంచే పొందబడదో సత్య జ్ఞాన అనంత ఆనందరూపమేదో అట్టి అద్వైతపరబ్రహ్మమే నేను.

నేను నిష్క్రియుణ్ణి. వికారాలు లేనివాణ్ణి. అవయవరహితుణ్ణి. నిరాకారుణ్ణి. నిర్వికల్పుణ్ణి. నిత్యుణ్ణి. నిరాధారుణ్ణి. నిర్ద్వయుణ్ణి. సర్వాత్మకుణ్ణి. సర్వస్వరూపుణ్ణి.

సర్వాతీతుణ్ణి. అద్వయుణ్ణి. కేవలం అఖండ జ్ఞానస్వరూపుణ్ణి. నిరంతరానందాన్ని.

ఇది స్వయం ప్రకాశకమైన పరబ్రహ్మము యొక్క సామ్రాజ్యవైభవం. గురుదేవా! నీ దయా సంపదయొక్క గొప్ప అనుగ్రహంచే దీన్ని పొందేను. మహాత్మా! నీకు నమస్కారం. నమస్కారం. పునః పునః నమస్కారం. గురూత్తమా! మహాస్వప్నం వంటి మాయచే చేయబడ్డ జననమరణరూపమైన సంసారం అనే మహారణ్యంలో తిరుగుతూ క్లేశాలు అనుభవిస్తూ మిక్కిలి ఎక్కువైన తాపాలతో కూడి అహంకారమనే పెద్దపులిచే బాధింపబడుతున్న ఈ నన్ను అత్యంత కరుణతో గాఢనిద్రనుండి మేల్కొల్పి గొప్పగా రక్షించేవుగదా! గురువర్యా! నీకు నమస్కారం. నీ తేజస్సు సద్రూపం. అద్వితీయ చైతన్య ఘనం. అదే ఈ విశ్వంలో ప్రకాశిస్తోంది.

ఈ విధంగా ఆత్మానందాన్ని పొంది తత్త్వం తెలుసుకొని వంగి నమస్కరిస్తున్న శిష్యపుంగవుణ్ణి చూసి మహాత్ముడైన ఆ గురుచంద్రుడు ప్రమోదంతో నిండిన హృదయంగలవాడై మళ్లీ పరమవాక్కుని ఇలా పలికేడు.

## గురువచనం

ఈ జగత్తు బ్రహ్మరూపమైన జ్ఞానప్రవాహమే. కాబట్టి బ్రహ్మమే అవుతుంది. అధ్యాత్మదృష్టితో ప్రశాంతమైన మనస్సుతో సర్వావస్థలయందును అంతటా సత్తునే చూడు. జ్ఞాన నేత్రం గలవారికి అంతటా బ్రహ్మమేగాని వేరుగా చూడడానికి ఇంకొకటి ఉన్నదా? అలాగే బ్రహ్మవేత్తకి బుద్ధి విహరించడానికి ఆధారమైనది సత్తుకంటె వేరుగా మరొకటి ఏమి ఉన్నది? ఆ పరానందరసానుభూతిని విడిచిపెట్టి శూన్యములందు ఏ పండితుడు ఆసక్తిని పొందుతాడు? హృదయానికి ఆహ్లాదాన్ని కల్గించే చంద్రుడు ప్రకాశిస్తూ ఉండగా ఆ చంద్రుణ్ణి విడిచి బొమ్మలోనున్న చంద్రుణ్ణి చూడడానికి ఎవడు ఇష్టపడతాడు? అసత్తయిన పదార్థాన్ని అనుభవించడంలో కొంచెం కూడా తృప్తిలేదు. దుఃఖం కూడా తొలగదు. సత్తు అద్వయం అయిన ఆనందరసాన్ని అనుభవించడంచేత తృప్తిని పొందినవాడవై ఆత్మనిష్ఠచే సుఖంగా ఉండు.

ఓ మహామతీ! అంతటా నీ స్వరూపమైన పరబ్రహ్మమునే దర్శిస్తూ అద్వయమైన ఆ పరబ్రహ్మమే నేను అని తలుస్తూ నీదైన ఆత్మానందాన్ని అనుభవిస్తూ





కాలం గడుపు. అఖండ జ్ఞానస్వరూపమైన నిర్వికల్ప పరబ్రహ్మమందు జగత్తుని కల్పించడం ఆకాశంలో పట్టణాన్ని ఊహించడమే. కాబట్టి అద్వయానందమయుడవై ఎల్లప్పుడు పరమశాంతిని పొంది మౌనాన్ని అవలంబించు.

అసత్ కల్పనలకీ వికల్పాలకీ హేతువైన బుద్ధి ఉదాసీనంగా ఉండే అవస్థ పరమోపశాంతి అనిపించుకొంటుంది. మహాత్ములైన బ్రహ్మవేత్తలు బ్రహ్మస్వరూపులై ఆ పరమోపశాంతియందు నిరంతరం అద్వయమైన ఆనందసుఖాన్ని పొందుతారు. ఆత్మతత్త్వం తెలుసుకొని తనదైన ఆనందరసాన్ని అనుభవిస్తున్న వాసనారహితమైన మౌనంకంటె సుఖప్రదమైనవానిలో ఉత్తమమైనది మరొకటి ఏదీలేదు. పండితుడైన ముని ఎక్కడికైన వెళ్తూ స్థిరంగా ఉంటూ ఎందులోనైనా ప్రవేశిస్తూ నిద్రపోతూ ఇంకా మరోవిధంగా కూడా ఉంటూ ఎల్లప్పుడు ఆత్మానందానుభవంతోనే స్వేచ్ఛగా జీవిస్తాడు.

చిత్త నిరోధం కలిగి తత్త్వాన్ని తెలుసుకోడంలో సిద్ధి పొందిన మహాత్మునికి దేశం కాలం ఆసనం దిక్కు యమాది నియమం మొదలైనవాని అపేక్ష ఏమీ ఉండదు. తన్ను గూర్చి తాను తెలుసుకొనేటప్పుడు దిక్కు పుణ్యకాలం మొదలైన నియమాలు దేనికి? కన్ను మొదలైనవానిచే పదార్థ జ్ఞానం స్పష్టంగా కల్గుతూ ఉండగా ఇది కుండ అని తెలుసుకోడానికి దేశం కాలం మొదలైన నియమాన్ని ఎవడు కోరుకొంటాడు? ఎవ్వడూ అపేక్షించడు. అలాగే పరమాత్మని తెలుసుకోడానికి ప్రమాణ పటుత్వం అవసరం. దేశకాలాది నియమం కోరదగ్గది కాదు. శ్రుతి వాక్యాదికం ప్రమాణంగా ఉండడంచేత ఈ ఆత్మ స్వతః సిద్ధంగా ప్రకాశిస్తోంది. దేశం కాలం శరీర శుద్ధీ ఏదీ అపేక్షించదు. నేను దేవదత్తుణ్ణి అనే జ్ఞానం దేన్నీ అపేక్షించదు. అలాగే బ్రహ్మవేత్తకి నేను బ్రహ్మమను అనే జ్ఞానం కూడా ఇతరాపేక్ష లేకుండానే లభిస్తుంది.

సూర్యునిచే సమస్త విశ్వం ప్రకాశిస్తోంది. అలాగే ఆత్మచేతనే దేహాదికం ప్రకాశిస్తోంది. అనాత్మ అసత్తు తుచ్ఛం అయిన దేహాదికం ఆత్మని ప్రకాశింపజేసేది ఎలా అవుతుంది? వేద శాస్త్ర పురాణాలు సమస్త భూతాలు కూడా ఆ పరమాత్మ చేతనే సార్థకమవుతున్నాయి. ఇవి సమస్తానికీ జ్ఞాతయైన పరబ్రహ్మమును ప్రకాశింప జేయగలవా?

## బ్రహ్మవేత్త స్థితి

పరమాత్మ స్వయం ప్రకాశకమైనది. అనంతమైన శక్తిగలది. కొలతకి అందనిది. సమస్తమైన అనుభవరూపమైనది. బ్రహ్మవేత్తలలో ఉత్తమోత్తముడు ఆ ఆత్మని తెలుసుకొనియే సంసార బంధ విముక్తుడవతాడు. చక్కగా సర్వోత్కృష్టంగా విరాజిల్లుతాడు.

నిరంతరమైన ఆనందరసాన్ని స్వయంగా ఆస్వాదిస్తూ తృప్తిపొందే బ్రహ్మవేత్త విషయాలచే ఎన్నడు దుఃఖాన్ని పొందదు. ప్రమోదాన్నీ పొందదు. వానియందు ఆసక్తుడు కాడు. విరక్తుడు కూడా కాడు. తన స్వరూపమైన ఆత్మయందు ఎల్లప్పుడు క్రీడిస్తూ ఉంటాడు. ఆనందిస్తూ ఉంటాడు. బాలుడు ఆకలినీ, శరీరం పొందుతున్న బాధనీ విడిచిపెట్టి ఆట వస్తువుతో ఆడుకొంటూ ఉంటాడు. అలాగే ఆత్మజ్ఞానియైన పండితుడు కూడా అహంకార మమకారాలు లేనివాడై ఆత్మయందు క్రీడిస్తూ ఉంటాడు. సుఖియై ఉంటాడు.

బ్రహ్మవేత్త చింత దైన్యం లేకుండా భిక్షచేసిపొందినదాన్ని తింటాడు. నదీజలాన్ని త్రాగుతాడు. స్వతంత్రతతో నిరంకుశంగా ఉంటాడు. దేనినుండీ భయాన్ని పొందదు. శ్మశానంలోనో వనంలోనో నిద్రపోతాడు. ఉతుకడం ఎండపెట్టుకోడం లేని వస్త్రాన్ని ధరిస్తాడు. దిగంబరుడుగానైనా ఉంటాడు. భూమి అతనికి పాన్పు. వేదాంతవీధుల్లో ఎప్పుడూ సంచరిస్తూ ఉంటాడు. పరబ్రహ్మమందు క్రీడిస్తూ ఉంటాడు.

చింతాశూన్య మదైన్య భైక్ష్యమశనం పానం సరిద్వారిషు
స్వాతంత్ర్యేణ నిరంకుశా స్థితిరభీర్నిద్రా శ్మశానే వనే
వస్త్రం క్షాలన శోషణాది రహితం దిగ్వాస్తు శయ్యా మహీ
సంచారో నిగమాంతవీథిషు విదాం క్రీడా పరే బ్రహ్మణి॥ 539

ఆత్మవేత్త మోహాన్ని కోల్పోయిన శరీరంతో ఉన్న విషయాలని అన్నింటినీ ఇతరుల కోరిక ననుసరించి బాలునివలె అనుభవిస్తాడు. తన వర్ణాశ్రమాది లక్షణాలని ఎక్కడా చూపించుకోడు. బాహ్యవిషయాలపై ఏమాత్రమూ ఆసక్తిని పొందదు. ఒకప్పుడు దిగంబరుడై మరొకప్పుడు వస్త్రాన్ని ధరించినవాడై ఉంటాడు.





ఒకప్పుడు చర్మాన్ని కప్పుకొనియైనా ఉంటాడు. పిచ్చివానివలెనో పిల్లవానివలెనో పిశాచంవలెనో భూమిపై సంచరిస్తూ ఉంటాడు.

దిగంబరో వాపి చ సాంబరో వా
త్వగంబరో వాపి చిదంబరస్థః
ఉన్మత్తవద్వాపి చ బాలవద్వా
పిశాచవద్వాపి చరత్యవన్యామ్॥ 541

అద్వైత పరమాత్మయందు చరిస్తున్న ముని నిష్కాముడై కోరికలని అనుభవిస్తాడు. తనదైన ఆత్మానుభవంచేతనే ఎల్లప్పుడూ సంతుష్టుడై ఉంటాడు. స్వయంగా సర్వం తానే అనే భావంతో ఉంటాడు. ఒకప్పుడు మూఢునివలె ఒకప్పుడు పండితునివలె ఒకప్పుడు మహారాజు వైభవం కల్గినవానివలె ఒకప్పుడు మతిభ్రష్టునివలె ఒకప్పుడు సౌమ్యునివలె ఒకప్పుడు కొండచిలువ మార్గాన్ని అనుసరిస్తున్నవానివలె ఒకప్పుడు సత్పాత్రునివలె ఒకప్పుడు అవమానింపబడ్డవానివలె ఒకప్పుడు అజ్ఞాతంగానున్నవానివలె సంచరిస్తూ ఉంటాడు.

క్వచిన్మూఢో విద్వాన్ క్వచిదపి మహారాజ విభవః
క్వచిద్భ్రాంతః సౌమ్యః క్వచిదజగరాచారకలితః
క్వచిత్పాత్రీభూతః క్వచిదవమతః క్వాప్యవిదిత
శ్చరత్యేవం ప్రాజ్ఞః సతత పరమానంద సుఖితః॥ 543

సంపద లేకపోయినా బ్రహ్మజ్ఞాని ఎప్పుడూ సంతోషంగానే ఉంటాడు. సహాయులు ఎవ్వరూ లేకపోయినా మహాబలశాలిగా ఉంటాడు. అసముడైనా (సాటిలేనివాడైనా) సమదృష్టిగలవాడై ఉంటాడు. కర్మ ఆచరిస్తున్నప్పటికీ ఆచరింపనివాడు. కర్మఫలాన్ని అనుభవిస్తున్నప్పటికీ భోక్తకాడు. శరీరం ఉన్నవాడే అయినా లేనివాడే. దేహమనే ఉపాధికి పరిమితమైనవాడే అయినా సర్వం తానే అయినవాడు. శరీరం నేనుకాదని నిత్యం తలంచే బ్రహ్మవేత్తని ప్రియం అప్రియం, శుభం అశుభం అనేవి స్పృశింపవు. స్థూలాది శరీరాలతో సంబంధం కలిగి ఆ శరీరమే నేను అనే అభిమానం కల్గినవానికి సుఖదుఃఖాలు శుభాశుభాలు కల్గుతాయి. శరీరం నేను కాదని సంబంధాన్ని త్రెంచుకొన్నవానికి శుభకర్మయొక్క ఫలంగాని అశుభకర్మ యొక్క ఫలంగాని ఎక్కడ కల్గుతుంది? సూర్యుడు రాహువుచే మ్రింగబడక పోయినప్పటికీ అజ్ఞానులు

వస్తుస్వభావాన్ని తెలుసుకోకుండా భ్రాంతిచేత సూర్యుడు మ్రింగబడ్డాడని చెప్తారు. ఆవిధంగానే దేహబంధాల నుండి విముక్తుడైన బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడైనవాణ్ణి శరీరాభాసని చూస్తూ శరీరం గలవాడని పరిగణిస్తారు.

శరీరబంధాన్ని త్రెంచుకొన్నవాడు పాము పొరవలె ఏదో కొంచెం ప్రాణవాయువుచే స్వల్పంగా ఇటూ అటూ కదల్పబడి ఉంటాడు. ప్రవాహంచే కొయ్య ఎత్తు పల్లాలకి తీసికొనిపోబడుతూ ఉంటుంది. అలాగే బ్రహ్మవేత్త యొక్క శరీరం దైవంచే కాలానుగుణంగా కర్మఫలాన్ని అనుభవించడంకోసం తీసుకొని పోబడుతుంది. దేహబంధం నుండి విముక్తుడైన సిద్ధుడు ప్రారబ్ధకర్మకు చెందిన వాసనలతో కర్మఫలాన్ని అనుభవించడంలో సంసారివలె ప్రవర్తిస్తాడు. ఫలానుభవంలో సాక్షిగా ఉదాసీనంగా ఉంటాడు. బండి చక్రం తిరుగుతున్నప్పటికీ చక్రమూలం (ఇరుసు) కదలకుండా ఉన్నట్లు అతడు సంకల్ప వికల్పరహితుడై ఉంటాడు. తనదైన ఆనందరసాన్ని ఆస్వాదించడంవల్ల మత్తెక్కిన చిత్తంగల బ్రహ్మవేత్త సాక్షిగా ఉంటూ ఇంద్రియాలని విషయాలపై ప్రవర్తింపజేయడు. అలాగే విషయములనుండి మరలించడు. కర్మఫలాన్ని కొంచెం కూడా అపేక్షించడు.

లక్ష్యాలక్ష్యాలు రెండింటిని విడిచిపెట్టి కేవలం పరబ్రహ్మమై ఉన్నవాడు స్వయంగా శివుడే. అతడు బ్రహ్మవేత్తలలో ఉత్తముడు. జీవిస్తూనే ఎల్లప్పుడు దేహబంధంనుండి విముక్తుడైనవాడు. కృతార్థుడు. అతడు బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడు. శరీరమనే ఉపాధి నాశనమడవంవల్ల అతడు బ్రహ్మమే అవతాడు. అద్వితీయమైన బ్రహ్మమును అనుభవిస్తాడు. నటుడు వేషాన్ని ధరించినా ధరించకపోయినా పురుషుడే అయినట్లు బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడు శరీరం ఉన్నా లేకపోయినా బ్రహ్మమేగాని ఇతరుడు కాడు.

## బ్రహ్మవేత్త దేహపాతం

చెట్టుయొక్క పండుటాకు ఎక్కడో అక్కడ పడుతుంది. అలాగే బ్రహ్మీభూతుడైన యతి యొక్క శరీరం ఎక్కడో ఎప్పుడో పతనమవుతుంది. ఆ శరీరం జ్ఞానాగ్నిచేత ముందు ఎప్పుడో దగ్ధమైనదే. పూర్ణం అద్వయం అయిన ఆనందంతో నిండియుండడంచేత ఎల్లప్పుడు పరబ్రహ్మమునందే ఉండే మునికి చర్మం మాంసం మలమూత్రాలుగల పిండాన్ని (దేహాన్ని) విడిచిపెట్టడంలో శుభప్రదమైన





దేశం కాలం మొదలైనవానికోసం నిరీక్షించడం ఉండనే ఉండదు.

దేహాన్ని విడిచిపెట్టడం మోక్షంకాదు. దండం కమండలం విడిచిపెట్టడం కూడా కానే కాదు. అజ్ఞాన హృదయగ్రంథి ఎప్పుడు విడిపోతుందో అప్పుడే మోక్షం కలగడం.

**దేహస్య మోక్షో నో మోక్షో న దండస్య కమండలోః**
**అవిద్యా హృదయగ్రంథి మోక్షో మోక్షో యతస్తతః॥ 559**

చెట్టు నుండి ఆకు కాలువలోనో నదిలోనో శివక్షేత్రంలోనే నాల్గు త్రోవల కూడలిలోనో పడితే ఆ చెట్టుకి శుభాశుభరూపమైన ఫలం లభిస్తుందా? అలాగే దేహం ఇంద్రియాలు ప్రాణం బుద్ధి అనేవాని నాశం చెట్టుయొక్క పత్రపుష్ప ఫలాల నాశం వంటిదే. అది సదాత్మకం. ఆనందస్వరూపం. ఆత్మనాశంకాదు. ఆత్మ పత్రపుష్పాదులు నశించినప్పటికీ నిలిచే వృక్షం వంటిది.

"ప్రజ్ఞానఘనః" అని శ్రుతి పేర్కొన్న ఆత్మ లక్షణం ఆత్మ సత్యమైనదని సూచిస్తోంది. స్పష్టంగా చెప్పలేకపోయినా ఆత్మకు ఉపాధియైన దేహాదుల వినాశం చెప్పినట్లే. శ్రుతి "అవినాశీ వాఽరేఽయమాత్మా" అని చెప్పి దేహాది వికారాలు నశిస్తాయి, ఆత్మకు నాశం లేదు అని పేర్కొంటోంది. మట్టినుండి వచ్చి పాషాణాలు వృక్షాలు గడ్డిపోచలు ధాన్యములు వస్త్రాలు మొదలైనవి దగ్ధములై మట్టియైనట్లు దేహం ఇంద్రియాలు ప్రాణాలు మనస్సు మొదలైన సమస్త దృశ్యం జ్ఞానాగ్నిచే దహింపబడినదై తిరిగి బ్రహ్మమునే పొందుతుంది. బ్రహ్మమునుండి వచ్చింది కాబట్టి చివరకి బ్రహ్మములోనే లీనమవుతుంది.

విలక్షణమైన చీకటి సూర్యుని తేజస్సులోనే లీనమైనట్లు దృశ్యం సమస్తం బ్రహ్మమందే పూర్తిగా లయమవుతుంది. ఘటం ముక్కలు కాగా ఆ ఘటానికి చెందిన ఆకాశం స్ఫుటంగా ఆకాశమే అవుతుంది. అలాగే ఉపాధియైన దేహం విలయం కాగా బ్రహ్మవేత్త స్వయంగా బ్రహ్మమే అవతాడు. పాలు పాలలోను, తైలం తైలంలోను, జలం జలంలోను పోసినప్పుడు కలిసి ఏకమవుతాయి. అలాగే ఆత్మవేత్తయైన ముని ఆత్మయందు కలిసి ఏకత్వం పొందుతాడు.. ఆత్మే అవతాడని భావం. ఈ విధంగా

పరిపూర్ణమైన సత్ మాత్రంగా ఉండడమే విదేహ కైవల్య రూపమైన బ్రహ్మాభావం. అట్టి స్థితిని పొందిన యతి తిరిగి సంసారంలో ప్రవర్తింపడు.

ఎల్లప్పుడు పరబ్రహ్మముతో ఏకత్వం కలిగించే విజ్ఞానంచేత దగ్ధం చేయబడ్డ అవిద్య, దాని కార్యాలు శరీరం కల్గిన యతి బ్రహ్మాభూతుడవతాడు. అటువంటి వానికి తిరిగి జన్మ ఎలా కల్గుతుంది?

సంసారబంధమోక్షాలు మాయచే కల్పింపబడ్డవే. యథార్థంగా అవి ఆత్మయందు లేవు. రజ్జు సర్పభ్రాంతిలో భ్రాంతిచేత సర్పత్వం కల్గడం, యథార్థజ్ఞానంచే ఆ సర్పత్వం తొలగడం వంటివే. అజ్ఞానావరణం ఉండడమే సంసార బంధం. ఆ ఆవరణం తొలగడమే మోక్షం. అందుకే "అవిద్యాఽస్తమయో మోక్షః సా చ బంధ ఉదాహృతః" అన్నారు పెద్దలు. పరబ్రహ్మమునకు ఏ ఆవరణమూ లేదు. బ్రహ్మముకంటె వేరే మరొకటి ఏదీ లేకపోవడంచేత బ్రహ్మ ఏ ఆవరణమూ లేనిదే. ఒకవేళ ఏదైనా ఉందని భావిస్తే శ్రుతి సహించదు. బంధమోక్షాలు రెండూ అసత్యములే. మూఢులు బుద్ధియొక్క ధర్మాన్ని ఆత్మయందు కల్పిస్తున్నారు. అది కంటి చూపుని మేఘం ఆవరిస్తే సూర్యుణ్ణి మేఘం ఆవరించిందని చెప్పినట్లే. అద్వయం అసంగం చిదేకం అక్షరం అయినది ఆత్మ. దానికి బంధమోక్షాలు ఎలా సంభవిస్తాయి?

పరమాత్మయందు సంసార బంధం ఉంది తొలగింది అనేది బుద్ధి యొక్క గుణాలే. అవి నిత్యమైన ఆత్మకు చెందవు. కాబట్టి బంధమోక్షాలు రెండూ ఆత్మయందు కల్పింపబడ్డవే. నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం అద్వితీయం అయి ఆకాశంవలె ఉండే పరమాత్మయందు బంధమోక్షాది కల్పన ఎక్కడనుండి వచ్చింది? ప్రలయం ఉత్పత్తి బంధం సాధకుడు ముముక్షువు ముక్తుడు అనేవి ఏవీ లేవు. ఇది పరమార్థం.

శిష్యా! ఇది సమస్త వేదాంత సిద్ధాంత స్వరూపం. అన్నింటికీ అతీతమైనది. అత్యంత రహస్యమైనది. నీకు ఇప్పుడు ఉపదేశించేను. కలిదోషం పోగొట్టుకొన్న వాడవై కోరికలు లేని బుద్ధిగలవాడవై మోక్షేచ్ఛపొంది నిరంతరం అనుపమమైన ఈ తత్త్వాన్ని భావించు.





ఈవిధంగా గురువు ఉపదేశింపగా విని శిష్యుడు వినయంతో నమస్కరించి గురువుయొక్క అనుజ్ఞను పొంది బంధవిముక్తుడై వెళ్ళినాడు. ఆ గురువు కూడా నిత్యమైన ఆనందసాగరంలో పూర్తిగా మునిగిన మనస్సుగలవాడై సమస్త భూమిని పవిత్రం చేస్తూ నిరంతరం సంచరించేడు.

ఈ విధంగా ముముక్షువులకి సుఖాన్ని కల్గించే జ్ఞానాన్ని ఉపదేశించడంకోసం ఆచార్య శిష్య సంవాదంలో ఆత్మలక్షణం నిరూపింపబడింది. సమస్త చిత్త దోషాలు తొలగించుకొన్నవారు, సంసారసుఖమందు ఆసక్తి లేనివారు, ప్రశాంత చిత్తులు, శ్రుతివాక్యములందు ఆసక్తిగలవారు, మోక్షేచ్ఛగలవారు అయిన యతులు ఈ ఉపదేశాన్ని గ్రహింతురుగాక!

సంసారమార్గంలో తపిస్తున్న సూర్యుని కిరణాలవల్ల దాహంతో బాధపడుతూ నీటికోసం మరుభూమియందు భ్రాంతితో తిరుగుతున్న వారికి ఈ శంకర భగవత్పాదుల ఉపదేశం అత్యంత సమీపంగానున్న అమృత సాగరం. ఇది సుఖాన్ని ఇస్తుంది. బ్రహ్మము యొక్క అద్వయ స్థితిని దర్శింపజేస్తుంది. మోక్షాన్ని కల్గిస్తుంది. చక్కగా ప్రకాశిస్తోంది.

**సంసారాధ్వని తాపభానుకిరణ ప్రోద్భూత దాహవ్యథా**
**ఖిన్నానాం జలకాంక్షయా మరుభువి భ్రాంత్యా పరిభ్రమ్యతామ్**
**అత్యాసన్న సుధాంబుధిం సుఖకరం బ్రహ్మాద్వయం దర్శయం**
**త్యేషా శంకర భారతీ విజయతే నిర్వాణ సంధాయినీ॥** **582**

జగద్గురు శ్రీ శంకర భగవత్పాదులు సంస్కృతంలో
రచించిన వివేకచూడామణికి
ఆచార్య సార్వభౌమ వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు రచించిన
ఆంధ్ర వివరణం సమాప్తం.



# గ్రంథకర్త పరిచయం

తల్లిదండ్రులు:
కీ॥శే॥ శ్రీమతి వేదుల రాజ్యలక్ష్మి-వేదుల కృష్ణమూర్తి

అత్తమామలు:
శ్రీమతి మరువాడ రామలక్ష్మి-కీ॥శే॥ మరువాడ వేంకటరమణ

| | |
|---|---|
| జననం | : దేవాడ (విజయనగరం జిల్లా) 22-9-1942 |
| విద్యాభ్యాసం | : విశాఖపట్టణంలోని సి.బి.యమ్. హైస్కూల్, మిసెస్.ఏ.వి.యన్. కాలేజీ, ఆంధ్రాయూనివర్సిటీ |
| విద్యార్హతలు | : తెలుగులోను సంస్కృతంలోను ఎం.ఏ., పి.హెచ్.డి. |
| ఉద్యోగం | : విశాఖపట్టణంలోని మిసెస్.ఏ.వి.యన్. కాలేజీలో లెక్చరర్ 1965-75, 1975-2002 ఆంధ్రా యూనివర్సిటీలో లెక్చరర్, రీడర్, ప్రొఫెసర్, హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంట్ ఆఫ్ తెలుగు, 1976లో విస్కాన్సిన్ స్టేట్ యూనివర్సిటీ, అమెరికా. |
| బిరుదములు | : ఆచార్య సార్వభౌమ, విజ్ఞాన వివేక విభూషణ, వాణీ విభూషణ, ఆధ్యాత్మికరత్న |
| ప్రధాన పురస్కారములు | : సువర్ణసింహ లలాటం - శ్రీ కంచికామకోటి మహాసంస్థానం - శంకరమఠం - విశాఖపట్టణం.<br>శివానంద ఎమినన్ట్ సిటిజన్ అవార్డ్ - సనాతన ధర్మ చారిటబుల్ ట్రస్ట్.<br>సువర్ణ కంకణం - శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానందస్వామి. |
| ముద్రిత గ్రంథాలు | : వరూధినీ ప్రవరమ్, తత్త్వమసి (సంస్కృత రూపకాలు), అష్టదిగ్గజాలు, భాగవతసుధ, తెలుగులో పంచతంత్ర చంపువు, ఆధ్యాత్మిక వ్యాసమంజరి, భారతంలో శాంతిపర్వం, భారతభారతి, సుబ్రహ్మణ్య భారతి, జానపద గేయ సాహిత్యప్రభ, శివానందలహరి వ్యాఖ్య, సౌందర్యలహరి వ్యాఖ్య, అధ్యాత్మరామాయణంలోని అపూర్వకల్పనలు, అధ్యాత్మ రామాయణం (అనువాదం), అద్భుత రామాయణం (అనువాదం), భాగవత రసాయనం, రామాయణంలో పురుషార్థాలు, బాల రామాయణం, వివేక చూడామణి (వివరణ), శ్రీమద్రామాయణే పురుషార్థ వివేకః - సంస్కృతం - అముద్రితం. |
| అభిరుచి | : వాగ్దేవతా వరివస్య - సాహిత్య, ఆధ్యాత్మిక ప్రసంగాలు. |
| చిరునామా | : శారదాపీఠం, 46-15-35, దొండపర్తి, విశాఖపట్టణం-530 016.<br>ఫోను: 0891-2541003, సెల్: 9490084217. |